# కలకలలాడే
# ముఖ కళకోసం కలికి కంటికి కాటుక

Shingar
DELUXE
KAJAL

నకిలీవి ఉంటాయి
జాగ్రత్త. కొనేముందు
ప్యాక్‌పై శింగార్ పేరు
చూసి మరీ కొనండి

కాటుక మీ కళ్ళను అందంగా తీర్చిదిద్దాలిగానీ, అటూ ఇటూ చెదిరిపోయి కళ్ళ చుట్టూ వ్యాపించేదయితే ఇక అందమేముంటుందిమరి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక, ఆ మామూలు కాటుకలమల్లే చెదిరిపోకుండా నిలిచి, అందాన్నీ, ఆరోగ్యాన్నీ చాటిచెప్పే మీ కళ్ళకు సహజమైన, ముగ్ధమనోహరమైన రూపాన్ని సమకూరుస్తుంది.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుకకు మీ వేలి కొన తగిలిస్తే చాలు, ఆ వేడికి కావలసినంత కాటుక మాత్రమే కరిగి మీ వేలికి అంటుతుంది. ఆ కాటుకను మీ కనుకొలకులలో రాసుకుని రెండు మూడు సార్లు వేలితో రుద్దుకుని చూడండి. ఆపైన మీ కళ్ళలో కోటి వెలుగులు చిందుతాయి. లక్షలాది భావాలు, భాషలు తొణికిసలాడతాయి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక మీ కళ్ళకు మేలైనది, సాటిలేనిది పశిపాపల సున్నితమైన కళ్ళకు అనువైనది.

everest/79/SH/117-tl

## దక్షిణభారతీయస్త్రీల కళ్ళల్లో
## కోటికాంతులను విరియింపజేసేందుకు

## శింగార్
డీలక్స్ కాజల్ (కాటుక)

# క్రొత్త స్టేఫ్రీ బెల్టులేని నేప్‌కిన్లు

OBM/1638 TEL



ఈ ఎడ్హెసివ్ పట్టీ నేప్‌కిన్‌ను మీ బిగువైన చెడ్డీలలో సురక్షితంగా నిలుపుతుంది.




## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవుసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేప్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోసం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.




### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చెటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మ నిలిచి పోతుంది. మరి. 3–వైపులా ప్లాస్టిక్ షీల్డ్ నేఫ్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు!

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి–400 036




# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 5   సంచిక : 2

ఆగస్ట్ : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


## పురుషులంటే ఎవరు?

"అబలలు – అసమానతలు" అంటూ జూలై సంచికలో వచ్చిన వ్యాసం చదివాక యీ నాలుగు ముక్కలు చెప్పాలనుకుంటున్నాను. మనం మన భావాలు ఎప్పుడూ కరెక్ట్ అనుకోడానికీ, అదే పనిగా పురుషుల్ని దుమ్మెత్తి పోయడానికీ లేదు. ఏదైనా ఒక విషయం చర్చించేటప్పుడు రెండు పక్కలా ఆలోచించాలి గదా.

నిజానికి స్త్రీలకు 'అభ్యుదయం' అంటూ ఆలోచనలు రేకెత్తించినవాడు పురుషుడే గదా. కూపస్థ మండూకంలా వున్న సంగతి కూడా గ్రహించుకోలేని ఆడవాళ్ళలో 'మనసు' స్త్రీలకూ వుందని గుర్తించనవాళ్ళు గురజాడ, వీరేశలింగం, శరత్....వీరంతా పురుషులు కారా? దుష్టులు - దుర్మార్గులు సంకుచిత స్వభావులు కేవలం పురుషుల్లోనే వున్నారంటారా? ఒక చెడిపోయిన స్త్రీ గృహిణిగా మనందరి మధ్యకు వచ్చి కాపురం పెడితే పురుషుల మాట వదిలేయండి, కాకుల్లా పొడవని స్త్రీలెందరు? సహృదయంతో చూసేవారు ఎందరు?

స్త్రీకి విద్య కావాలని ఎలుగెత్తి చాటింది ఎవరు? పురుషులు దారి చూపితే వెనక నిలబడి నినాదాలు చేయడం, స్త్రీ స్వాతంత్ర్యం అంటూ లెక్చర్లు యివ్వడం నేర్చుకున్నది ఎవరి ద్వారా?

ఇదంతా చదివి బహుశా నేను స్త్రీ జన అభ్యుదయ వ్యతిరేకినని అనుకునేరు సుమా—అలా ఎప్పటికీ కాదు. పురుషుడు అంటే ఎవరో ఆకాశంలోంచి వూడిపడిన వింత వ్యక్తి కాదు, ఒక సోదరుడిగా, భర్తగా, తండ్రిగా మనతో కలిసిపోయి వున్న మనిషి అని గుర్తించమంటున్నాను.

**సుచరిత** **ఉరవకొండ**

## వరకట్నపు పిశాచాల కోరల్లో....

ఎక్కువగా కట్నాలు ఇవ్వలేని వివాహితులను వారి అత్తింటివారు సజీవంగా దహనం చేస్తున్నారన్న వార్తలు ఈ మధ్య దినపత్రికలలో కానవస్తున్నాయి. వరకట్న నిషేధ చట్టాన్ని సవరించి పటిష్టంగా రూపొందించాలని కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తూందిట. కాని పరువు ప్రతిష్ఠల దృష్ట్యా దర్యాప్తులు జరపడానికి వీలులేకపోతూందని రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రానికి విన్నపం చేసాయి. 1961



ఈ సంచికలో వచ్చిన 'నీడ' కథ (55 వ పేజీ) రాసిన శ్రీమతి శ్యామలావిహారి-భర్త ఉద్యోగ రీత్యా కర్ణాటక రాష్ట్రంలోని ధార్వార్‌లో వుంటున్నారు; స్వస్థలం – మచిలీపట్నం. ఆమె రాసిన కథలు లోగడ చాలా పత్రికల్లో వచ్చాయి. 'వనిత'లో కూడా ఇదివరలో 'కాఠిన్యం' అన్న కథ వచ్చింది. 'రాయడం కన్న చదవడం అంటే ఎక్కువ ఇష్టం' అంటున్నారు ఆమె.



"ఔరా! పురుషులెంతటి...." అన్న రచన (68 వ పేజీ) చేసిన కుమారి మాడుగుల కృష్ణకుమారి–విజయవాడ, రాజమండ్రిలలో విద్యాభ్యాసం చేశారు. 'వనిత'లో లోగడ 'ఇల్లాలి ఇరవై సూత్రాలు' అన్న చిట్టికథ రాశారు. చిన్నప్పట్నుంచి సాహిత్యాభిలాష ఎక్కువ కావడంతో, రచనలు చెయ్యడం మీద ఆసక్తి పెరిగి పలు రచనలు చేస్తున్నారు. చాలా పత్రికల్లో ఆమె రచనలు వచ్చాయి. మంచి రచనలు చెయ్యాలన్నదే తన లక్ష్యమనీ, త్వరలోనే నవలా రచయిత్రిగా కూడా గుర్తింపబడబోతున్నాననీ, చెబుతున్నారు కృష్ణకుమారి.



'నివురు కప్పిన నిప్పు' (12 వ పేజీ) కథ రాసిన శ్రీమతి యస్. పద్మలత – కాగజ్‌నగర్‌లో భర్త ఉద్యోగం చేస్తుండడం చేత, అక్కడ వుంటున్నారు. పి. యు. సి. వరకూ చదివారు. "మంచి మంచి కథలు చదవడం అంటే చాలా యిష్టం. రాయడం కూడా అలవాటు చేసుకుంటున్నాను. ఇది నా మొదటి కథ. నా మొదటి కథను ప్రచురించి, నన్ను ప్రోత్సహిస్తున్నందుకు 'వనిత'కు కృతజ్ఞురాలను" అంటున్నారామె.

వరకట్న నిషేధ చట్టం ప్రకారం పెండ్లికి ముందు గాని, తరువాతగాని కట్నం ఇవ్వడంగాని, పుచ్చుకోవడంగాని నేరమని, దీనికి 6 నెలల కారాగార శిక్ష లేక 5 వేల రూపాయిల జరిమానా విధించడం — జరుగుతుంది. కాని చట్టాల ద్వారా మనుషులలో పరివర్తన కలగడం అన్నది కలలో మాట. ఇది ప్రతీవాడి హృదయం నుంచి రావాలి. ఎవరికి వారు వ్యక్తిగతంగా ఆలోచించాలి. ఎదుటివారి ఇబ్బందులను గమనించాలి. ప్రభుత్వ ఉద్యోగ నియమావళి దృష్ట్యా ప్రభుత్వోద్యోగి ఇటువంటి చర్యలకు పాల్పడరాదని, వీటిని ప్రేరేపించడం గాని చేయకూడదు. కాని ఈ నియమావళి కూడా కేవలం వ్రాతలలోనే మిగిలిపోయింది. దీనికి పరిష్కారం సామూహిక వివాహాలకు ప్రోత్సాహం ఇవ్వడమే అని కేంద్ర ప్రభుత్వం చెబుతున్నా ఇది వ్యక్తిగతమయిన విషయమే కాని చట్టాల ద్వారా, శాసనాల ద్వారా నిర్మూలించడం దుస్సాధ్యం.

**డి. నాగపద్మావతి** — **శ్రీకాకుళం**

## ఎక్కడుంది మనలో మానవత్వం?

ఒక హరిజనుడు గ్రామ సర్పంచ్ భార్యకు చేతబడి చేయడంతో ఆమె మరణించిందనే శంకతో అతనిని, అతని తల్లినీ చిత్రవధ చేసి పళ్ళూడబెరికిన వైనం సర్వవ్యాప్తంగా వెలువడిన పత్రికల మూలంగా అందరికి విదితమే. ఇలాంటి అన్యాయాలు వారానికోసారి, నెలకోసారి వినరావడం, చదివినప్పుడు అయ్యో పాపం అనుకొని, తర్వాత కాలగతిలో మర్చిపోవడం మనకు పరిపాటి. స్త్రీగా మనం యిలాటి దురాగతాలు అరికట్టడానికి ఏమైనా చేయగలమా? మనం మన యిళ్ళలో పనిచేసే పనివాళ్ళు, యింకా యితరులను ఏ విధంగా గౌరవిస్తున్నాం? వాళ్ళు రానిదే ఒక్క రోజు గడవడం క్లిష్టమైపోతుంది. అయినా వారు చేసే పనికి గుర్తింపు లేదు. ఇంట్లో ఏ చిన్న దొంగతనం జరిగినా సరే, మొదట మన దృష్టి పనిమనిషి మీదకు పోతుంది. దానికి కారణం వారి దరిద్రమే. 'జన్మతః అందరం సమానులం' అని చెప్పవలసిన మాతృ మూర్తులు, తామే మార్గదర్శకులు కాలేకపోతే యీ లోకగతి ఏనాటికీ యింతే. ప్రతి స్త్రీ చిన్నతనం నుంచి తోటివారిని సహృదయంతో చూడాలి కులరాహిత్యం, మంచి చెడుల విచక్షణ తమ బిడ్డలకు విధిగా నేర్పాలి. వారిలో సంకుచిత స్వభావాన్ని తుదముట్టించాలి.

**గోళ్ళ విజయశ్రీ గుప్త** — **విజయవాడ**



## ముఖచిత్రం

# కరేన్ కుమార్

అట్టమీద కనిపిస్తున్న కుమారి కరేన్ కుమార్ - భరత నాట్యంలోనూ, చిత్రలేఖనంలోనూ మంచి పేరు తెచ్చుకున్నది. బాస్కెట్ బాల్ ఆటలోనూ, ఈతలోనూ కూడా చక్కటి నైపుణ్యం వుంది. ఈ మధ్యనే సరదాకి మోడలింగ్ ప్రారంభించి కొన్ని వ్యాపార ప్రకటనా సంస్థలకి 'ఫ్యాషన్ మోడల్'గా వుండి పలువురి దృష్టినీ ఆకర్షించింది. కరేన్ ముత్తాతగారైన రంగనాథ మొదలియార్ పూర్వపు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా వుండేవారు. ఆయన ఆదర్శవాది. తన ఆదర్శాలకి అనుగుణంగా తన కుమార్తె జయని ఒక పంజాబీ యువకుడికి యిచ్చి వివాహం చేశారు. తల్లిదండ్రులు ఇంగ్లండులో స్థిరనివాసం ఏర్పరచుకోవడంతో కరేన్ తన బామ్మగారైన జయ సంరక్షణలోనే పెరిగింది. ఆవిడ ప్రోత్సాహంతోనే మద్రాసు కళాక్షేత్రలో విద్యనభ్యసిస్తూనే భరతనాట్యం కూడా నేర్చుకుంది. మెట్రిక్ పూర్తి చేసిన కరేన్ ప్రస్తుతం ఉన్నత విద్య అభ్యసించడానికి. ఇంగ్లండులోని తన తల్లిదండ్రుల వద్దకు వెళ్తోంది. "అయితే చదువు పూర్తయిన తరువాత ఏం చేస్తానో నిర్ణయించుకోలేదు. కాని సృజనాత్మకమైన పనేదైనా చేపట్టాలని వుంది" అన్నది కరేన్.

వర్ణచిత్రం : సత్యకుమార్

## చావు పరిష్కారం కాదు!

జీవితం మనిషికి దేముడిచ్చిన వరం. అనుభవాలను బట్టి అది అనేకరకాలుగా నిర్వచించబడుతూంటుంది. ఆశావాదులు జీవితాన్ని ఆశయంతో ఆత్మవిశ్వాసంతో నెగ్గుకు రావడానిక్కి ప్రయత్నిస్తారు. నిరాశావాదులు నిరుత్సాహంతో, నీరుగారిపోతూ ప్రతిక్షణం భారంగా భావిస్తారు. ఏది ఏమయినా కొందరనుకున్నట్లు జీవించడం పాపంకాదు. జీవితం శాపంకాదు. ఉపోద్ఘాతాన్నుంచి అసలు విషయానికొస్తే 'ఆత్మహత్య' - అతి విచిత్రమైన మానసిక దౌర్బల్యానికి సంకేతం. ఎందుకంటే, సర్వ సమస్యలకూ చావే పరిష్కారమనుకుని నిండైన నూరేళ్ళ జీవితాన్ని, మనిషి - తానుగా సంకల్పించి నిమిషంలో నిరాశావాదంతో బలి చేసుకుంటున్నాడంటే-అదెంతటి విచిత్ర వ్యక్తిత్వం!.... చావే జీవిత పరమావధి అనుకుంటే ఇంక 'జీవితం' అనే చదరంగపు ఆటలో తమాషా ఏముంది?....

ఇటీవల వెలువడిన కొన్ని అంచనాలను బట్టి 'ఆత్మహత్యలు' అనేవి ఎక్కువశాతం ఆడవాళ్ళలోనే సంభవిస్తున్నాయని తెలిసిందిట. ఇది నిజంగా స్త్రీ జాతి పురోగమనానికే గొడ్డలి పెట్టు. ఆడది — తీవ్ర సామాజిక శక్తుల నెదిరించి సతీసహగమనం అనబడే ఒకనాటి బూజుపట్టిన సాంఘిక దురాచారాన్నుంచి బయటపడి బయట ప్రపంచాన పురుషునితో సమానంగా పురోగమిస్తున్న ఈ శుభ సమయంలో ప్రతి స్త్రీ గుండె నిబ్బరంతో, ఆత్మ విశ్వాసంతో ముందడుగు వేయడానికే ఉద్యుక్తురాలు కావాలి. అంతే కాని పరిస్థితుల సమ్మెట దెబ్బలకు, సమాజానికి జడిసిపోయి, పురోగామి దశలో వున్న స్త్రీజాతి ప్రగతి పథాన్ని మరచిపోయి నిరాశతో, నిస్తేజంతో నిండైన జీవితాన్ని 'ఆత్మహత్య' అనబడే భయంకర రూపాన అంతం చేసుకోవడం నిజంగా తెలివి తక్కువ తనమే అవుతుంది. 'చచ్చిసాధించేదేమిటి?' - అనేది ఒక విశేష ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానమే జీవితాన్ని సవాలుగా ఎదుర్కొని ఎదురు నిలవడం. మహిళకు కావలసింది మగవాడితో సమానమయిన హక్కులకన్నా, మనోనిబ్బరం, ఆత్మవిశ్వాసం, ఆ రెండు మాత్రమే మహిళల జీవితాన్ని ఆనందమయం చేయగల సాధనాలు!....

**వసులక్ష్మి భగవాన్** — **శ్రీకాకుళం**




'కృష్ణవేణి' సీరియల్ ముగింపు చాలా చక్కగా ఉన్నది. కేరళ సుందరి అను వర్ణ చిత్రం చూడ ఇంపుగా యున్నది.

—జి. లక్ష్మీబాయి, ఖర్గపూర్

"కృష్ణవేణి" మా కెంతో ఆహ్లాదం కల్గించినది. కథ ముగించిన తీరు చాల బాగుంది. రచయిత్రి శ్రీమతి విమలారామంగారికి హృదయపూర్వక అభినందనలు. బామ్మగారి పేజీ విజ్ఞానదాయకంగా ఉంటున్నది.

—డి. సుజాత, సునీత, మాధవి, మమత, కొలనూరు

'కృష్ణవేణి' సీరియల్ బాగుంది. ముగింపు మేము ఊహించినట్లుగా జరిగినప్పటికీ, తిరిగి 'కృష్ణవేణి' అందరితో కలసి సుఖంగా ఉన్నా మామగారు చచ్చిపోవడమూ, అత్తగారు పక్షవాతమూ ఇటువంటి కొన్ని కొన్ని మార్పులవలన కథ పూర్తిగా సంతృప్తిగా అనిపించలేదు. కానీ కథని మొదటినుండీ కూడ విసుగురానీకుండా చదవడానికి ఉత్సాహకరంగా ఉండేలా రచయిత్రి మలచిన తీరు ప్రశంసనీయం. 'బామ్మగారి పేజీ' అనవసరం అనిపిస్తూంది.

—ఎ. విశాలి, కల్పాక్కం

విమలారామంగారి "కృష్ణవేణి" సీరియల్ నవల ముగింపు అద్భుతంగా ఉంది. సెంటర్ స్ప్రెడ్‌లో ప్రచురించిన "రవివర్మ వర్ణచిత్రం" 'కేరళసుందరి" జీవకళ ఉట్టిపడే విధంగా మరియు రమణీయంగా ఉంది.

—లోకం సరస్వతీ నర్సయ్య, నవీపేట

జులను రామలక్ష్మిగారి 'అబలలు-అసమానతలు' వ్యాసం చదివాను. రామలక్ష్మిగారు "భరతనాట్యం" పేరిట స్త్రీని అర్ధనగ్నంగా చేసి మగాడు ఆహ్లాదం పొందుతాడు—అని వ్రాశారు. కాని భరతనాట్య వస్త్రధారణలో అసభ్యత ఎక్కడా కనిపించదు.

—యస్. ప్రమద, కదిరి

మీరు వనితలో ప్రచురించుచున్న సంస్కృత పాఠమాల మరియు భాషలు నేర్చుకోండి అను శీర్షిక ద్వారా తమిళం, సంస్కృతం, నేర్చుకోవాలన్న మా కోరికను నెరవేర్చారు. ఏ పత్రికలోను భాషలను అభివృద్ధి పరుచు శీర్షికలు లేవు. మీ పత్రికలో ఈ శీర్షికలను ప్రచరించుచున్నందుకు మీరు ఎంతైన అభినందనీయులు.

—ఎ. నిర్మల, హైద్రాబాదు

అర్ధనగ్నంగా ఉన్న రవివర్మ వర్ణచిత్రం చూడటానికి ఎంతో అసభ్యంగా ఉంది. పుట్టిన రోజులు శీర్షిక ఇంతటితో నిలిపివేస్తే బాగుంటుంది.

—విజయపద్మ, గంగావేణి నవిపేట్

రవివర్మగారి వర్ణచిత్రం కేరళ సుందరి చాలా అసభ్యంగా వున్నది వనిత అంటే వనితలు మాత్రం చదవరు. ఇంట్లో వుండే ఇంటిల్లి పాది మొగవాళ్ళు పిల్లలు అందరు చదువుతారు కాబట్టి ఇకమీదట ఇటువంటి అసభ్యమయిన చిత్రాలు వేయవద్దు.

—వి. సి. మద్రాసు

వనితలో సినీరంగం ప్రసక్తిలేదు కదా! అలాంటప్పుడు మరి సినిమా ప్రకటనలు మాత్రం ఎందుకు వేస్తున్నారు? అవిగూడ లేకుంటే బాగుంటుంది.

—ఆర్. ఇందిరాశేఖర్, కోరగుంటపల్లి

## చిట్టికథలు

లోగడ 'వనిత'లో మీరు 'చిట్టికథలు' పేరిట ఎన్నో కథలు చదివారు. ఆ కోవలో మీరు కూడా చిట్టికథలు రాసి పంపడానికి ప్రయత్నించకూడదూ?—

కథలు రాయాలని ఉత్సాహపడేవారు ఏ చిన్న సంఘటననయినా తీసుకుని 'చిట్టి కథ'గా రాయవచ్చును; కథలు రాయడం మీద తమకు గల ఉత్సాహన్ని పెంపు చేసుకోవచ్చును.

రావు సైజులో పేజీన్నరకు మించకుండా వుండే మీ చిట్టికథ ఏమాత్రం బాగున్నా సవరించి, ప్రచురించడానికి 'వనిత' సిద్ధంగా వుంది.

ప్రచురించి చిట్టి పారితోషికం కూడా పంపుకుంటుంది!

మరి, ప్రయత్నించండి!

## లోపల



# వనిత సంవత్సర పరీక్ష

ఈ సంవత్సరం కూడా 'వనిత సంవత్సర పరీక్ష'లో మీరు పాల్గొంటున్నారా?—

కింద పదిహేను ప్రశ్నలున్నాయి. ఆ పదిహేను ప్రశ్నలకి సమాధానాలు – జూలై 78 నుంచి జూన్ 79 వరకూ వచ్చిన 'వనిత' సంచికల్లో వుంటాయి. మీరు చెయ్యవలసిందల్లా ఓపిగ్గా సమాధానాల కోసం వెతకడమే! (కొన్ని ప్రశ్నలకు మీరే, మీ వూహతో సమాధానాలు రాయాలి.) సమాధానాలు వేరే కాగితాల మీద, ఈ ప్రశ్నల నెంబర్లు ఉదహరిస్తూ రాసి, కింద వున్న కూపను పూర్తి చేసి, దాన్ని సమాధానాల కాగితాలతో జత చేసి, జూలై 16 వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి. కవరు మీద 'వనిత సంవత్సర పరీక్ష' అని పైన రాసి—కింద వనిత చిరునామా రాయాలి. సమాధానాలు సరిగ్గా రాస్తూ తక్కినవి కూడా బాగా రాసినవారందరికీ "ఉపయోగకరమైన బహుమతి"ని (లను) పంపుతాము. గెలుపొందిన వారి పేర్లు సెప్టెంబర్ సంచికలో ప్రచురింపబడతాయి.

1. రవివర్మ గురించి నాలుగు వాక్యాల్లో రాయండి. ఈ సంవత్సరంలో (జూలై 78 – జూన్ 79) 'వనిత'లో ఆయన వర్ణ చిత్రాలు మీరు చూసినవి ఏమిటి?

2. "నాకు ఏ కమిటీల్లోనూ వుండడం ఇష్టం లేదు. పట్టి బలవంతాన, మర్యాదకోసం ఏదో ఫంక్షన్‌కి వెళ్తాను. గాని, నాకు దేనిలోనూ ఆసక్తిలేదు" అని చెప్పినవారెవరు? ఆమె గురించి రెండు వాక్యాలు రాయండి.

3. ఒలియా ఒర్లోవా ఎవరు? నాలుగు వాక్యాల్లో రాయండి.

4. చైనాలో స్త్రీల ప్రగతి, భారతీయ వైద్య విధానం, వికలాంగుల పాలిటి కల్పతరువు, విమెన్స్ ఇండియా ట్రస్ట్, బాలల స్వర్గం అన్న వ్యాసాలు ఏ ఏ సంచికల్లో వచ్చాయి?

5. ఈ పన్నెండు సంచికల్లోనూ మీకు నచ్చిన కథ ఏది? ఎందువల్ల? (పదిహేను వాక్యాల్లో రాస్తేచాలు)

6. ఈ సంచికల్లో వచ్చిన ముగ్గుల్లో ఏదో ఒక ముగ్గును–మీరు సులువు అనుకునేదాన్ని— పుస్తకంలో వున్న సైజు కంటె కాస్త పెద్ద సైజులో తెల్ల కాగితం మీద నీటుగా వెయ్యాలి.

7. కనుపర్తి వరలక్ష్మమ్మ గురించి మీరు చదివినది ఏమిటి? ఆమె గురించి మూడు వాక్యాలు రాయండి.

8. మొత్తం పన్నెండు సంచికల్లోనూ ఎన్ని గేయాలు వచ్చాయి? వాటి పేర్లు? అవి రాసిన వారి పేర్లు?

9. ఆషా పద్మనాభన్, వాహీరా, రెబెకా టుల్లీ, కనక్ రెలే, ఫా రా హె హ్లా వి, అముద, మోహనా ఈశ్వరన్, అరవింద, నివేదిత, స్వెత్లానా సవితస్కాయా అన్న వారెవరు?

10. "కాస్త చీకటి పడిందేమో – బజారంతా దీపాలతో అందంగా మారింది. రోడ్డు మీద ఎన్నో జంటలు. ప్రతి జంటనీ పరీక్షగా చూస్తోంది. అందులో చాలామంది తనకంటె చిన్నవారే – సరదాగా సంతోషంగా భర్త పక్కన నడుస్తూ చక్కగా నవ్వుకుంటూ వెళ్ళుతున్నారు" అన్న వాక్యాలు ఏ కథ లోనివి? రాసిన వారెవరు?

11. కవితా చింతామణి, కమలా వరదాచారి, బి. విజయలత, శకుంతలాబాలు, చిట్టా పద్మావతి, ప్రేమనారాయణ్, నందారణిని, ఓడపాటి కృష్ణవేణి, మాటేటి ఇందిరాదేవి, దేవయాని! అన్న పేర్లు గలవారు రాసినవి ఏమిటి?

12. "నాకు తరచు జలుబు చేస్తూ వుంటుంది. ముక్కు మూసుకుపోయి పని చెయ్యకపోవడంతో నోటితోనే శ్వాస పీల్చవలసి వస్తుంది. కారణాలూ నివారణోపాయాలూ చెప్పండి" అన్న ప్రశ్న, ఏ శీర్షికలో వచ్చింది? సమాధానం ఏమిటి?

13. ఎన్‌కాడ్, నియూసిన్, వస్తి, కల్లినన్, జన్ వాసా, ఆర్మిస్టిస్ డే, ఆఫిస్, సింఫీ, ప్లుటోనియమ్, బేరియమ్ నైట్రేట్ – అంటే ఏమిటో ఒక్కో వాక్యంలో తెలియజేయండి.

14. 'తెలిసి చేసిన పాపం' — సారాంశాన్ని పది వాక్యాల్లో తెలియజేయండి.

15. ఈ పన్నెండు సంచికల్లోనూ మీకు నచ్చిన రచనలు ఏవి? ఎందువల్ల? పది వాక్యాల్లో తెలియజేయండి.

పేరు ..........................................................

చిరునామా ..........................................................

..........................................................

..........................................................

# ప్రపంచం

ఈ శతాబ్దంలో విజ్ఞానశాస్త్రం కొత్త పుంతలు తొక్కడంతో మానవుడు ఊహకందని విజయాలు సాధించడం మొదలుపెట్టాడు. 'నేలవిడిచి సాము' చేసి రోదసిలో పరిశోధనలు ప్రారంభించాడు. అటువంటి పరిశోధనలకి ఉపకరించిన 'అంతరిక్ష పరిశోధనాలయం' - స్కైలాబ్-యిటీవల ప్రపంచ వార్తలలో ప్రముఖ స్థానం ఆక్రమించింది.

1973 మే 14న రోదసిలో పరిశోధనల నిమిత్తం అమెరికా 'స్కైలాబ్'ని ప్రయోగించింది. 1957లో సోవియట్ రష్యా మొదటి సారిగా ఒక కృత్రిమ ఉపగ్రహాన్ని ప్రయోగించింది. ఆ రోజు నుంచి రష్యా, అమెరికాలు పోటీపడి రోదసిలో ప్రయోగాలు ప్రారంభించాయి. కొత్త విజయాలు సాధిస్తూ మానవుడికి ఎన్నో లాభాలు చేకూర్చడానికి విజ్ఞానశాస్త్రాన్ని వినియోగించడం మొదలు పెట్టాయి.

అమెరికా ప్రయోగించిన 'స్కైలాబ్' యింత వరకూ రోదసిలోకి పంపబడిన వస్తువులన్నిటికన్నా పెద్దది. దాని బరువు 85 టన్నులు. 'స్కైలాబ్'ని ప్రయోగించడానికి అమెరికా 250 కోట్ల డాలర్లు ఖర్చుచేసింది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, తోకచుక్కలు వీటి గురించి ప్రధానంగా పరిశోధనలు జరపడానికి, భారరహితస్థితిలో మానవుడి స్థితి గతులని పరిశీలించడానికి 'స్కైలాబ్'ని రూపొందించి ప్రయోగించారు.

'స్కైలాబ్'ని ప్రయోగించిన తర్వాత మూడు సార్లు రాకెట్ల ద్వారా, ఒకొక్కసారి ముగ్గురు చొప్పున మొత్తం తొమ్మిదిమంది అంతరిక్ష యాత్రికులను అమెరికా పంపి రోదసిలో అద్భుత పరిశోధనలు జరిపించింది. 'స్కైలాబ్' సహాయంతో ఆ పరిశోధనలు పూర్తయ్యాక వారు సురక్షితంగా భూమికి తిరిగి వచ్చారు.

అలా 'స్కైలాబ్'ని వినియోగించుకుని, అనేక రోదసీ రహస్యాలు పసిగట్టడంతో దానిని ప్రయోగించిన ఫలితం లభించినా మరో విపత్తుని అది తెచ్చిపెట్టింది. గంటకి 2,000 కిలోమీటర్ల వేగంతో స్కైలాబ్‌లో కొంత భాగం భూమి మీద పడుతోందన్న వార్త ప్రపంచాన్ని కలవరపరిచింది. ఈ ప్రమాదం అమెరికా వంటి దేశం 'స్కైలాబ్'ని ప్రయోగించేటప్పుడు ముందుగా ఊహించలేకపోయిందా?

*

ఆధునిక ఆర్థికవ్యవస్థ ఒక దేశం మరొక దేశానికి అందచేసే సహాయం మీద ఎంతో ఆధారపడి వుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఒకటయిన భారతదేశానికి గత కొద్ది సంవత్సరాలలో సోవియట్ రష్యా నుంచి ఎంతో సహాయం లభించింది. అటువంటి సహాయంతోనే తెలుగువారి యింట భిలాయ్‌తో సమానమయిన మరొక ఉక్కు కర్మాగారం వెలుగు చూడబోతోంది. ఈ కర్మాగారం నిర్మాణానికి 2500 కోట్ల రూపాయల ఋణాన్ని సోవియట్ రష్యా భారతదేశానికి అందచేస్తోంది. ఇంతవరకూ సోవియట్ రష్యా భారతదేశానికి సహాయంగా అందచేసిన మొత్తం కంటె యిది ఎక్కువకావడం విశేషం. ఒక దేశం పారిశ్రామిక ప్రగతి సాధించడానికి ఉక్కు ఎంతో అవసరం. భారత దేశంలో రైల్వేలకి, నౌకాశ్రయాలకి, వంతెనలకి నిర్మాణంలో అవసరమయిన ఉక్కు సామగ్రి విశాఖ కర్మాగారంలో ఉత్పత్తి అవుతుంది. అలా ఆంధ్రప్రదేశ్ ఆర్థిక స్వరూపం మెరుగవుతుంది.

ఒక పారిశ్రామిక రంగంలోనే కాక విజ్ఞాన రంగంలోనూ సోవియట్ రష్యా భారతదేశానికి అందచేసిన సహాయపు సత్ఫలితాలు ఈ మధ్య వార్తలలో చోటు చేసుకున్నాయి. 1980లో ఆరు వందల కిలోల బరువు గల "భాస్కర - 2" భారతీయ ఉపగ్రహ ప్రయోగానికి సోవియట్ రష్యా సహాయం అందచేయడానికి అంగీకరించింది. 1975లో 360 కిలోగ్రాముల 'ఆర్యభట్ట' ఉపగ్రహాన్ని, నిన్నకాకమొన్న 440 కిలోగ్రాముల బరువుగల 'భాస్కర' ఉపగ్రహాన్ని మన దేశం ప్రయోగించింది. ఈ రెండు ఉపగ్రహాలను భారత దేశం నిర్మిస్తే వాటి ప్రయోగం మటుకు, భారత దేశంలో ఉపగ్రహాల ప్రయోగానికి తగిన రాకెట్లు లేకపోవడంతో రష్యా నుంచి జరిగింది. అంతరిక్ష పరిశోధనలు శాంతియుత ప్రయోజనాలకోసం వుద్దేశించి ఈ ఉపగ్రహాలను రష్యా సాంకేతిక సహకారంతో భారతదేశం ప్రయోగిస్తోంది. 'భాస్కర'లోని రెండు టెలివిజన్ కెమేరాలు దేశంలోని ఖనిజ సంపదని, సహజ వనరులని ఫోటోలు తీస్తూ వుంటే, మూడు రేడియో మీటర్లు భూమి, సముద్రం మీద ఉష్ణోగ్రత, గాలిలో తేమ, సముద్రతరంగాల ఉద్రిక్తత గురించి సమాచారం సేకరిస్తాయి. అలా అంతరిక్ష పరిశోధనలలో అగ్రరాజ్యాల సరసన భారతదేశం నిలబడడానికి సోవియట్ రష్యా మరొకసారి స్నేహహస్తం అందించింది.

*

ఈ మధ్య ప్రపంచ దేశాలన్నిటిలోనూ 'సాల్ట్' అనే పదం వినిపించింది. "స్ట్రాటజిక్ ఆర్మ్ లిమిటేషన్ ట్రీటీ" అన్నది దీని వివరణ. అంటే కీలకాయుధాల పరిమితి ఒప్పందం.

అణుయుద్ధ ప్రమాదాన్ని అరికట్టడానికి, మారణ యుధాలతో మారణహోమం జరగకుండా ఆపడానికి, శాంతియుత సహజీవనం కొనసాగడానికి రష్యా అధ్యక్షుడు బ్రెజ్నేవ్, అమెరికా అధ్యక్షుడు కార్టర్ వియన్నాలో 'సాల్ట్ - 2' ఒప్పందం మీద సంతకాలు పెట్టారు.

అణ్వస్త్రాలు తయారుచేయడంలో అగ్రరాజ్యాలయిన అమెరికా, రష్యాలు కీలకాయుధాలు పరిమితి చేసుకోవాలని నిర్ణయించుకుంటే ప్రపంచ శాంతికి అదే మొదటి మెట్టని అందరూ భావిస్తూ వచ్చారు. ఆ ప్రకారం 1972లో మొదటి 'సాల్ట్' ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం మీద అమెరికా తరపున నిక్సన్, రష్యా తరపున బ్రెజ్నేవ్ సంతకాలు చేశారు.

అణ్వస్త్రాలతోపాటు మారణాయుధాలను ఉత్పత్తి చేయడం తగ్గించుకోవాలని రెండవ 'సాల్ట్' ఒప్పందంలో అంగీకరించారు. అలాగే రానున్న సంవత్సరాలలో సైనిక వ్యయాన్ని పరిమితం చేయాలని ఆమోదించారు. ఈ ఒప్పందం 1985 వరకూ అమలులో వుంటుంది.

అమెరికా, రష్యాల దగ్గరవున్న మారణాయుధాలతో ప్రపంచాన్ని ఒక్కసారి కాదు పన్నెండుసార్లు నాశనం చేయవచ్చని అంచనా కట్టారు! అటువంటి ప్రమాదం నుంచి తప్పించి ప్రపంచం ఒక్కసారి కూడా నాశనం కాకుండా 'సాల్ట్' ఒప్పందం రక్షణ ఏర్పరుస్తోంది. తాము పెట్టిన సంతకం విలువని కాపాడుకుంటారని ఆశిద్దాం. □



# రాధా ప్రసాదరావు

ఆ రోజు వైకుంఠ ఏకాదశి. భద్రాద్రి రాముడి గుడిలో వేడుకలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి. ఆ వేడుకలలో ఒక భాగం - పవిత్ర గోదావరీ జలాలలో జరిగే 'తెప్పోత్సవం'. ఆ ఉత్సవం చూడడానికి వేలాదిమంది భక్తులు ఒడ్డు చుట్టూ కూర్చుని వున్నారు. నదిలో - అందంగా అలంకరించబడిన 'హంస వాహనం' అని పిలవబడే పడవ. ఆ పడవలో గరుడ వాహనం మీద శ్రీరామచంద్రుని విగ్రహం. ఆ విగ్రహం ముందు భక్తి ప్రపత్తులతో వేదమంత్రాలు ఉచ్చరిస్తున్న పూజారులు. తన్మయంతో శ్రీరాముని మీద భక్తి గీతాలు పాడుతున్న బృందం. భూమి మీద జరుగుతున్న ఈ వేడుకలను దేవలోకానికి తెలియబరచడానికా అన్నట్లు నలువైపులనుంచి ఆకాశంలోకి దూసుకుపోతున్న తారాజువ్వలు, బాణాసంచా.... వీటన్నిటితో అక్కడి దృశ్యం కన్నుల పండువగా వున్నది.

ఆ పడవలోనే ఒకచోట రంగస్థలం అమర్చారు. చక్కగా చూడ ముచ్చటగా అలంకరించారు. ఒక వైపు పూజలు జరుగుతూ వుండగానే మరోవైపు రంగస్థలం మీద అలనాటి రామాయణ గాథ నృత్య రూపంలో పునరావృతం చేయబడుతున్నది.

రామాయణంలోని వివిధ అంశాలను దృశ్య కావ్యంగా మలచి చూపుతున్న ఆ నర్తకి చివరి అంశంగా భక్త రామదాసు 'ఏతనున్నాడో-భద్రాది వాసుడు' అంటూ అనుభవించిన మానసిక వేదనని ఎంతో హృద్యమంగా ప్రదర్శిస్తోంది....

గోల్కొండ జైలులో మానసికంగా చిత్ర వధ అనుభవిస్తూ వుంటాడు రామదాసు. ఆ సమయంలో శ్రీరామచంద్రుని వుద్దేశించి - 'విష్ణుమూర్తి అవతారమైన నీవు మునుపు గజేంద్రుడినీ, పసికందు పరీక్షిత్తుని, ద్రౌపదినీ వారి మొరలాలకించి కాపాడినావే....అలా ఎందరినో ఆదుకున్నావు. నన్నెందుకయ్యా ఇలా చిన్న చూపు చూస్తున్నావు' అంటూ తన ఆవేదనని వ్యక్తం చేసే దృశ్యం అది.

ఆ దృశ్యాన్ని నర్తకి నృత్య భంగిమలలో చూసిన ప్రేక్షకులు అలనాటి గాథ తమ కనుల ముందు జరుగుతున్నట్లుగా అనుభూతి చెందారు. మెల్లమెల్లగా కదులుతున్న పడవతోపాటే తన్మయత్వంతో వారు కూడా వూగసాగారు.

ఆ నాట్యాన్ని అంత చక్కగా రక్తి కట్టించిన ఆ నర్తకి - కుమారి రాధా ప్రసాదరావు!

భక్తి పారవశ్యంతో, తన్మయత్వంతో ఆమె ఆ నృత్యంలో లీనమైపోయింది. నాలుగుగంటల సేపు ఏకధాటిగా నాట్యం చేసినా అలసట ఎరుగక అందర్నీ ఆకట్టుకోగలిగింది.



ఇది 1977లో జరిగింది. కానీ ఆ నాట్యం చూసిన వారు నేటికీ చెప్పుకుంటూ వుంటారు, వారి హృదయాలలో అంతటి ముద్ర వేసిన ఆ నాట్యాన్ని ఆమె అదే సంవత్సరం, అంతకు ముందు జరిగిన శ్రీరామనవమి వుత్సవాలలో కూడా ప్రదర్శించారు.

"అది నా జీవితంలో మరపురాని సంఘటన. కారణం నేను ఆ నృత్యం స్వామి వారి ఎదుట కళ్యాణ మంటపంలో ప్రదర్శించాను. వేలాది ప్రేక్షకులు ఆ నృత్యాన్ని ఆనాడు తిలకించారు. అయితే చీమ చిటుక్కుమన్నా శబ్దంలేదు. అంతటి నిశ్శబ్దం ఆవరించింది. ఆ ప్రశాంత వాతావరణంలో శ్రీరామచంద్రుని దివ్య మంగళ విగ్రహం ఎదుట నృత్యం చేస్తున్న నేను కొన్ని వందల సంవత్సరాలు వెనక్కి వెళ్ళి ఆ రాముడి కాలంలో జీవిస్తున్నట్లుగా అనుభూతి చెందాను. అందువల్లనే ఆ నృత్యం అంత రక్తి కట్టించి. అందుకే అది నా నృత్య జీవితంలోనే కాదు నిజ జీవితంలో కూడా మరపురాని మధురమైన సంఘటనగా నేను భావిస్తున్నాను" అన్నారు రాధ.

ఆ విధంగా భద్రాచలంలో శ్రీరామనవమి, వైకుంఠ ఏకాదశి ఉత్సవాలలో ఒకే సంవత్సరం నృత్యం చేసిన ఘనత కూడా మొదటిసారిగా రాధకే దక్కడం చెప్పుకోదగ్గ విశేషం.

కళలకు కాణయాచి అనదగ్గ మచిలీపట్నంతో జన్మించిన రాధ-తండ్రి శ్రీ పి. ఎస్. ప్రసాదరావు. తల్లి శ్రీమతి వాణీప్రసాదరావు. ఆమె తల్లిగారు సంగీతంలో సిద్ధహస్తురాలు. కర్ణాటక గాత్ర సంగీతంలో అనేక కచ్చేరీలు యిచ్చారు. నాట్యంలో కూడా ఆమెకు ప్రవేశముంది. తల్లి ప్రోత్సాహంతో చిన్నప్పుడే రాధకి నాట్యకళపై అభిరుచి ఏర్పడింది. దాంతో తన నాలుగవఏటనే తల్లి వద్ద అడుగులు వేయడం నేర్చుకున్నది. అప్పట్లో-మద్రాసులో వుండే రోజుల్లో కళాక్షేత్రకు తల్లిదండ్రుల వెంట వెళుతూ వుండేది రాధ. ఆ ఉత్సాహంతో ఆమె ప్రముఖ నాట్యాచార్యుడు, శ్రీ దండాయుధపాణి పిళ్ళై శిష్యుడు అయిన శ్రీ వి. ఎస్. రామమూర్తి వద్ద తను నేర్చిన నాట్యవిద్యకి మెరుగులు దిద్దుకున్నది.

డిసెంబర్ 1973 లో తొలిసారిగా రంగప్రవేశం చేసిన రాధ-ఆంధ్రదేశంలోని వివిధ పట్టణాలలోనూ, భోపాల్, బొంబాయి నగరాలలోనూ దాదాపు 200

దాకా భరతనాట్యం, కూచిపూడిలలో ప్రదర్శనలను యిచ్చారు. హైద్రాబాదు టెలివిజన్ కార్యక్రమంలో కూడా పాల్గొన్నారు.

వేదాంతం జగన్నాధశర్మగారి వద్ద కూచిపూడి నృత్యం నేర్చుకున్న రాధ త్వరలోనే ఒడిస్సీ నృత్యం నేర్చుకోవాలని వుందన్న అభిలాషను వ్యక్తం చేశారు. 'భరతనాట్యంలో పద్మా సుబ్రమణ్యం, కూచిపూడిలో యామినీ కృష్ణమూర్తి, ఒడిస్సీ నృత్యంలో సంజుక్త పాణిగ్రహి తన అభిమాన నర్తకీమణులు' అంటారు రాధ.

1978 లో దేవీనవరాత్రుల సందర్భంగా సికింద్రాబాదులో ఆమె కూచిపూడి, భరతనాట్యాలలో నృత్య ప్రదర్శనలు యిచ్చారు. ఆ నృత్యం తిలకించిన పుష్పగిరి శంకరాచార్యులు ఆమెకు 'నృత్యకళా ప్రవీణ' బిరుదు యిచ్చి గౌరవించారు. 'అభినయ భారతి', 'అభినయ నాట్యమయూరి', 'నృత్య ద్వయ కోవిద'—ఆమెకు లభించిన మరికొన్ని బిరుదులు.

హైద్రాబాదులోని వనితా మహా విద్యాలయం ద్వారా ఆంగ్లసాహిత్యంలో బి.ఎ. పట్టానికై కృషి చేస్తున్న రాధ "వివాహం వల్ల నాట్య సాధనకి కొంత యిబ్బంది ఏర్పడుతుందనే చెప్పాలి. కాని కళాభిమాని అయిన భర్త లభిస్తే ఎటువంటి సమస్యా వుత్పన్నమవదు. తగిన ప్రోత్సాహం కూడా లభిస్తుంది" అంటారు.

భారతీయ నాట్యరీతులలో ముఖ్యంగా కూచిపూడి నృత్యంపై పరిశోధనలు చేయాలన్నది – త్వరలో విదేశపర్యటన చేయనున్న ఆమె ఆశయం.

"నేడు మన దేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలో నాట్యకళకి కొంత ప్రోత్సాహం లభిస్తున్నమాట నిజమే. అయితే ఆ ప్రోత్సాహం సంగీత నాటక అకాడెమి ద్వారా కొందరు కళాకారులకి ఉపకారవేతనం యివ్వడంతో సరిపెట్టబడుతోంది. కాని అంతటితో వూరుకుంటే చాలదు. కళాకారులకు వీలైనన్ని ఎక్కువసార్లు ప్రదర్శనలు యిచ్చే అవకాశం కల్పించాలి. మన నాట్యకళ అతిప్రాచీనమైనది. దానికి తగిన ప్రచారం లభించేటట్లు చూడాలి. ఏ జాతి ప్రగతికైనా ఆ ప్రాంతపు కళావైభవమే నిదర్శనం. నామటుకు నేను ఎం.ఏ పూర్తి చేసిన తర్వాత ఒక నాట్య శిక్షణాలయం స్థాపిస్తాను. యధాశక్తి నాట్యకళ ప్రచారానికి దోహదం చేస్తాను" అని చెప్పారు రాధా ప్రసాదరావు. □



వర్ణచిత్రం : కె. ఆర్. వి. భక్త

"అమ్మగారూ!"

ఏదో రాసుకుంటున్న డాక్టర్ సుమిత్రాదేవి పనిమనిషి రామిని చూసి ఏమిటన్నట్లుగా కళ్ళెగరేసింది.

"తవరి కోసం ఎవరో వచ్చినారండి" వినయంగా సమాధానమిచ్చింది రామి.

"ఎవరబ్బా!" అనుకుంటూనే "సరే! వస్తున్నానని చెప్పు" యాంత్రికంగా అనేసి లేచింది సుమిత్ర.

అయినా డిస్పెన్సరీకి రాక నేరుగా యింటికే వచ్చేది ఒక్క సరళే. ఈ క్రొత్తగా వచ్చిన రామికెవ్వరూ సరిగ్గా తెలీదు - అనుకొంటూనే హాల్లోకి నడిచింది సుమిత్ర. సుమిత్రను చూసి చల్లని చిరునవ్వు నవ్వింది సరళ.

సుమిత్ర కూడా అలవోకగా నవ్వి "ఏమ్మా! సరళా! బొత్తిగా రావటమే మానేశావేం! మేమంత గుర్తురాక పోతున్నామా! లేకపోతే మా యిల్లు బాగా దూరమయిపోయిందంటావా! మా తమ్ముడు కృష్ణ వుంటే ఎప్పుడూ వచ్చేదానివి. వాడు లేడని రావటం తగ్గించేశావు! అవునా?" కాస్త నిష్ఠూరంగా అంది.

"అబ్బే! లేదండీ! ఈ మధ్య స్కూల్‌వర్క్ ఎక్కువగా వుంటోంది. అదేగాక అత్తయ్య పోయినప్పటి నుంచి మామయ్య ఆరోగ్యం కూడ అంతంత మాత్రంగానే వుంటోంది. పైగా రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపట్టటం లేదాయనకు. పగలంతా స్కూలు వర్క్! రాత్రిళ్ళు కాస్త ఇంటి పని; వీటితో అసలు ఎక్కడికి వెడదామన్నా ఇబ్బందిగానే వుంటోంది. మీరు కులాసాగానే వున్నారు కదూ! కృష్ణ ఆరోగ్యం ఎలా వుంది! కృష్ణ ఎప్పుడొస్తాడండీ?" సరళ ఆత్రంగా ప్రశ్నించింది.

సుమిత్ర సరళ అడిగిన ప్రశ్నలకు సమాధానమిచ్చి కాస్త పరిశీలించి చూసింది 'సరళను. ఎందుకో ఎప్పుడూ ఎంతో హుషారుగా వుండే సరళ, ఇవాళ ఇంత డల్‌గా వుందేమిటి? సరళ ముఖంలో అదో రకం నీలి నీడలు!!

పాపం! పనంతా చిన్నపిల్ల ఒక్కర్తే చేసుకుంటుంది. అటు స్కూల్లో కూడ తోటి టీచర్లు ఏమాత్రం అభిమానం చూపకపోగా సరళను తమ చూపులతో, చేతలతో అనేక రకాలుగా బాధపెడ్తూంటారు. ఇన్ని బాధల మధ్య హాయిగా వుండమంటే ఎలా వుంటుందీ పిల్ల? సరళపై చాల జాలి కల్గిందామెకు.

"ఒక్కక్షణం వుండు సరళా! ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి నడిచింది సుమిత్ర.

సరళ డాక్టర్ సుమిత్ర వెళ్ళినవైపే చూస్తూండిపోయింది.

ఈవిడకు తనంటే ఎంత అభిమానం! తననొక యింటిపిల్లలాగా చూసుకుంటుంది. కృష్ణ మాత్రం!! తనతో ఎంత చక్కగా మాట్లాడ్తాడు? ప్చ్! కృష్ణ ఎప్పుడొస్తాడో? ఎప్పుడూ జోక్స్ వేస్తూ కిలకిలా నవ్వించే అతడు లేకపోతే ఇల్లంతా బోసిపోయినట్లుంది. మెల్లిగా అక్కడే టేబుల్ మీదున్న కృష్ణ ఫోటో చేతిలోకి తీసుకుని తదేకంగా చూస్తూండిపోయింది.

కృష్ణ తనను ప్రేమిస్తున్న సంగతి తనకు చెప్పాడు. చిన్నతనం నుంచే ఎరిగిన మనిషే కాబట్టి వ్యక్తిగా కృష్ణ మీద తనకు మంచి అభిప్రాయమే. కానీ ఎక్కడ తను?! ఎక్కడి కృష్ణ? త్వరలో ఒక డాక్టర్‌గా తిరిగివచ్చే కృష్ణ- ఏమీలేని తనలాంటి బీదపిల్లను చేసుకుంటాడంటే చాల ఆశ్చర్యమే. సుమిత్రాదేవి కూడా అప్పుడే మరదలులాగా చూస్తూ వేళాకోళాలాడుతూంటుంది. కృష్ణ అంటే తనకెంతో ప్రేమ. కానీ ఇది ఎలా సంభవం?

సరళ అలా కృష్ణ ఫోటోకేసి చూస్తూండిపోయింది! ఆమె మనసులో అంతులేని ప్రశ్నలు.

"సరళా!"

ఉలిక్కిపడి తల ఎత్తి వెంటనే కన్నీరు సుమిత్రాదేవి కంటబడకుండా వుండాలని చాల ప్రయత్నం చేసింది సరళ.

ఎంత ప్రయత్నం చేసినా దాచలేకపోయింది సరళ. సునిశితమైన సుమిత్ర కళ్ళు వెంటనే పసిగట్టేశాయి.

"ఛ! ఏమిటమ్మా సరళా! ఎందుకీ కన్నీరు? పిచ్చి పిల్లా! కృష్ణ కోసమేనా? ఇంకెన్నాళ్ళు? కృష్ణ 'వచ్చేస్తున్నాడుగా? ఎప్పటిలాగా కాదు. నీ కోసం కొత్త కోర్కెలతో, కోటి ఆశలతో వస్తున్నాడు నీ కృష్ణ! లేచి కళ్ళు తుడుచుకో" అంటూనే చనువుగా కళ్ళు తుడిచి చేతికి కాఫీ అందించింది సుమిత్ర.

నెమ్మదిగా కాఫీ త్రాగటం ముగించి కప్పు పక్కన పెడుతూ "డాక్టర్‌గారూ! మా మామయ్యకు ఎందుకో రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టటం లేదండీ. కాస్త దగ్గుతున్నారు కూడా! మిమ్మల్నడిగి స్లీపింగ్ టాబ్లెట్సు తీసుకు రమ్మన్నారు" అంది సరళ.

"అయ్యో! అలాగా సరళా! మరి నాకు కనీసం కబురైనా చెయ్యలేదేం! మనిషిని చూడకుండా అలా టాబ్లెట్స్ ఇవ్వటం మా వృత్తికే విరుద్ధం! సరే! నువ్వంతగా అడుగుతున్నావు కాబట్టి తప్పకుండా ఇస్తాను." అంటూ లోపలికి వెళ్ళి ఐదు నిమిషాలలో ఓ స్లీపింగ్ టాబ్లెట్సు బాటిల్ తీసుకువచ్చి సరళ చేతికిచ్చింది.

"సరళా! ఈ బాటిల్ తీసుకో! పొరపాటున ఎక్కువ వేయబోకు! చాల జాగ్రత్త సుమా! ఎందుకైనా మంచిది. నీతోపాటు నేను కూడ వస్తానుండు." అనునయంగా అంది సుమిత్ర.

సరళ కంగారుగా "అవసరం లేదండీ! మరేం ఫర్వాలేదు. పైగా ఇప్పుడు చీకటి పడబోతూంది. మామయ్య కూడా పడుకోబోతూంటాడు. మీరు మరీ శ్రమ తీసుకుని రావటం...." అంది.

"ఏమిటి సరళా! నువ్వు మరీ! నీకు ఫీజు విషయంలో భయంగా వుంది కదూ! నీవేం ఇవ్వక్కర్లేదని ఇప్పటికే చాలాసార్లు చెప్పాను. పద వెళ్దాం!" సుమిత్ర అంది.

సరళ కదలకుండా "అబ్బే! ఇప్పుడు వెళ్ళి లాభం లేదండీ? మీరు రానక్కర్లేదు." మొండిగా అంది.

సుమిత్ర సరళ మొండి వాదనకు ఏమీ మాట్లాడలేకపోయింద.

సరళను గుమ్మందాకా సాగనంపుతూ "మరో మాట సరళా! నువ్వసలే కాస్త కొంటెపిల్లవు. పొరపాటున కానీ, తమాషాకు కానీ ఈ స్లీపింగ్ టాబ్లెట్ నోట్లో వేసుకు చూస్తావేమో! జాగ్రత్త! అంతనిద్రలో నీకు కలలు కూడా రావు. ఆ కలల్లో వచ్చే కృష్ణ కూడా రాడు. తెలుసు కదూ! కమ్మని కలలు కంటూ నిద్రపో! రేపో మాపో కృష్ణ రానే వస్తాడు" అంటూ లోపలికి వెళ్ళిపోయింది నవ్వుకుంటూ సుమిత్ర.

సుమిత్ర మాటలకు నిర్లిప్తంగా నవ్వుకుని చీకట్లో కలిసిపోయింది సరళ.

*

భోజనం చేసి పడుకుందన్న మాటే కాని సుమిత్రకు నిద్ర రాలేదు. రేపే రాబోతున్నట్లు ఇందాకే కృష్ణ దగ్గర్నుంచి ఉత్తర మొచ్చింది. తన బంగారు తమ్ముడు కృష్ణ వచ్చేస్తాడు. ఎంతో కష్టపడి చివరకు కృష్ణను డాక్టర్ చదివించగలిగింది. తను ఎంత కష్టపడిందీ కృష్ణకు తెలుసు. అందుకే

# నివురు గప్పిన నిప్పు

— 'పద్మలత'



తన మాటన్నా, తనన్నా అతనికి అంతులేని గౌరవం, అభిమానం.

అందరిలాగా తను చదువుకునే రోజుల్లో ఎన్నో కలలు కన్నది. తన వైవాహిక జీవితాన్ని పంచుకునే వాడెవడో? అతనెప్పుడొస్తాడో? ఎలా వుంటాడో? తన వూహల్లో రంగుల రాజకుమారుడు చోటు చేసుకునేవాడు. ప్రతి కన్నెపిల్లా కనే కలలే తనకూ వస్తూండేవి. ఆ రోజు, ఆ కలలు పండేకాలం రావటానికి ఎన్నో రోజులు పట్టలేదు. తోటి డాక్టర్ ప్రకాశ్‌తో తన పరిచయం ఎక్కువ కాసాగింది. అతని ప్రతి పలుకు, ప్రతి మాట గుండెల్లో దూసుకు పోతుండేవి. అతను చిరునవ్వు నవ్వితేచాలు. తాను పులకించిపోయేది. క్రమేపీ తమ పరిచయం వృద్ధి అయి మరో మెట్టు ముందుకు వెళ్ళి ప్రేమజాలంలో చిక్కుకుని పోయారు తామిద్దరూ....

దాదాపు పెళ్ళివరకూ వచ్చింది. ఇవ్వాళో, రేపో పెళ్ళి కాబోతున్న తొందరలో ఇద్దరూ కాలు జారారు. అయినా తనకేం భయం కలగలేదు. ఎలాగూ ఇవ్వాళ కాకపోయినా, రేపైనా భార్యా భర్తలమేగా-అనుకుంది ధైర్యంగా. అతనితో ఇష్ట మొచ్చినట్లుగా తిరిగింది. తన వూహలతో తన జీవితానికో బంగారు మేడ కట్టుకుంది. కానీ....తాను కట్టుకున్న సువర్ణపు భవనం పునాదులతో సహా కూలిపోవటానికి ఎన్నో రోజులు పట్టలేదు.

ప్రకృతి:

# మీ మహత్తర సౌందర్య సాధనం.

ప్రకృతి మీకు మచ్చలేని నునుపైన చర్మాన్ని యిచ్చినప్పుడే, దాన్ని అదే విధంగా ఉంచగల సాధనాలపై దృష్టి సారించింది.

మీ చర్మానికి మరింత రంగొచ్చేలా నునుపుగా, ఆరోగ్యంగా చేసేందుకు పసుపు యిచ్చింది (ఇది క్రిమి నిరోధకంగా పనిచేస్తుందని మీకు తెలుసా?)

మరి గంధపు చెక్కను మీ చర్మాన్ని చల్లగా చేసి మొటిమల్ని మటుమాయం చేయడానికి యిచ్చింది.

మీ చర్మానికి వాపులూ, 'ఎలర్జీ' లేకుండా కాపాడటానికి కుంకుమ పువ్వునిచ్చింది.

నిజానికి ప్రకృతికి మీ చర్మాన్ని ఎలా సంరక్షణ చెయ్యాలో [illegible] అందుకే మేం యీ మూడింటిలోని [illegible] ఒకే క్రీమ్‌లో రూపొందించాం. [illegible] శింగార్ టర్మరిక్ బ్యూటీ క్రీమ్.

కొత్తది

# శింగార్

## టర్మరిక్ బ్యూటీ క్రీమ్

మీ చర్మ సంరక్షణ కోసం ప్రకృతి సహజమైన సాధనం.







శింగార్ కాస్మటిక్స్
ప్రయివేట్ లిమిటెడ్
809, ప్రసాద్ చాంబర్స్,
బొంబాయి 400 004

everest/79/SH/62

అనుభవించినన్ని రోజులు హాయిగా అనుభవించారు. ప్రకాశ్ సెలవుల్లో వూరెళ్ళబోతున్నప్పుడు తను ఎంతో ఏడ్చింది. వెళ్ళరాదని బ్రతిమాలింది.

దానికి ప్రకాశ్ "మరేం ఫర్వాలేదు సుమా! మా వాళ్ళంతా నా మాట కాదనరు. ఏమీ భయపడకు. ఇంకో నెల రోజుల్లో మన పెళ్లి జరగటం ఖాయం." నమ్మకంగా ఎంతో చక్కగా చెప్పాడు.

తను అతని మాటలు పిచ్చిగా నమ్ముకుంది. ఎప్పుడొస్తాడా అని అతనికోసం రోజులు లెక్కపెడుతూ కూర్చుంది. రోజులు నెలల్లోకి మారాయి. నెమ్మదిగా తనకు అనుమానం రాసాగింది. తను మోసపోయిందని తెలుసుకుని తనలో తనే కుమిలి కుమిలి-విలపించింది. ఇంక తనలో ఏం మిగిలి వుందని? విలువైన పవిత్రతను పోగొట్టుకున్న తర్వాత? ప్రాణాలు తీసుకోవటం ఒకటే వుత్తమంగా తోచింది.

కానీ తను మరణిస్తే కృష్ణ, చిన్నారి కృష్ణ, తన తమ్ముణ్ణి ఎవరు పెంచుతారు! చదువు ఎవరు చెప్పిస్తారు? వాడి భవిష్యత్తు ఏమవుతుందో అన్న అలజడితో తను ఒక నిర్ణయానికి వచ్చింది. ఇక తన జీవితంలో వివాహమనేది జరక్కూడదు. తన తమ్ముణ్ణి ఒక వ్యక్తిగా తీర్చిదిద్దే బాధ్యత తనమీదే వుంది. తన గురించి లోకులు అనేకంగా చెప్పుకున్నారు. ఇవన్నీ కృష్ణకు వినిపించకుండా వుండాలని తను ఇల్లు మారిపోయింది. కృష్ణను కావాలనే వేరే వూర్లో వుంచి చదివిస్తూ వుంది. ఎంత చేసినా, ఎన్ని ప్రయత్నాలు చేసినా ఎలాగో ఆ మాటలు కృష్ణ చెవిన పడనే పడ్డాయి. కృష్ణ ఈ మాటలన్నీ విని వుగ్రుడయ్యాడు. తనను నిలదీసి అడిగాడు. తను నోటితో జవాబు చెప్పలేక తన డైరీని తీసి అతని కందించింది.

చదివిన కృష్ణ ఆశ్చర్యపోయాడు. అతనికి తన సుమిత్ర అక్కమీద జాలికలిగింది.

"ఏమిటక్కా! అడది చెడిపోతే ఇంకోపెళ్ళే అక్కర్లేదా? ఎందుకక్కా! నా కోసం ఇంత త్యాగం చేశావేం? వెంటనే నీ పెళ్ళికి నేను ఏర్పాట్లు చేస్తాను.'' ఆవేశంగా అన్నాడు. జ్ఞానం తెలిసిన తనంత తమ్ముడికి తనేం చెప్పగలదు?

అందుకే "వద్దు! కృష్ణా! ఈ జీవిత మిక ఇలాగే —నీ సేవలో, ఈ రోగుల సేవలో గడిచిపోనీ. నాకు పెళ్ళి మీద ధ్యాస లేనేలేదు. పైగా నా సంగతి తెలిసిన ఎవడూ నన్ను చేసుకోడు. తెలిసిందా? అన్నది తను.

కృష్ణ కోపంగా "ఏం! ఎందుకు చేసుకోడు? మగాడు చెడిపోతే చేసుకోవటం లేదూ? ఆడదీ అంతే కాదూ! నీ మాట మీద గౌరవంతో నిన్ను వదిలి వెళ్ళుతున్నాను. అదే-నేనైతేనా? చెడిపోయిందని తెలిసినా చేసుకు తీర్తాను! చూస్తుండు!" విసురుగా అనేసి వెళ్ళిపోయాడు.

తనేం మాట్లాడలేకపోయింది. కానీ కృష్ణ నిర్ణయానికి ఆశ్చర్యపోయింది. మనసులోనే తనకంటే చిన్నవాడైన కృష్ణను అభినందించింది. సరళలాంటి అందమైన అమాయకురాలు తన తమ్ముడికి భార్య కాబోతూంది. నిజంగా సరళ అదృష్టవంతురాలు! ఇకనుంచి సరళకు స్కూలు బాధ తప్పుతుంది. పాపం! ఆడదని సానుభూతి చూపించకుండా మీద చెయ్యివెయ్యటం, వెకిలిగా మాట్లాడటం ఎలా భరిస్తూందో సరళ. తనకి అప్పుడప్పుడు చెప్పి బాధపడుతూవుంటుంది. ఛ ఛ! పాడు వుద్యోగం! కృష్ణ రాగానే ఆ ఉద్యోగం మాన్పించాలి.

గతంలోంచి మేలుకుని టైం చూచుకుంది సుమిత్ర. గడియారం ఒంటిగంటను చూపిస్తూంది. తెల్లవారి తొందరగా లేవకపోతె ఎట్లా!-అనుకుంటూ నిద్రకుపక్రమించింది సుమిత్ర.

ముఖం మీద ఎండపడి చురుక్కుమనడంతో చటుక్కున కళ్ళు తెరిచింది సుమిత్ర. తటాలున వాచీవంక చూసుకుంది. గడియారం తొమ్మిది గంటలు దాటింది.

సుమిత్ర గబగబా లేచి కాలకృత్యాలు తీర్చుకుని టిఫిన్, కాఫీ సేవించి డిస్పెన్సరీకి బయలుదేరబోతూ ఇవాళ తప్పకుండా సరళా వాళ్ళింటికి వెళ్ళిరావాలి అనుకుంది.

" అమ్మా! అమ్మగారూ!!"

రామి కంగారుగా పిలిచింది.

కారు బయటకు తీయబోతూ "ఏమిటే" అంది సుమిత్ర విసుగ్గా.

"మరే....మరే....ఏటంటే...."

"ఏమిటో త్వరగా చెప్పు" అరిచింది సుమిత్ర.

"మరే! మీతో ఎట్టా చెప్పాలో తెలీటం లేదు. నిన్న రాలేదూ! మనింటికాడికి....ఆ సరళమ్మ గారూనూ...."

సంగతి సరళ గురించని తెలియగానే సుమిత్ర ఆత్రం అధికమై "నాన్చుడు చాలించి అసలు సంగతి చెప్పేడువు" అంటూ వేగిరపెట్టింది.

"ఆ సరళమ్మగోరూనూ, ఆ మాస్టరయ్య శివరావు లేడండీ! ఆయనానూ, కనపడ్డం లేదటండీ. ఇద్దరూ కలిసి నిన్న రేతిరికాడ ఎటో లేసిపోయినారని అంతా అంటున్నారండీ...."

దానిమాట పూర్తికాకమునుపే దాని చెంప ఛెళ్ళుమంది. సుమిత్ర రౌద్రాకారంతో "ఏమిటే అంటున్నావ్! మాటలు కాస్త జాగ్రత్తగా రానీ! సరళంటే ఎవరనుకుంటున్నావ్! నాక్కాబోయే మరదలే! మా కృష్ణకి భార్య కాబోతూంది త్వరలో" అంది.

రామి ఆశ్చర్యంతో "ఆ! అలాగమ్మగారూ! అయినా ఆయమ్మకా ఎధవబుద్ధి ఎందుకు పుట్టినాదో! ఇసుమంటి బంగారంలాటి సంబంధం వదులుకుని!" నోరు వెళ్ళబెట్టుతూ అంది.

"నోర్ముయ్! తెలిసీ తెలియని వెధవ మాటలు! పోయినీపని నీవు చూచుకో! పో!!" గద్దించింది సుమిత్ర కారులో కూర్చుంటూ.

కారు నర్సింగ్ హోమ్ వైపు పరుగులు తీస్తూంది. సుమిత్ర మనసులో అనేక ప్రశ్నల పరంపర.

రామి చెప్పింది అబద్ధమై ఎందుకుంటుంది? అయితే అది నిజమా! నిజమని నమ్మేందుకు తన మనసు అంగీకరించటం లేదు. ఒకవేళ నిజమే అయితే సరళ ఎందుకిలా చేసింది. తనకు సరళ మీద ఎంతో నమ్మకం. సరళ లాంటి బుద్ధిమంతులే ఇలా చేస్తే ఇక ఈ లోకంలో ఎవరిని నమ్మాలి? ఎవర్నీ నమ్మకూడదు.

అటువంటి సరళ కృష్ణ లాంటి మంచి వ్యక్తి మనసులో ఆశలెందుకు రేపాలి? అతన్ని ఎందుకు దగా చేసింది? ఛీ ఛీ! నివురు కప్పిన నిప్పు. కుక్కను తీసుకెళ్ళి సింహాసనం మీద కూర్చుండపెట్టాలనుకుంది తను. ఇంకా నయం. కూర్చోబెట్టలేదు. తనా పని చేసి వుంటే తననో కుక్కకు మల్లే చూసివుండేదా సరళ. ఇక ఈ జన్మలో ఛస్తే ఎవర్ని నమ్మకూడదు." అనుకుంది.

డిస్పెన్సరీలో కూర్చుని పేషెంట్స్‌ను అన్యమనస్కంగానే పరీక్షించింది. ఎవరికక్కావలసిన మందులు వారికందచేసి విశ్రాంతిగా కూర్చుందామనుకునే సమయంలో ప్యూన్ వచ్చి "అమ్మగారూ! మీకీ వుత్తరం వచ్చిందండీ!'' అంటూ యిచ్చి వెళ్ళిపోయాడు.

తనకు లోకల్‌పోస్ట్ 'ఎవరబ్బా' అనుకుంటూ ఉత్తరం చించింది సుమిత్ర.

'డాక్టర్ సుమిత్రగార్కి—

ఈ వూరి నుంచీ మీకు వుత్తరం వ్రాసేదెవరబ్బా అని ఆశ్చర్యపోతున్నారుకదూ! మీకు బాగా పరిచితురాల్ని. సరళను.'

సరళ పేరు చదవగానే విపరీతమైన అసహ్యం, కోపం కల్గాయి సుమిత్రకు. వెంటనే వుత్తరాన్ని చింపేయబోయింది. కాని వివేకం వద్దనటంతో తిరిగి చదవసాగింది.

"డాక్టర్‌గారూ!

నేను మీకు మీ యుక్తవయస్సు నుంచే పరిచయం. మా యింటికి ఎదురుగా వుండే మీలో నాకు ఎంతో నిండుతనం, అందం, తేజస్సు పోటీ పడుతూ కనిపించి మీరంటే చాలా గౌరవాన్ని కల్గించేవి. మా యింట్లో ఏమీ తోచకపోవడంతో నేను మీ యింటికి తరచు వచ్చేదాన్ని. నాకు మీ తమ్ముడు కృష్ణ తోడుకావటంతో మరింత ఆనందంగా ఆడుకునేదాన్ని. కృష్ణ చెప్పే చిలిపి మాటలు, కమ్మని కబుర్లతో సరదాగా గడిచేది కాలం.

మాకు యుక్తవయస్సు వచ్చేసరికి కళకళలాడుతున్న మీ ముఖం అదోరకంగా వాడిపోయింది. మీ కళ్ళలో నైరాశ్యం తొణికిసలాడుతుండేది. నాకాశ్చర్యం వేసేది. మీకు ముప్పయి సంవత్సరాలు దాటుతున్నా పెళ్ళి కాలేదు. కారణమేమిటో అంతుబట్టక మిమ్మల్ని అడగలేక నాలో అదొక ప్రశ్నగా మాత్రం మిగిలిపోయింది. ఆడపిల్లకు పెళ్ళి కాకపోతే లోకం దుమ్మెత్తిపోస్తుంది. ఇదే మీ విషయంలోనూ జరిగింది. ఆ బాధకు తట్టుకోలేని మీరు మా ఎదురిల్లు ఖాళీ చేసి దూరంగా వెళ్ళిపోయారు. కాని మిమ్మల్ని నేను ఎలా మర్చిపోగలను! అందుకే అప్పుడప్పుడు వస్తుండేదాన్ని. అలా కృష్ణతో నా పరిచయం వృద్ధి అయి ఇద్దరం ప్రేమలో పడ్డాము. కొన్నాళ్ళ తర్వాత కృష్ణ డాక్టర్ చదివేందుకు వేరే వూరికి వెళ్ళిపోయాడు.

మిమ్మల్ని గురించి కొన్నాళ్ళకు కృష్ణకు కూడ తెలియడంతో బాధగా వుంటుండేవాడు. ఒకనాడు నేను ఒత్తిడి చేయటంతో మీ గురించి నాకు చెప్పాడు. అది విన్న నాకు ఎంత కోపమొచ్చిందంటే మిమ్మల్ని మోసం చేసిన ప్రకాష్‌ను ఎక్కడున్నా వెదికి తీసుకురావాలనిపించింది. కానీ ఎలా? మీ విషయంలో నేనేమీ చేయలేను మీ అనుజ్ఞలేనిదే! కృష్ణ సెలవులకు వచ్చినప్పుడు కాలం చాల హాయిగా గడిచేది. మీరూ నన్నెంతో అభిమానంగా అప్పుడే మీ యింటి మనిషిలాగా భావించి ప్రేమగా చూచేవారు.

కానీ....రాను రాను మా ఆర్థిక పరిస్థితిలో చాలా తేడాలు వచ్చాయి. అత్తయ్య ఆరోగ్యం పాడవటం, ఆమె మందుల కోసం డబ్బు వెదజల్లటం, దీనిలో మా డబ్బు హారతి కర్పూరంలా హరించుకుపోయింది. చివరకు మా ప్రయత్నాలేమీ ఫలించకుండానే మా అత్తయ్య పైలోకం చేరుకుంది. ఇది మానసికంగా నాకంటే మామయ్యకు చాల పెద్ద దెబ్బ. చిన్నప్పటినుంచి తల్లి, తండ్రి లేకపోవటం వల్ల అత్తయ్య, మామయ్యల వద్దే పెరిగాను. అందుకే మామయ్య దిగులు చూడలేకపోయేదాన్ని, ఆ దిగులుతో ఆయన ఆరోగ్యం నానాటికీ దెబ్బతింటూండేది. అదీగాక ఇంట్లో యజమాని జబ్బునపడి మంచాన పడటంతో మామయ్య చేసే బడిపంతులుద్యోగం కాస్త మూల పడింది. ఇక మాకు తిండిగింజలెలా వస్తాయ్?

అందుకే డిగ్రీ పాసయిన నేను వుద్యోగం



## పెదవులకి రంగు

ప్రాచీన కాలంలో స్త్రీలు, పురుషులు కూడా తాంబూలం సేవించటం మూలంగా పెదవులను ఎర్ర బరచుకునేవారు. కానీ, ఈ ఆధునిక నవ నాగరిక ప్రపంచంలో పాశ్చాత్య పద్ధతులను అన్ని విధాలా అనుకరిస్తున్న మనం కృత్రిమమైన రంగును పెదవులకు పూసుకోవడం అలవాటు చేసుకున్నాం. పెదవులకు రాసుకునే ఈ రంగును ఆంగ్లంలో 'లిప్‌స్టిక్' అని అంటారు. ఈ రోజుల్లో చిన్న పిల్లలు మొదలు యువతులు, కొందరు గృహిణులు కూడా లిప్‌స్టిక్‌ను ఉపయోగిస్తున్నారు. ముఖాలంకరణ విషయంలో పెదవులకు రంగు పూసుకోవడం ముఖ్యాంశమైంది. ఈనాడు బజారులో చాలా రంగుల్లో లిప్‌స్టిక్స్ అమ్మబడుతూ వున్నాయి. కానీ అన్నింటికన్నా ఎరుపు రంగు లిప్‌స్టిక్ బాగా ఉంటుంది. ఈ లిప్‌స్టిక్‌ను మనం ఇంటిలోనే సులభంగానూ, చౌకగానూ తయారు చేసుకోవచ్చును. సొంత అవసరానికే కాకుండా దీన్ని ఒక చిన్న గృహపరిశ్రమగా కూడా స్త్రీలు స్వీకరించడానికి అనువుగా వుంటుంది.

ఈ లిప్‌స్టిక్‌ను తయారు చేయడానికి ముఖ్యంగా బాదం నూనె (Almond oil) రెండు ఔన్సులు (సుమారు 60 గ్రాములు), జపాన్ మైనము (Japan wax) ఒక ఔన్సు (సుమారు 30 గ్రాములు), కార్‌మైన్ (Carmine) మూడున్నర గ్రెయినులు (3½ Grains - అంటే సుమారు 250 మి. గ్రా), ఆటో రోజ్ (Otto rose) మూడు చుక్కలు, కొద్దిగా అమ్మోనియాద్రవం (సుమారు ఒక చెంచా అంత) కావాలి.

పైన పేర్కొన్న వస్తువులు ఇంగ్లీషు మందులు అమ్మే అంగళ్ళలోనూ, కెమికల్స్ అమ్మే అంగళ్ళలోను దొరుకుతాయి. దీనిని తయారు చేయడానికి అల్యూమినియం పాత్రలు గానీ, ఎనామిల్ పూత వున్న పాత్రలు గానీ ఉపయోగించవచ్చును.

ముందుగా ఒక పాత్రలో జపాన్ మైనాన్నీ బాదం నూనెను తీసుకుని పొయ్యిపై పెట్టి సన్నని మంట మీద దానిని కరగనివ్వాలి. ఈలోగా కార్‌మైన్‌ను తీసుకుని దానిని అమ్మోనియా ద్రవంతో కలిపి తీసుకోవాలి. పొయ్యిపైన జపాన్ మైనం, బాదం నూనె బాగా కరిగి, కలిశాక దానిని పొయ్యిపై నుంచి దించి, అందులోకి కార్‌మైన్ కలిపిన ద్రవ మిశ్రమాన్ని పోయాలి. ఇప్పుడు ఈ మొత్తం మిశ్రమాన్ని ఒక కల్వంలోకి పోసి బాగా నూరి పెట్టుకోవాలి. తర్వాత ఈ మిశ్రమంలోకే ఆటో రోజ్ అనే సువాసన గల ద్రవాన్ని మూడు చుక్కలు వెంటనే కలపాలి. మరోసారి కల్వంలోని మిశ్రమాన్నంతటినీ బాగా కలిపి కొన్ని గంటలసేపు అలాగే వుంచేయాలి. కొన్ని గంటలు గడిచిన తర్వాత చూస్తే ఈ మిశ్రమం బాగా గట్టిపడి లిప్‌స్టిక్ వలె ఉంటుంది. ఇదే లిప్‌స్టిక్. దీనిని తీసి అందమైన సీసాల్లోకి తీసి పెట్టుకోవాలి. విక్రయించదలచుకునేవారు తగిన విధంగా అమర్చి అమ్మకానికి పంపవచ్చును. లిప్‌స్టిక్ తయారీలో కార్‌మైన్ అనే పదార్థం రంగునూ, ఆటో రోజ్ అనే పదార్థం సువాసననూ కలుగజేస్తుంది. ఈ విధంగా తయారైన లిప్‌స్టిక్— పెదవులకు అందాన్ని మెరుపును మాత్రమే కాక మృదుత్వాన్ని కూడా చేకూరుస్తుంది.

—గార్ల సరస్వతి

---

చేస్తానన్నాను. ముందు నా మాటలకు మామయ్య మండిపడ్డాడు. ఆడది వుద్యోగం చెయ్యటం కంటే చక్కగా పెళ్ళి చేసుకుంటే నయమన్నాడు. 'ఒంటరిగా వుద్యోగం చేసే ఆడదాన్ని చూస్తూ మగవాడు వూరుకోలేడు. పదిమందిలో చులకనై పోతావ్' ఇంకా ఏవేవో అంటూ తిట్టిపోశాడు.

ఇవి పట్టించుకుంటూ కూర్చుంటే మాకు ఇల్లెలా గడుస్తుంది? ఆయన మందులకు డబ్బెలా వస్తుంది? అందుకే మామయ్య చేసిన స్కూల్లోనే ఒక టీచర్‌గా వుద్యోగం సంపాదించాను. కానీ ఆ సంతోషం ఎంతోకాలం నిలవలేదు. ఆ స్కూలు వాతావరణమూ, ఆ మాస్టర్లు చేస్తుండే పనులకు టీచర్లు చూస్తూ వూరుకోవటమూ చూసి అసహ్యం వేసేది. కాని ఏమీ చేయలేకపోయేదాన్ని — అప్పుడప్పుడు నాకుద్యోగమిప్పించిన శివరావు వెకిలిగా ప్రవర్తించేవాడు. డబ్బుండే వ్యక్తి కావటంతో అతని ప్రవర్తనకు ఎవరూ ఏమీ అనేవారు కాదు. పైగా తానా అంటే తందానా అనేవారు. ఇది గమనించి నేను అతనికి చాలా దూరంగా వుంటూ అతన్ని అతని పరిధిలోనే గిరిగీచి వుంచాను. అది శివరావుకు కంటక ప్రాయంగా వుంటుండేది. సమయం కోసం పిల్లిలా వేచి చూడసాగాడు.

సరిగ్గా నెల రోజుల క్రితం....

ఆ రోజు స్కూలు వదిలి వేసి పావుగంట దాటింది. పిల్లలంతా వెళ్ళిపోయారు. చివరకు టీచర్లు కూడా ఇళ్ళకు వెళ్ళిపోయారు. హెడ్ మిస్ట్రెస్ మార్గరెట్ ఏదో పని చెప్పటం వల్ల నేను ఇంకా అక్కడే వుండవలసి వచ్చింది. అలా అప్పుడప్పుడు వుండటం నాకలవాటే. మరో అరగంట దాటి పోయింది. కొంతసేపటికి సన్నని వర్షం ప్రారంభమైంది. ఇంటికి బయలుదేరుదామనుకున్న నేను వర్షం రావడంతో అక్కడే ఆగిపోయాను. ఇల్లు దగ్గరే కాబట్టి అంత భయం కలగలేదు.

।

అంతలో నా పని అయినా పూర్తి చేసుకుందామని మళ్ళీ నా సీట్లో కూర్చున్నాను. పని మీద ధ్యాసలేకపోవడం వల్ల ఆలోచనలు కృష్ణ మీదకు మళ్ళాయి. అబ్బ! కృష్ణను చూసి ఈ మధ్య నెల రోజులు దాటి పోయింది. అతనికి ఫైనల్ ఇంటర్ పరీక్షలు కావడంతో ఈ మధ్య ఇంటికి రావడం పడటం లేదు. ఏం చేస్తున్నాడో కృష్ణ! అతని మీద ఆలోచనతో మత్తుగా అలా కళ్ళు మూసుకున్నాను. ఎప్పుడు వచ్చాడో ఏమో శివరావ్ మెల్లిగా నా భుజం మీద చెయ్యి వేశాడు.

ఉలిక్కిపడి తలెత్తి చూశాను 'శివరావు'ను. గబుక్కున అతని చెయ్యి వదిలించేసి "మిస్టర్! ఏమిటిది? కాస్త జాగ్రత్తగా మసులుకో" కోపంగా అన్నాను.

"అందరి విషయంలోనూ జాగ్రత్తగా వుంటున్నాను. కానీ నీ విషయంలో మాత్రం వుండలేకపోతున్నాను. అందుకే నేను...." మళ్ళీ చెయ్యి వెయ్యబోయాడు.

"శివరావ్! నేను అందరిలాంటిదాన్ని కాదు. బయటికి నడు" గర్జించాను.

అతను వెకిలిగా నవ్వుతూ "ఆ! మహా చెప్పొచ్చావులే! ఎప్పుడూ ఆ డాక్టర్ యింట్లో, దాని తమ్ముడు కృష్ణతో కులుకుతుంటావ్! ఎవరికి తెలియదని? రావోయ్!" నా చెయ్యిపట్టుకు లాగాడు.

అతని ప్రవర్తన, అతని మాటలు పైగా మిమ్మల్ని గురించి వాడలా వాగేసరికి విపరీతమైన కోపమొచ్చి చాచి లెంపకాయ కొట్టాను. నా చెంప దెబ్బతో మరింత రెచ్చిపోయాడతను. నేనెంతో బ్రతిమాలాను. ఏడ్చాను. ఎన్నివిధాల ప్రతిఘటించినా లాభం లేకపోయింది.

ఆ ఘోర వర్షంలో నా అరుపులు వినే వాడె

వ్వడూ లేక పోవటంతో అతని పశు కామానికి ఘోరంగానే బలైపోయాను. గర్వంగా బయటికి వెళ్ళిపోయాడు శివరావ్.

కొంతసేపటికి నీరసంగా లేచి ఇంటివైపు దారి మళ్ళించాను. కాని ఇంటికెలా వెళ్ళను! పవిత్ర మైన మామయ్య ముఖం ఎలా చూడను? ఆనాడే మామయ్య మాటలు విని వుంటే ఎంత బాగుండేది. ఏం! నా రాత ఇలా రాసి పెట్టి వుంటే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? నా మలిన శరీరాన్ని కృష్ణకు ఎలా అప్పగించను? నా ప్రశ్న లన్నింటికి సమాధానం ఆలోచించగా ఒక్కటే కనిపించింది. అదే నా మరణం. నా చావుతో అన్ని సమస్యలు పరిష్కారమవుతాయి. ఇదే మంచి పద్ధతి అనుకుని మృత్యుగృహం వైపు అడుగులు వేయబోయాను.

కానీ.... నా నడక సాగలేదు. కాదు. కాదు. నా మనసే నన్ను ధైర్యంగా ముందుకు అడుగువేయ నీయలేదు. అంటే నేను పిరికిదాన్నని కాదు. నేను చనిపోయినా కూడా నాకు బాధలేదు. కానీ నాలాంటి స్త్రీలు ఎంతోమంది అమాయకురాళ్ళు శివరావ్ లాంటి వాళ్ళ చేతిలో నలిగి ఆత్మ హత్యలకు గురి కాకూడదు. వారి జీవితాలు పాడవకుండా వుండా లంటే.... శివరావే చావాలి. అవును. అతనే చావాలి. ఆ అంతమేదో నేనే చెయ్యాలి. నా మనసు ఇదే చెప్పింది! అవును. తనవల్ల చెడిపోయిన నేను పోవాలి కానీ దానికి కారకుడైన శివరావు మాత్రం హాయిగా బ్రతికి ఎందుకు వుండాలి? అతనూ పోవల సిందే. ఊహూ! కాదు. అతని మీద పగ తీర్చు కోవాలి. అతన్ని మంచితోనే వంచించాలి. అతను మరణించే సమయంలో నేను విరగబడి నవ్వు కోవాలి. అప్పుడే నా కసి తీరేది. నాకు జరిగిన అన్యాయానికి ప్రతిఫలం దక్కేది. నాలో తీవ్రమైన సంచలనం చెలరేగింది.

చాలా ఆలోచించిన మీదట బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. అది చక్కగా ఆచరణలో పెట్టాలనుకుని ఇంటివైపు తృప్తిగా నడిచాను.

కానీ ఆ రాత్రి నాకు కాళరాత్రే అయింది. ఎంతగా ఏడ్చానో ఎవరికి చెప్పను!!

రెండవ రోజు మామూలుగానే స్కూలుకు వెళ్ళాను. అందరికంటే ఇదిగా అంతా అచ్చెరు వొందేలా శివరావుతో ఎంతో చనువుగా మాట్లా డాను. ఆశ్చర్యపోయాడు శివరావ్. బహుశా అతడిలా వూహించి వుండడు. నేను మామూలు ఆడపిల్లలా అతని కాళ్ళు పట్టుకుని ఏడుస్తానని, అంతటి అమాయకురాలనీ అనుకుని వుంటాడు. కానీ.... ఈ సరళ నివురు కప్పిన నిప్పులాంటిదని, ఆ నివురు తీసివేస్తే నిప్పులా మంచిసెగతో అతన్ని దహించి వేస్తుందని వూహించి వుండడు. నెమ్మదిగా నా తళుకు బెళుకులన్నీ చూపి అతన్ని మంచి చేసు కున్నాను. నా మీద ప్రేమలాంటిది పుట్టిందతనికి. చివరకు నేనేం చెప్తే అది కాదనలేని స్థితికి వచ్చాడు. ఇలా నటించవలసి వచ్చినందుకు నాలో నేను ఎంత బాధ పడ్డానో, కృష్ణను మనసులోనే క్షమించమని ఎన్నిసార్లు కోరుకున్నానో ఆ భగవంతునికే తెలుసు. మూడు రోజుల క్రిందట నేను చెప్పిన పలుకులకు ఓయస్ అన్నాడు శివరావ్. అతని అంతిమదశకు అతనే చేతులారా పునాది కట్టుకున్నాడు. అతని జీవితాన్ని నేను సమాధి చేస్తున్నానని అతని చివర దశ నా చేతిలో వుందని ఎలా అనుకోగలడు పాపం!!

ఇవాళ రాత్రే ఇద్దరం హైద్రాబాద్ చేరుకుంటు న్నాం. హైదరాబాద్ అతని పుట్టిన వూరట. పుట్టిన వూర్లోనే గిట్టబోతున్నాడు! ఇది అతనికేం తెలుసు? ఇది మరీ సంతోషాన్నిచ్చింది నాకు. అందుకే మీ దగ్గరకు వచ్చి స్లీపింగ్ టాబ్లెట్స్ తెచ్చాను. మీ మనసులో ఏ కల్మషమూ లేదు కనుక అడిగిన వెంటనే ఇచ్చేశారు. కానీ నా మనసులోని కల్మ షం, మండుతున్న మంటలు మీకేం తెలుసు?

ఇంక ఇరవైనాలుగు గంటల లోపున అంటే ఒక్కరోజన్న మాట, నేనూ, నన్ను నాశనం చేసిన శివరావు ఈ లోకాన్ని విడిచి వెడుతున్నాము. వెళ్ళేముందు నా మనసులోని మర్మమంతా మీతో చెప్పాలనిపించింది. కృష్ణను చూద్దామన్న ఆఖరి ఆశ తీరనేలేదు.

కృష్ణతో నన్ను అసహ్యించుకోవద్దని చెప్పరూ! ఇది నా కోరిక. ఇక ఈ సరళ, మీరెంతో అభి మానించిన ఈ సరళ మీకిక కనిపించదు. అను కుంటూంటే నాకే ఎంతో బాధగా వుంది. మీరు చాలా దుఃఖిస్తారని తెలుసు. అయినా తప్పదు. చనిపోయే ముందు నా కసి తీర్చుకుంటున్నందుకు నాకు మరింత ఆనందంగా వుంది. పై జన్మలో నైనా కృష్ణతో పవిత్ర జీవితాన్ని గడపాలని కోర్కెగా వుంది. నన్ను మర్చిపోరు కదూ!

వుంటాను

కన్నీళ్ళతో సరళ

ఉత్తరం ఎప్పుడో సుమిత్ర చేతిలోంచి ఎగిరి పోయింది. ఆమె మనసు సరళ గురించి బాధ పడుతున్నది.

"సరళా! నీలాంటి ఆడపిల్లలున్నందుకు ఈ దేశం గర్వించాలి. అసలు నీలాంటి వాళ్ళున్నంత వరకు శివరావులాంటి వాళ్ళు నశించవలసిందే. నశించిపోవాలి కూడా! అమాయకంగా వుండే నిన్ను చూసి నిజంగా నివురు కప్పిన నిప్పువే అను కున్నాను. కానీ ఆ నివురు పూర్తిగా తొలగిపోతే ఎంతటి అమాయకురాలైనా నిప్పులా మారి కణ కణలాడుతుందని, కాళికలా చెలరేగుతుందని తెలుస్తుంది. ఆనాడు నేనెంత పిరికిగా వూరు కున్నానో ఇప్పటికి నా కర్థం అయింది. కానీ సరళా! నీవు నడిపిన మార్గం సరైనదే. ఒక విధంగా మెచ్చుకోదగ్గది. అతన్ని అనవసరంగా నీవే ఎందుకు చంపాలి? ఒక్క శివరావును చంప గానే సరిపోయిందా? ఈ దేశంలో అలాంటి శివ రావులు ఎంతోమంది వున్నారు. వాళ్ళందరిని చంపాలంటే నీలాంటి సరళలు ఎంతమంది పుట్టుకు రావాలో! అతనికి గట్టిగా బుద్ధి చెప్పాల్సిన బాధ్యత మనదే. అందుకే అతన్ని ప్రభుత్వానికి అప్పగిస్తే అదే చూసుకుంటుంది ఏ శిక్ష పడాలో.

కృష్ణను గురించి నీకు ఎంతో మరెంతో తెలుసు అనుకున్నాను. కానీ ఈ ఉత్తరం పూర్తిగా చది వాక నీకు ఏమీ తెలియదని, కృష్ణ హృదయం నీకింకా సరిగ్గా అర్థం కాలేదని నాకిప్పుడు స్పష్టంగా తెలుస్తూంది. దురదృష్టవశాత్తూ నీ జీవితం అలా నాశనం కావటానికి కారణం నువ్వు కాదు కదా? నీవు నిమిత్తమాత్రురాలివి మాత్రమే. నిన్ను సహృదయంతో కృష్ణ తప్పక స్వీకరిస్తాడని నా మనసు పదే పదే చెప్తుంది. నా అంచనా తప్పు కాకూడదు. మొగ్గలోనే వాడిపోయిన నీ జీవితాన్ని వసంతంగా మార్చే పూచీ నాది.

నిన్ను కృష్ణకు అప్పగించే బాధ్యత పూర్తిగా నాదే. అదృష్టవశాత్తూ నిన్ను చేరుకునేందుకు ఇరవైనాలుగు గంటలు టైమిచ్చావు చాలు. ఇప్పుడే బయలుదేరి వస్తాను.

సుమిత్ర మనసిలా అనుకోగానే సుమిత్రకు ఎంతో ఆనందమైంది.

ఉత్తరం బ్యాగ్‌లో పెట్టుకుని 'కృష్ణకు టెలి గ్రామ్ యిచ్చి అట్నుంచి అతన్ని బయలుదేరి రమ్మందామా' అనుకుంది ఓ క్షణం. వెంటనే ఆ ఆలోచనకు స్వస్తి చెప్పి తనే నేరుగా హైదరా బాద్‌కు వెళ్ళాలని తన కారువైపు గబగబా అడు గులు వేసింది సుమిత్ర, సరళ గురించి, ఆమె భవిష్యత్తు గురించీ ఆలోచిస్తూ కారులో వున్న తాజా గులాబిని అందంగా నిమిరింది డాక్టర్ సుమిత్ర! *

# ఇది ఎన్నటికీ తీరని సమస్యేనా?




1961లో పార్లమెంట్ ఉభయ సభల సంయుక్త సమావేశంలో వరకట్న నిషేధం బిల్లు ఆమోదం పొందింది. ఆ చట్టం ప్రకారం దానిని ఉల్లంఘించిన వారికి ఆరు నెలలు కారాగారవాస శిక్ష విధించబడుతుందని ప్రకటింపబడింది. ఆ బిల్లు అమలు పరచి పద్దెనిమిదేళ్ళు దాటినా నేటికీ మనదేశంలో వివిధ ప్రాంతాలలో ఈ సమస్య తీవ్రతరంగానే వుంది. ఈ మధ్య అది ఢిల్లీ, ఉత్తరప్రదేశ్ ప్రాంతాలలో తన వికృతరూపాన్ని ప్రదర్శించింది. ఫలితంగా ఎందరో యువతులు బలైనారు. ప్రభుత్వం ఇప్పుడు ఆ శిక్షని రెండేళ్ళ కఠిన కారాగారశిక్షకి పెంచనున్నట్లు ప్రకటించింది. అంతేకాదు, "ఒకవేళ వివాహమైన తరువాత ఆ అమ్మాయి ఒక సంవత్సరం లోపల ఆత్మహత్య చేసుకున్నట్లయితే అందుకు బాధ్యులుగా ఆమె అత్తమామలను శిక్షించడానికి తగిన చట్టం కూడా రూపొందించడానికి న్యాయ మంత్రిత్వ శాఖతో ఆలోచనలు జరుపుతున్నాము. ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాలకి చెందిన యువతులు ఈ వరకట్న బాధితులులలో అధికంగా కనిపిస్తున్నారు. అత్తమామలు, కొన్ని సందర్భాలలో భర్త–పెట్టే హింసాకాండ భరించలేక వీరు దుర్మరణం పాలవుతున్నారు. ఈ చట్టం యిటువంటి వారికి కొంత సహాయకారిగా వుండగలదు" అన్నారు కేంద్ర విద్యా, సాంఘిక సంక్షేమ శాఖ సహాయ మంత్రి శ్రీమతి రేణుకాదేవి బర్కతకి.

ఇటీవల ఆ విధంగా వరకట్నానికి బలైపోయిన ఒక 'రాధ' కథ ఇక్కడ పొందుపరుస్తున్నాము:

వివాహం అనేది ఎంతో పవిత్రమైన వరంగా భావిస్తారు కన్నెపిల్లలు. తమకంటూ ఒక గృహం ఏర్పరచుకుని భర్త సాహచర్యంలో స్వేచ్ఛాయుత మైన నూతన జీవితాన్ని ప్రారంభించాలని కలలు కంటారు. ఆ విధంగానే వుంటుంది యువకులకి కూడా. ఇలా ఒండొరులు కలిసి మెలిసి జీవితాంతం శాశ్వత బంధం ఏర్పరచుకోవడమే ఆ మూడు ముళ్ళ అనుబంధ లక్ష్యం.

వివాహం కాకముందు ఒకరికొకరు అపరిచితులే అయినా వైవాహికబంధం పెనవేసుకున్న తర్వాత వారిరువురూ అరమరికలు లేని ఆప్తులే అవుతారు. వారి జీవితం ఆనందడోలికలలో తేలియాడుతుంది.

ఆ విధంగా కలలు కనే గృహస్థ జీవితంలోకి అడుగు పెట్టింది 'రాధ'. ఆమె తల్లిదండ్రులు సామాన్య మధ్య తరగతి కుటుంబానికి చెందినవారు. ఉన్నంతలో కూతురి వివాహం ఘనంగానే జరిపించారు. వరుడు ఢిల్లీలో వుద్యోగం చేస్తున్నాడు.

వధువుది కూడా ఆ పక్క వూరే. తాము అప్పుడప్పుడు వచ్చి చూచి పోతూ వుంటామనీ, బెంగ పెట్టుకోవద్దనీ కుమార్తెకి ధైర్యం చెప్పారు ఆమె తల్లిదండ్రులు. పెళ్ళయిన రోజునే తనకి సెలవు లేదంటూ రాధని తనతోపాటే ఢిల్లీకి తీసుకు వెళ్ళాడు వరుడు 'కిరణ్'.

తను గడపబోయే మధురమైన జీవితం, భర్త సాహచర్యం గురించి ఒక విధమైన ఉత్తేజంతో వూగిసలాడుతున్న రాధ - తల్లిదండ్రులను విడిచి వుండవలసి వస్తుందనే బాధ నుండి త్వరగానే వుపశమనం పొందింది.

భర్త యింటిలో మొదటి రోజు బాగానే గడిచింది. అత్తగారు కూడా మంచిదే అనుకుంది రాధ. ఆ యింట్లో అంతవరకూ ఆ తల్లి, కొడుకు మాత్రమే వుంటున్నారు. ఇప్పుడు మూడో మనిషి అడుగు పెట్టింది.

కోడలి రాకతో న్యాయంగా ఆ యింటికి కళ రావాలి. కాని మర్నాడు వుదయం తెలిసింది రాధకి - ఆ యింటికి తను 'కళ' తేలేదని, 'మాయని మచ్చ' తీసుకు వచ్చిందని; అవి అత్తగారు తనని 'ప్రేమతో' పలుకరించిన పలుకులు. అంతవరకూ అత్తగారు ఎంతో మంచిదని భావించిన రాధకు ఆవిడ నిజ స్వరూపం అప్పుడు కానీ తెలియలేదు.

పెళ్ళి రోజున సెలవు లేదని తనని కూడా తీసుకు వచ్చిన భర్త ఎందుకలా హఠాత్తుగా వచ్చేశాడో అప్పుడు ఆమెకి అర్థమైంది.

తన తండ్రి యిస్తానని చెప్పిన కట్నం డబ్బులో - ఐదు వేలు ఇవ్వలేదట. తరువాత సర్దుతానన్నాడట. ఇప్పుడా డబ్బు అతనికి అత్యవసరంగా కావాలిట!

ఇంకా నయం. ఆ పెళ్ళి పీటల మీద గొడవ చెయ్యలేదు. ఆ మాత్రం సంస్కారం వుంది అనుకుంది రాధ. కాని అది సంస్కారం కాదనీ లోకులు తమను గురించి తక్కువగా అనుకుంటారేమోనన్న పిరికితనమనీ ఆమె గ్రహించేటప్పటికే ఆలస్యమై పోయింది.

"ఏమే....నీ బాబు ఐదువేలు ఎగగొట్టాడు. ఏ మొహం పెట్టుకుని విన్నిక్కడికి పంపాడే? విన్ననే నాలుగూ దులిపేసి వుందును. కాని 'కొత్త కోడల్ని' చూడడానికి ఆ మూకంతా వచ్చారాయె" అన్నది చేతులు విసురుగా ఆడిస్తూ అత్తగారు.

"ఆ విషయాలేవీ నాకు తెలియదు అత్తయ్యా-నాన్న నాకేమీ చెప్పలేదు" అన్నది రాధ బిత్తర పోయి చూస్తూ.

"అబ్బ..ఎంతటి నంగనాచివే-నీకేమి తెలియదూ. మీ కుటుంబం మోసగాళ్ళ కుటుంబమనీ, మీ నాన్న ఒక దగుల్బాజీ అనీ తెలియక ఈ సంబంధానికి ఒప్పుకున్నాం" అంటున్న అత్తగారి దుర్భాషలు సహించలేక భర్త వైపు చూసింది రాధ.

కిరణ్ తల్లిచాటు బిడ్డ. అంతేకాదు చదువుకున్న మూర్ఖుడు కూడా. తనకి రావలసిన కట్నం రాకపోయేసరికి అతనది అవమానంగా భావించాడు. అందుకుతోడు_తల్లి అతనెక్కడ భార్యకి లొంగిపోతాడోనని అది ఎంతటి 'ఘోరమైన అవమానమో' అతని తలకెక్కేలా నూరి పోసింది. దాంతో అతను రెచ్చిపోయాడు. తన మగతనానికే సవాలుగా భావించాడు.

"అంతేకాదు. నాకు నాసిరకం బట్టలు పెట్టాడు మీ నాన్న, ఉలెన్‌సూట్ యిస్తేగానీ వీల్లేదు." అన్నాడు మొండిగా.

రాధకి ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. తన తండ్రికి అది తాహతుకు మించిన పని అని ఆమెకి తెలుసు. తన తండ్రి మోసగాడు కాదనీ, ఒకవేళ కట్నం డబ్బు ఇవ్వవలసి వుంటే తప్పక ఎప్పటికైనా యిస్తాడనీ నచ్చ చెప్పింది. కాని కరడుకట్టిన ఆ పాషాణ హృదయాలు కరిగితేకదా.

"ఆ....ఎప్పుడో యిస్తాడు. అంతదాకా నీకు తిండిపెట్టి మేపమంటావా? నీ భారం వదిలించుకునేందుకు మీ నాన్న నిన్ను మా మీద గుదిబండలా పడేశాడు. ఇక నిశ్చింతగా వుంటాడు ఆయనకేం_ముందు ఉత్తరం రాయి. ఆ డబ్బు పంపకపోతే నిన్ను వెళ్ళగొడతాం అని చెప్పు" అంది అత్తగారు.



రాధ అభిమానవంతురాలు. భర్త ... తనకు లభించదని తెలుసుకుంది. అత్తగార... అన్నప్పటి నుంచి భోజనం మానేసి... తండ్రికి మాత్రం ఉత్తరం రాయలేదు. ఆమెకు తెలుసు. రాస్తే తండ్రి బాధపడడం మినహా ఏమీ చెయ్యలేడని. ఇప్పటికే ఆయన తల మునకలైన అప్పుల్తో బాధపడుతున్నాడు. ఒకవేళ ఎలాగో కిందా మీద పడి, అప్పు చేసినా అది తీర్చడానికి ఆయన జీవితాంతం బాధపడాలి. తన పెళ్ళికోసం అయిన అప్పు తలుచుకుంటూనే కుమిలిపోతున్న రాధ యిక ఈ విషయం తండ్రికెలా తెలియజేస్తుంది?

మూడు రోజులు గడిచాయి. ఈ మూడు రోజుల్లో రాధ అనుభవించిన బాధలు వర్ణనాతీతం. రాధ పుట్టింటికి ఉత్తరం రాయలేదని తెలిసి అత్తగారు మరింత సాధించడం మొదలెట్టింది. ఆమె భర్త చెయ్యి చేసుకోవడం వరకూ వచ్చింది వ్యవహారం. చుట్టుపక్కలవారికి కూడా ఈ విషయం తెలిసింది. విడ్డూరంగా చెప్పుకోవడం ప్రారంభించారు. రాధ_భర్త, అత్తగారు పెడుతున్న హింసలన్నీ భరించింది. కాని పుట్టింటికి ఉత్తరం మాత్రం రాయలేదు.

ఆ రోజు రాఖీపండుగ. ఆమె అన్న చెల్లెల్ని చూడడానికి ఢిల్లీ వచ్చాడు. రాధ తన బాధనంతా మరచిపోయి అన్నకి ఆనందంగా రక్షాబంధనం కట్టింది. నాలుగు రోజులకే చిక్కి శల్యమై, దీనాతి దీనంగా వున్న చెల్లెలి ముఖం చూడగానే ఏదో జరిగిందని గ్రహించాడు. రాధని అడిగాడు. కాని ఆమె నోరువిప్పి చెప్పలేదు.

అక్కడే వున్న కిరణ్ భార్యవైపు ఉరిమిచూసి తన గొంతెమ్మ కోరికని బయటపెట్టాడు.

రాధ అన్న ఎలాగో అలా ఉలెన్‌సూట్ యివ్వగలిగాడు. కట్నం డబ్బులు వీలువెంబడి సర్దుతామన్నాడు. లాభం లేకపోయింది. బ్రతిమాలాడు. అప్పటికి పూరుకున్నాడు కిరణ్. చెల్లెలికి ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు రాధ అన్న.

అతడు వెళ్ళగానే మళ్ళా హింసాకాండ, దుర్భాషలు ప్రారంభమయ్యాయి.

తన అన్నగారిచ్చిన ఉలెన్‌సూట్ పేరాశతో అందుకున్న భర్త యిప్పుడు - "ముష్టి ఉలెన్ సూటయితే యిచ్చాడుగానీ డబ్బేది....నేనేం అంత బట్టలకి లేనివాడిననుకున్నాడా మీ అన్న" అంటూ

**[లోకజ్ఞానం-సమాధానాలు]**

1. చైనా.
2. 'ఎంటర్‌ప్రైస్'. అమెరికాదేశపు ఏడవ యుద్ధ నౌకా విభాగానికి చెందిన నౌక యిది. దాదాపు నాలుగువందల కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించబడినది ఈ యుద్ధ నౌక.
3. ఇసబెల్లా పెరాన్. 1974లో అప్పటి అధ్యక్షుడు, ఆమె భర్త అయిన జాన్ పెరాన్ మరణం తర్వాత అర్జెంటినా దేశానికి 1974_75 మధ్య ఒక సంవత్సరం కాలం పాటు అధ్యక్షత వహించింది. సైనిక తిరుగుబాటువల్ల '75లో ఆమె తన పదవిని కోల్పోయింది.
4. భాస్కర. జూన్ 7వ తేదీన రష్యా దేశపు సహకారంతో అంతరిక్షంలోకి పంపబడింది.
5. డాక్టర్ విలియం స్టోక్స్. ఇంగ్లండు దేశస్థుడు. 1837లో కనిపెట్టాడు.
6. 1973 మే నెలలో ప్రయోగించబడి, 85 టన్నుల బరువు గల ఈ స్కైలాబ్ రెండువేల కిలోమీటర్ల వేగంతో భూమి మీద పడనున్నదని అంచనా వేయబడింది. దాదాపు ఐదువందల ముక్కలు అయ్యే ఈ గగన ప్రయోగశాల జూలై నెలలో ప్రపంచంలోని ఇతర దేశాలతో పాటు భారతదేశం మీద కూడా పడవచ్చునని వూహిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలలో కూడా ఈ ముక్కలు పడే అవకాశం వుంది. అయితే అధిక జనాభాగల ప్రాంతాలలో పడకుండా చెయ్యగలమని అమెరికా హామీ యిచ్చింది. అందువల్ల సంభవించే నష్టాన్ని కూడా తాము భరిస్తామని హామీ యిచ్చింది.
7. బంగారం.
8. ఆఫ్రికన్ ఎలిఫెంట్. (ఆఫ్రికా ఏనుగు). ఆరడుగుల పైబడి ఎత్తుగల ఈ ఏనుగు బరువు 6½ టన్నులు.
9. మేడమ్ మాంటిస్సోరి (1870 - 1932). నేడు విశేషంగా ప్రచారంలో వున్న మాంటిస్సోరి శిశు విద్యా విధానాన్ని రూపొందించిన వనిత. ఆమె కనిపెట్టిన ఈ విద్యా విధానం వల్ల పిల్లలు ప్రకృతి సహాయంతో అతి సులభంగా విద్య నేర్చుకోగలుగుతున్నారు.
10. విష్ణుశర్మ. 'పంచతంత్రము'లోని ఐదు భాగాలు: మిత్రలాభము, మిత్ర సంప్రాప్తి, మిత్ర భేదము, కాకోలూకీయము, లబ్ధప్రనాశము, అపరీక్షితకారకము.

ఎగిరిపడ్డాడు.

"లేనివాడు కాకపోతే ఎందుకడగడమో''— రాధలో సహనం నశించింది. తిరగబడింది. ఫలితంగా తిట్లు, శాపనార్థాలు, చెయ్యి చేసుకోవడమూను.

మానవత్వం నశించిన ఆ మనుష్యుల మధ్య జీవించడం ఆమెకి దుర్భరంగా అనిపించింది. కాని ఎక్కడికి వెళుతుంది? పుట్టింటికి వెళితే....నాలుగు రోజులకే తమ గ్రామంలో అందరి నోళ్ళలోనూ తనే చర్చావిషయమైపోతుంది. తన తల్లిదండ్రులు కుమిలిపోతారు. వాళ్ళను క్షోభపెట్టినట్లవుతుంది. తనంతటతాను విడిగా జీవించే ధైర్యమూ, అందుకు తగ్గ అర్హతలూ ఆమెకు లేవు. పైగా అది కొత్త చోటు. మహానగరం. ఆ నగరంలో ఒంటరిగా ఒక స్త్రీ-అందునా భర్తని విడిచి పెట్టిన స్త్రీ— నివసించడమంటే అది అత్తగారు పెట్టే హింసల కన్నా భయంకరమైనదే కావచ్చు. అందుకే మౌనంగా ఎవరెన్నన్నా పడివుంటూ మనసు రాయి చేసుకుని అక్కడే వుండిపోవడానికి నిశ్చయించుకుంది.

ఆ రోజు జరిగిన ఘర్షణ రాజుకుని రాజుకుని భయంకరమైన పరిణామానికి దారితీసింది.

సరిగ్గా ఆ రోజే వారింటికి ఒకావిడ వచ్చింది. ఆమె ఆ పొరుగునే వుంటోంది. ఈ ఇంటి పరిస్థితి ఆమెకు తెలుసు. రాధ మీద జాలి వుందామెకు. ఆమెని చూడగానే అత్తగారు తెగ కంగారు పడిపోయింది. ఏదో కాలుతున్న వాసన వచ్చేసరికి ఆమె రాధ అత్తగారిని హెచ్చరించింది.

"ఆఁ....ఏదో మాడుతున్నట్లుందిలే'' అని వూరుకుంది అత్తగారు.

"కోడలేది?'' అడిగింది వచ్చినావిడ.

రాధ అత్తగారు సమాధానం చెప్పలేదు.

ఆ వాసన మరీ దుర్వాసనగా తోచేసరికి ఆవిడ నిలదీసి అడిగింది "కోడలేదీ?'' అని. ఆ గది వైపు వెళ్ళబోయింది.

ఆ అత్తగారు ఆవిడవైపు కోపంగా చూసి "కోడలు తగలబడిపోయింది. నీకెందుకు? నువ్వూరుకో'' అంది.

వెంటనే ఆ వార్త దావానలంలా పాకిపోయింది. మిత్రుల ద్వారా ఈ వార్త విన్న రాధ అన్న అసలు విషయం తెలుసుకునేందుకు తను ముందుగా ఢిల్లీకి వచ్చాడు. పోలీసులకి ఫిర్యాదు వెళ్ళింది. వారు రాధ 'ఆత్మహత్య' చేసుకున్నట్లుగా కేసు రిజిష్టర్ చేశారు. అంతటితో ఈ విషయానికి సమాధి కట్టబడిందనుకుంది పాపం ఆ అత్తగారు.

కాని చుట్టుపక్కల వాళ్ళు వూరుకోలేదు. సంతకాల సేకరణ ప్రారంభించారు. పెళ్ళయి ఏడు రోజులు కూడా నిండని స్త్రీ ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం ఏముందనీ, ఒకవేళ ఆమె ప్రమాదవశాత్తు మరణించి వుంటే సహాయం కోసం అరిచి వుండేదనీ యిది తప్పకుండా హత్యేననీ ఈ అంశాలను దృష్టిలో వుంచుకుని కేసు పునఃపరిశీలించవలసిందనీ అధికారులను కోరారు.

ఏది ఏమైనా వరకట్న పిశాచం మరో అమాయకురాలిని పొట్టన పెట్టుకుంది. కట్నం డబ్బులు తేలేదన్న కక్షతో సాటి స్త్రీ అయివుండి అత్తగారు, కట్టుకుని కనికరమైనా చూపని భర్త — ఈ యిద్దరి అమానుష చర్యకి బలైపోయింది వివాహ జీవితంలోని స్వర్గాన్ని కాక నరకాన్నే చవి చూసిన రాధ.

పేర్లు మారినా ఇది ఒక యథార్థ గాథ. ఇటువంటి కథలు విన్నప్పుడల్లా ఒకటే అనిపిస్తుంది.

వరకట్నం అనేది సాంఘిక సమస్య. అది రూపు మాపాలంటే కేవలం చట్టాలు తెచ్చి ప్రయోజనం లేదు. మనుష్యులలోనే మార్పు రావాలి. దురదృష్టకరమైన విషయం ఏమిటంటే స్త్రీలకి సంబంధించిన ఈ సమస్యకి స్త్రీలే ప్రతిబంధకాలు కావడం (ఉదాహరణకి రాధ అత్తగారి వంటివారు). చాలామంది పెద్దలు, పెళ్లి కావలసిన అబ్బాయిలు కూడా చాలా తీవ్రంగా వరకట్న నిషేధం గురించి మాట్లాడతారు. తీసుకోకూడదని వాదిస్తారు. కాని మనసులో మాత్రం అమ్మాయికి ఎంత ఆస్తి వుందా అని బేరీజు వేస్తారు. అబ్బాయి కట్నం తీసుకోన్నా అతనిలో ఏ లోపం వుందో అనుకునే చాదస్త శిఖామణులూ వున్నారు. ఇటువంటి ఆలోచనలు పోవాలి. మనిషి మరో మనిషిని అమ్మడం కాని కొనడం కాని నాగరికత అనిపించుకోదు. అది అనాగరికుల లక్షణం. మనం ఇంకా ఆ లక్షణంలోనే కొట్టుమిట్టాడుతున్నామంటే అది నిజంగా విచారించదగ్గవిషయం. మనకి స్వాతంత్ర్యం వచ్చి ముప్పై సంవత్సరాలు దాటినా ఏమాత్రం అణగారకుండా నానాటికీ వికృతరూపం దాలుస్తున్న ఈ సమస్య - ప్రభుత్వం ఇప్పుడు తీసుకు రానున్న కఠినమైన చట్టాలకి లొంగుతుందా? లేక ఇది ఎన్నటికీ తీరని సమస్యేనా?

—లక్ష్మి

### పి. ఉషశ్రీ



'ఆధునిక ప్రపంచంలో మరణదండన సమర్థనీయమా?' ఇటీవల పాకిస్తాన్ మాజీ ప్రధాని భుట్టో ఉరితీత తరువాత ప్రపంచాన్నంతటిని కలచివేసిన సమస్య యిది.

అయితే గత సంవత్సరం డిసెంబరు నెలలోనే ఈ విషయంపై బాపట్ల ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాలవారు రాష్ట్రస్థాయిలో వక్తృత్వపు పోటీని ఏర్పాటు చేశారు.

"ఆధునిక ప్రపంచంలో మానవజాతి శాస్త్రీయంగానూ, మానసికంగానూ, సాంస్కృతికంగానూ, సాంఘికంగానూ ఎంతో అభివృద్ధి చెంది వున్నతస్థానానికి చేరగలిగింది. ఇక్కడ నాగరికతకు స్థానముండే కాని అనాగరిక ఆటవిక ప్రవృత్తికికాదు. అందువల్ల నేటి అభ్యుదయ ప్రపంచంలో మరణదండన ఏ మాత్రం సమంజసం కాదు.'' అని వాదించి ప్రథమ బహుమతి గెల్చుకున్నారు కావలి జవహర్ భారతి కళాశాల బి.ఎస్సీ విద్యార్థిని కుమారి పవని ఉషశ్రీ.

వక్తృత్వపు పోటీలలో ఆమె పలు బహుమతులు సంపాయించారు. 1975 - 76లో కావలిలో జరిగిన వక్తృత్వపు పోటీలలో ఆమె వెండిపతకం పొందారు. గత రెండు సంవత్సరాలుగా జవహర్ భారతి కళాశాలలో జరిగిన వక్తృతపు పోటీలలోనూ, గేయరచన, వ్యాసరచన, ఏకపాత్రాభినయం మొదలైన పోటీలలోనూ ఆమె అనేక బహుమతులు పొందారు.

కేవలం వాక్చాతుర్యంతోనే కాక తన నృత్య పటిమతో కూడా ప్రేక్షకులను ముగ్ధులను గావించిన ఉషశ్రీ 1975లో వరంగల్‌లో జరిగిన రాష్ట్రస్థాయి స్కౌట్స్ అండ్ గైడ్ రాలీలోనూ, హైద్రాబాద్ బాలల అకాడెమి నిర్వహించిన పోటీలలోనూ నృత్య ప్రదర్శనలు యిచ్చి ప్రథమ బహుమతి పొందారు. —విజయ

విద్యార్థినుల శీర్షిక:

# స్త్రీ స్వాతంత్ర్యం - వైవాహిక బంధం

'స్త్రీ స్వాతంత్ర్యం – వైవాహిక బంధం'' అనే విషయం మీద విద్యార్థినుల దగ్గర్నుంచి వ్యాసాలను కోరగా, వ్యవధి తక్కువగా వున్నా సరే, ఎక్కువ సంఖ్యలో విద్యార్థినులు పాల్గొనడం - సంతోషదాయకమైన విషయం. ఆ వ్యాసాల్లోని మూడు వ్యాసాలను ఎన్నికచేసి ఇక్కడ ప్రచురిస్తున్నాము. పాల్గొన్న విద్యార్థినులందరికీ మా అభినందనలు తెలుపుకుంటున్నాము.

నేటి వనిత ప్రతి రంగంలోనూ పురుషునితో సమానురాలని నిరూపించుకో గలిగింది. పురోగమిస్తున్నది. పురాణయుగపు స్త్రీకి, ఆధునిక స్త్రీకి ఆలోచనల్లో భూమ్యాకాశాల మధ్యనున్నంత అంతరం ఉంది. విద్యావంతురాలై, పటిష్ఠమైన వ్యక్తిత్వాన్ని రూపొందించుకున్న వనిత తనపై ఇతరుల ఆధిపత్యాన్ని సహించలేదు. మారుతున్న కాలంతో, ఆలోచనలూ, అభిరుచులూ మారక తప్పదు. అవివాహిత అయిన అమ్మాయిలో చిందులువేసే ఉత్సాహం, చైతన్యం, వివాహితుల్లో కానరాదు. మధ్యతరగతి ఆడపిల్లల్లో అరవైశాతం మంది వివాహితులు ఉత్త జీవచ్ఛవాల్లా జీవిస్తున్నారంటే అబద్ధం కాదు.

ఈ రోజుల్లో ఆడపిల్లలకి తల్లిదండ్రులు కనీస మాత్రపు స్వేచ్ఛ ఇస్తారు. కోరుకున్న చదువు చదువుకోవడంలో, స్నేహితులతో కలిసి మెలగడంలో అనవసరమైన ఆంక్షలుండవు. కాలేజీ జీవితం ఒక కలలా గడిచిపోతుంది. ఆమె అభిరుచులకి ప్రోత్సాహం దొరక్కపోయినా, నిరుత్సాహ పరిచేవారుండరు. ప్రేమ, అనురాగంతో కూడిన ఆ వాతావరణంలో ఆమె ఆలోచనలూ, అభిరుచులూ, ఆశయాలూ, ఇంకా 'ఆవేశాలూ' కలిసి ఒక అందమైన 'వ్యక్తిత్వం' రూపొందుతుంది. ఆ అమ్మాయి వైవాహిక జీవితాన్ని గురించి ఎన్నో ఊహించుకుంటుంది.

హిందూ సమాజంలో మంగళప్రదమైనదిగా భావించబడుతున్న ఈ 'వివాహం', స్త్రీ పురుషుల మధ్య శారీరకమైన, భావనాత్మకమైన, వ్యక్తిగతమైన సంబంధం. ఇందులో ఇద్దరికీ సమానమైన అధికారం, బాధ్యత ఉన్నాయి. కాని, నేడు వివాహవ్యవస్థలో స్త్రీకే ఎక్కువ బాధ్యత ఉంటున్నది. మగవాడికి సమిష్టి కుటుంబమైనా, వ్యష్టి కుటుంబమైనా, తన తల్లిదండ్రుల లేదా సోదరీసోదరుల బాధ్యత ఉంటుంది. అలాంటప్పుడు, వివాహితురాలైన స్త్రీ భార్యగా, ఇంటి కోడలుగా, వదినెగా....తన బాధ్యత ఓర్పుతో, దక్షతతో నిర్వహించగలగాలి. ఈ బాధ్యతల్ని ఏ మధ్యతరగతి ఆడపిల్లైనా ఆనందంతో అంగీకరిస్తుంది.

కాని, ఈ బాధ్యతల మధ్య ఆమె తన అభిప్రాయాల్నీ, అభిరుచుల్నీ, ఆదర్శాలనీ అణచివేయాల్సి వస్తుంది. అనుక్షణం ఆమెని శాసించేవారే ఉంటారు తప్ప, ఆమెకు ప్రేమానురాగాలూ, కనీస ప్రోత్సాహమూ లభించవు. పెళ్ళయేదాకా చదువుకున్న అమ్మాయి మీద మోజు. ఆమె వ్యక్తిత్వానికి విలువనిస్తానని పోజు. కాని, అంతా అయాక కొత్తమోజు తీరాక, 'అది తన పెళ్ళాం' అంతే. అణకువతో 'అనుకూలవతి'గా మెలగాలి. ఆమెకీ అభిరుచులుంటాయి, ఆదర్శాలుంటాయి, ఒక మనసుంటుందీ–అని ఎంతమంది ఆలోచిస్తారు? భర్త కోపిష్టియైనా, అనుమానం మనిషి, పిసినారీ, మొండి వాడూ, పేకాటరాయుడూ - ఎలాంటివాడైనా సర్దుకుపోవాలి! ఆమెకి సంగీతం, సాహిత్యం ఇలాంటి కళల మీద మక్కువ ఉంటే, గుర్తించి ఎంతమంది భర్తలు ప్రోత్సహిస్తారు?

## ప్రథమ బహుమతి రూ. 100 పొందిన వ్యాసం

చదువుకున్న ఆడదైతే, మగవాడి అహంకారానికి, అనుక్షణం తలెత్తుతూ ఉంటుంది. వాదిస్తుంది. తర్కిస్తుంది. ఉద్యోగం చేసే స్త్రీల సంగతి చె[illegible]నవసరం లేదు. సవాలక్ష అనుమానాలూ, శతకోటి ఆంక్షలూ. ఇంటి పనీ, వంట పనీ చేసి, ఉద్యోగం చేస్తున్న ఆమెకి కనీస సహాయ సహ కారాలందజేసే మగాళ్ళెంతమంది? కనీసం స్నేహితురాళ్ళని కలవడానికీ, ఫ్రీగా మాట్లాడుకోవడానికి కూడా స్వేచ్ఛలేని 'భార్యలు' ఉన్నారంటే నమ్మరేమో!

వివాహానికి ముందు అంతా ఒక ఊహాలోకం. వివాహం తర్వాత ఎదుర్కోవాల్సింది నిష్ఠుర వాస్తవ ప్రపంచం. కాని, నా అభిప్రాయం అందరి సంగతీ ఇంతే అనికాదు. ఇందుకు, వ్యతిరేకంగా ఉన్న సంసారాలూ, స్త్రీలూ ఉన్నారు. కాని, ఎక్కువమంది సంగతి ఇంతే అన్న నిజాన్ని అంగీకరించక తప్పదు. కొన్ని రోజుల సంఘర్షణ తర్వాత, ఆమెలో చైతన్యం, ఉత్సాహం, ఆశలూ, ఆదర్శాలూ అన్నీ అణగారిపోతాయి. ఇంకా ఆమె లోలోతుల్లో ఉన్న బానిసతత్వం ఆమెని పురోగమించనివ్వదు. మగవారిలో సంస్కారం, అర్థం చేసుకునే మనసూ, విచక్షణాజ్ఞానం వచ్చి, ఆడవారిలో కొంత తెగింపూ, చైతన్యం ఉంటే, ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోవడంతో సంసారాలు నందనవనాలే అవుతాయి.

వివాహం స్త్రీకి పరిపూర్ణస్వేచ్ఛని ఇవ్వగలిగితే, ఆమె పిల్లల్ని చక్కగా తీర్చిదిద్దగలదు. స్వేచ్ఛామయ జీవితంలో కళలు వికసిస్తాయి.

ఏమైనా 'వైవాహిక బంధం' స్త్రీ స్వేచ్ఛకి 'బంధం' మాత్రం కాకూడదు. అలాంటి పక్షంలో, విద్యావంతులై-వ్యక్తిత్వమూ, అభిమానమూ ఉన్న స్త్రీలు అవివాహితలుగానే ఉండిపోవడం మేలు.

—యస్. సి. యస్. సుధారమ
ఫస్ట్ బికామ్, ఎ సెక్షన్
యమ్. ఇ. యస్. కాలేజ్,
మల్లేశ్వరం, బెంగళూరు-10

పెళ్ళికి ముందు స్త్రీకి ఎన్నో స్వతంత్ర భావాలు, స్వేచ్ఛ వుంటాయి. ఒక విధంగా వైవాహిక బంధం ఆమె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు బంధనంగానే మారుతున్నది. అసలు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు అనేవి మానవ జీవితానికి ఎంతో అవసరం. మనిషికి బలమైన వ్యక్తిత్వం ఏర్పడాలంటే ముఖ్యంగా స్వేచ్ఛ అవసరం. అదే విధంగా వ్యక్తి మనోవికాసానికి దోహదం చేసేది స్వాతంత్ర్యం. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలనగానే పది సినిమాలు చూడడం, ఇష్టం వచ్చినట్లు తిరగడం కాదు. ఒక ఆదర్శాన్ని లక్ష్యంగా పెట్టుకుని, తనకు లభించిన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను సద్వినియోగ పరచుకోవాలి. తన ఆదర్శాన్ని అందుకోవాలి.

వివాహ మనేది ఒక పవిత్ర బంధం. నింగిలో ఎంతో ఎత్తుకు ఎగిరే విహంగం ఎన్నో యోజనాలు ప్రయాణించవచ్చు. కాని ఎక్కడో ఒక చోట నేల వాలక మానదు. అట్లాగే ఎంత చదివినా, ఏమి సంపాదించినా స్త్రీకి పురుషుడి అవసరం, పురుషుడికి స్త్రీ అవసరం తప్పక ఉంటుంది. మరి వారిద్దరినీ ఒకరికి ఒకర్ని తోడుగా నిల్పేది వివాహ బంధం. ఇంతవరకు బాగానే ఉంటుంది. ఇక్కడే మొదలవుతుంది అసలు సంఘర్షణ.

ఒప్పుకుంటాను: ఆడ, మగ సమానులే. కాని సంఘం సృష్టించిన పరిధిలో "స్త్రీ" అస్వతంత్రురాలు, 'బానిస', విలాస వస్తువు మాత్రమే. నాటినుంచి నేటి వరకు మనం అతి పవిత్రంగా భావించే గ్రంథాలు కూడ ఈ విషయాన్నే సుస్పష్టం చేస్తున్నాయి. నుదుటి వ్రాతలు బ్రహ్మ వ్రాస్తాడంటారు. కాని స్త్రీకి మాత్రం వివాహ బంధంతో ముడిబడిన మగవాడు వ్రాస్తున్నాడా అన్న సంశయం కల్గుతుంది కొందరి స్త్రీల వైవాహిక జీవిత పంథాను గమనిస్తే.

స్త్రీ స్వాతంత్ర్య భావాల వరవడికి ఆనకట్టవంటిది వివాహ బంధం. (1) వివాహమైన స్త్రీకి ఇల్లే స్వర్గంగా, పిల్లలను కనిపెంచే యంత్రంగా, వంట ఇంటి కుందేటి సామెతగా నిర్ణయించి రూల్ పాస్ చేస్తాడు భర్త. (2) మతం, ధర్మము, న్యాయము, పుణ్యము అనే ఆచార వ్యవహారాలతో అణగద్రొక్కి-సంఘం చెక్కిన శిల్పంగా స్త్రీని నిలబెట్టింది సమాజం. (3) 'మా భావి జీవిత బాటలను తీర్చిదిద్దే బాధ్యత తల్లిగా నీదే సుమా!' అంటూ కర్తవ్య భారాన్ని భుజస్కంధాలపై నిలుపుతుంది సంతానం. ఇన్నిటిని అధిగమించి పైకి పోలేక తనలో తాను తర్కించుకుని, తన స్వేచ్ఛకు, స్వతంత్ర భావాలకు స్వయంగా ఒక ఆనకట్టను సృష్టించుకొంటోంది స్త్రీ.

నాటినుండి నేటివరకు అన్ని ప్రముఖ రంగాలలోను, అన్ని కళలలోను సాటిలేని మేటి స్త్రీలుగా ప్రసిద్ధి కెక్కిన స్త్రీ లెందరో వున్నారు. వీరందరికీ వివాహ బంధం అడ్డు కాలేదా? అని ప్రశ్నించుకోవచ్చు. కాని ఆ విధంగా పైకి వచ్చిన స్త్రీల శాతమెంత? వారందరూ శాంతియుతంగా స్వేచ్ఛా వాయు

వులు పీల్చిన వారేనంటారా? మేడిపండువంటి జీవితాలెందరివో? ఏ స్త్రీ జీవితం వెనుక ఏ కన్నీటి కడలి ప్రవహిస్తున్నదో? క్రొవ్వొత్తివంటి జీవితాలెందరివో? ఎలా తెలుసుకోవటం? హృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలౌతున్నా పెదవులపై అమృతాన్ని చిందించే స్త్రీలు కోకొల్లలు. ఏది ఏమయినా భార్యలను సహృదయంతో ఆదరించి, విచక్షణా జ్ఞానంతో చేయూతనిచ్చిన భర్తలు బహు తక్కువ శాతమనే చెప్పాలి. స్త్రీ వైవాహిక బంధానంతరం ఏ విధమయిన ఉన్నతిని సాధించినా లేక ఆశయాల సమాధి ఏర్పడినా అది సగానికి సగం పురుషుడి సహకారం వల్లనే.

## ద్వితీయ బహుమతి రూ. 75 పొందిన వ్యాసం

ఇంకొక రకం పురుషులు తన భార్య ఉన్నతిని మనసారా కాంక్షిస్తారు. కాని వాస్తవరూగా అట్లాంటి పరిస్థితులు ఏర్పడినపుడు, సంఘం చేసే గేలికి తట్టుకోలేక ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌ను పెంచుకుంటారు. ఆ ఇనిఫీరియర్ ఫీలింగుతో క్షణ క్షణమూ ఏదో ఒక సమస్యను సృష్టించి తీరని అశాంతికి గురి చేస్తారు. దెప్పిపొడుపు మాటలతో కృంగదీస్తారు. ఇలాంటి విషమ పరిస్థితులలో ఏమి చేయాలో తోచక, వాటిని ఛేదించుకుని బయటపడలేక, ఒకవేళ బయట పడినా సంఘంలో వచ్చే ఆటుపోట్లకు తట్టుకోలేక సతమతమవుతుంది స్త్రీ. కుటుంబ భాధ్యతలు, బంధాలు తెంచుకోలేక తన ఉనికిని మర్చిపోయి, ఆశయాలకు, ఆదర్శాలకు స్వస్తిచెప్పి, పరిస్థితులకు లొంగిపోతోంది స్త్రీ. ఆడదానిగా, అబలగా కళ్ళు మూసుకుని కాలక్షేపం చేయవల్సిన అగత్యం ఏర్పడుతోంది కొందరి స్త్రీలకు. దీనంతటికీ కారణం వివాహబంధం.

స్త్రీకి వివాహబంధమనేది పవిత్రబంధమే. కాని పురుషుడు ఆమెను సక్రమంగా గౌరవించి, ఆమె మనోభావాలకు రూపకల్పన చేసి, ప్రోత్సహించాలి. అడుగడుగునా తన పురుషాధిక్యాన్ని ప్రదర్శింపక, ఆమె మనస్తత్వాన్ని మొగుడిగా కాక సహచరునిగా అర్థం చేసుకుని, ఆమె ఆశయాల కోటకు తాను పునాదిగా నిలవాలి. ఆనాడు నిజంగా స్త్రీ ధన్యురాలు. అప్పుడే స్త్రీయొక్క వివాహబంధానికి సార్థకత.

స్త్రీ జీవన సమరంలో పురుషుడిది ముఖ్యపాత్ర. పురుషుని అండ సంపూర్ణంగా లభించిన స్త్రీ సమాజంలో చెలరేగే భీభత్సాలనెన్నిటినైనా ఎదుర్కొని ఆకాశాన్నైనా అందుకోగలదు. కాని ఇలాంటి సమైక్యత స్త్రీకి కనుచూపు మేరలో ఎక్కడా కనిపించటం లేదు. ఎండమావిలా ఊరిస్తోందే తప్ప నిజానికి దగ్గర కాలేకపోతోంది. అందుకే స్త్రీ స్వాతంత్ర్యానికి, స్వేచ్ఛకు, స్వతంత్ర భావాలకు, ఆదర్శాలకు, ఆశయాలకు, వైవాహికబంధం అడ్డుగోడగా నిలబడుతున్నది.

—వి. శోభ (కలం పేరు: అనామిక)
బిఎస్‌సి, మూడవ సంవత్సరం,
ఆర్. బి. వి. ఆర్. ఆర్. విమెన్స్ కాలేజ్
నారాయణగూడ, హైద్రాబాదు-27

వివాహానికి ముందు, వెనక ఒక స్త్రీకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గురించి మాట్లాడే ముందు తన తండ్రి లేక భర్త స్వభావం ఆలోచించి మరీ మాట్లాడాలి. వివాహానికి పూర్వం తండ్రి సంరక్షణలోను, వివాహానంతరం భర్త సంరక్షణలోనూ వుంటుంది స్త్రీ. వివాహానంతరం బాధ్యతలు ఎక్కువై గృహ జీవితానికి, సంసార బంధానికీ కట్టుబడి వుంటుంది. రెండు దశలలోనూ దాదాపు ఒకే విధమైన స్వేచ్ఛ వుంటుంది. కాకపోతే బరువు బాధ్యతలు గృహిణిగా ఎక్కువ భరిస్తుంది. అలాంటప్పుడు కేవలం వైవాహిక జీవితమే బానిసత్వమనీ భార్యలంటే బానిసలనీ ఎందుకు అపోహపడాలి? అవివాహిత జీవితంలో లేని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వివాహిత జీవితంలో కొత్తగా ఎక్కడ నుండి వస్తాయి? ఆ విధంగా ఆశించి, బంగారు కలలు కని, ఆ పైన వివాహమయ్యాక తన కలలు నిజం కాదనీ, తనాశించిన ఆదర్శాలు అమలు జరపటానికి తన భర్త ఆటంకపరుస్తున్నాడని అనుకోవటం అవివేకం! అసలు స్త్రీలలో ఈ విధమైన ఊహ రావటానికి ఒక్కటే కారణం కనిపిస్తుంది. తీరికగా కూర్చున్నప్పుడల్లా ఊహ కందినంతవరకూ భావి జీవితపు గాలి మేడలు కట్టుకోవడం, వాస్తవిక జీవితంలో కనీసం వాటి ఛాయలైనా చూడలేకపోవడమే అనిపిస్తుంది. స్త్రీలు ఆదర్శాలు కలిగి వుండడంలో తప్పులేదు. ఆ ఆదర్శాలు ఆశ్చర్యదాయకంగా, అనర్థదాయకంగా వుండి చెడుత్రోవన పడితే ప్రతిఫలం ప్రమాదాలకు హేతువు. ఈ రకమైన ఆదర్శాలు కొనసాగకపోతే భార్యని భర్త బానిసగా చూస్తాడనీ, భార్య వ్యక్తిత్వాన్ని లక్ష్యం చెయ్యడని మన స్త్రీలు వాపోతారు. ఆదర్శాలు జీవితాలను బాగు చేసేవిగా వుండాలి. మనకు అందుబాటులో లేని ఆదర్శాలను తలపులో పెట్టుకుని చివరకు అవి అందని ద్రాక్షపండ్లయితే బాధపడటం సబబుకాదు. ఈ విషయాన్ని ప్రతి స్త్రీ గుర్తించాలి.

వివాహమైన తరువాత దాంపత్య జీవితంలో స్త్రీపాత్ర ఎటువంటిది? అని ఆలోచించాలి. సృష్టిలోనే స్త్రీకంటే పురుషుడికి స్వాతంత్ర్యం ఎక్కువ వుంది. పురుషుడికి వున్నంత స్వేచ్ఛ స్త్రీకి లేదు. స్త్రీ పురుషుల ప్రత్యేక విధులు ఎవరివి వారికి నియమింపబడ్డాయి. కాని స్త్రీలు ఆ నగ్న సత్యాన్ని విస్మరించడం పరిపాటయింది. వివాహమయ్యాక తను స్వాతంత్ర్యం కోల్పోయిందని ఎందుకనుకోవాలి? సంఘంలో ఇల్లాలిగా ఒక ఉత్కృష్టమైన స్థానం తనకు లభించినందుకు స్త్రీ ఎందుకు గర్వించకూడదు? భార్యాభర్తలు

## తృతీయ బహుమతి రూ. 50 పొందిన వ్యాసం

దాంపత్య శకటానికి రెండు చక్రాలవంటివారు. ఏ చక్రం గొప్పదంటే ఎవరు చెప్పగలరు? అందులో ఏ చక్రం లేకపోయినా బండి నడవటానికి అవకాశం లేదు. చదువుకున్న అమ్మాయిలు యీ విషయం మరచిపోకూడదు. సంసారాన్ని కళాత్మకంగా రూపొందించుకోవటానికి తమ విజ్ఞానాన్ని ఉపయోగిస్తే ఎంతో బాగుంటుంది.

జీవితపు పూర్వ రంగంలో అంటే వివాహానికి పూర్వం స్త్రీలకు అలవాట్లు, ప్రత్యేకాభిరుచులు, అభిప్రాయాలు వుండవచ్చును. కానీ వివాహమైన తర్వాత కొంచెం హెచ్చు తగ్గులుగా సర్దుకుంటూ జీవిత గమనాన్ని

సాఫీగా సాగించుకోవాలిగానీ, మొండి పట్టుదలకు మూర్ఖపు ఆవేశాలకు పండంటి నూరేళ్ళ జీవితాన్ని బలిచేయకూడదు. స్త్రీలు పెద్ద చదువులు చదివి వుండవచ్చు. ప్రత్యేకాభిరుచులు కలిగి వుండవచ్చును. కాని ఎల్లప్పుడూ వాటినే పట్టుకు వ్రేలాడటం అర్థంలేని పని. స్త్రీ ఎలా తన భావి జీవితాన్ని గురించి కలలు కంటుందో అలాగే పురుషుడు కూడా తనకు కాబోయే భార్య ఇలా వుండాలనీ, ఆమెతో సంతోషంగా జీవితానుభవాలను పంచుకుందామనీ ఆశించడంలో తప్పులేదు. స్త్రీ కూడా తన భర్త అభిప్రాయాలకు అనుగుణంగా వీలైనంతవరకు సరిదిద్దుకు పోదామని ప్రయత్నించాలే గాని తెగేదాకా తాడు లాగితే ఆ తర్వాత బాధపడేది తామేనన్న విషయం మర్చిపోకూడదు.

"నేను పెళ్ళి చేసుకోను. పెళ్ళి స్త్రీ జీవితాన్నే బానిసగా చేస్తుంది. పురుషుడు భార్యను కేవలం బానిసగా చేస్తాడు. ఆ బానిసత్వం నేను సహించను," అని తరగతి సభలో ఆవేశంగా లెక్చరిచ్చింది నా క్లాసుమేటు సరళ. అదన్నట్లు వైవాహిక జీవితం బానిసత్వం కాదు. బాధ్యతాయుతమైనది. భార్యాభర్తలలో ఏ ఒకరిదీ అధికారం కాదు. మరొకరిది బానిసత్వం కాదు. సంసార విషయాల్లోనూ, పిల్లల పెంపకంలోను ఇతరత్రా స్త్రీలకు కావలసినంత స్వాతంత్ర్యం వుంది. భార్యగా స్త్రీ ఎన్నటికీ బానిస కాదు.

మగవాళ్ళతోపాటు స్త్రీలకు కూడా సమాన స్వాతంత్ర్యం, హక్కులూ వుండాలనే మాట నిజమే. కాని ఇది ఇలా దాంపత్యంలో కొనసాగదు. భర్త కిష్టమైనవి, భార్య కిష్టంలేనివి కొన్ని కొన్ని పనులు చేయవలసి రావచ్చును. అట్టి సమయాల్లో భార్య తన ఆశయాలకు, అభిరుచులకు స్వస్తి చెప్పగల 'త్యాగం' ఆమెలో వుంటేనే తప్ప ఆ సంసారం సాఫీగా సాగదు. అభిరుచుల్లో తేడా వున్నప్పుడు భర్త కనుగుణంగా సర్దుకుపోయే ఓర్పు నేర్పు గృహిణికుండటం చాలా అవసరం. ఇది అనుభవంలో తెలిసే విషయం. ఇలాంటి విషయాలను అతిగా ఆలోచించి స్వాతంత్ర్యం కోల్పోయామనుకొని పంతాలు పట్టుకుని కూర్చుంటే కష్టనష్టాలు స్త్రీలకే కలుగుతాయి. అపార్థాలు, పట్టుదలలు మంచిని చెడుగా చిత్రించడంతోపాటు మనిషి నుండి మనిషిని వేరు చేస్తాయి. అటువంటి మనస్పర్ధలు, తారతమ్యాలు రేకెత్తకుండా వుండటానికి భారత స్త్రీ తనంతట తానే పురుషునికి ఆధిక్యతనిస్తూ తన స్వేచ్ఛను కొంత వరకూ త్యాగం చేస్తూ వచ్చింది. భారతీయ సమాజంలో పురుషుడికి స్త్రీ లొంగి వుండే ఆచారం యీ విధంగానే ప్రబలింది.

ఈనాడు మన మీద పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఎక్కువగా వుంది. పాశ్చాత్య దేశాల స్త్రీలను చూచి లేనిపోనివి ఊహించుకుంటారు మనదేశపు ఇల్లాళ్ళు. హద్దులు దాటిన పాశ్చాత్య స్త్రీల సంస్కృతి మనకు సరిపడదు. అతి పవిత్రంగా అత్యున్నత గౌరవంతో పరిధులు దాటని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనుభవిస్తున్న హైందవ స్త్రీ పాశ్చాత్యుల వల్లమాలిన విధానాలు దిగుమతి చేసుకోనక్కరలేదు. స్త్రీలను బానిసలుగా బంధించి ఆనందించిన పాశ్చాత్యుల కంటే పాణిగ్రహణం చేసి పదిమందిలో వేదప్రమాణాలతో జీవితాంతం కట్టుబడి వుండే భారతీయులే స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలిచ్చి మననిచ్చారు. భార్యను భాగస్వామిగా స్వీకరించటం, కష్ట సుఖాలు సగపాలుకాగా కాడిపట్టి ఏడడుగులు నడవడం బానిసగా చేయటానికి కాదు. ఒక స్త్రీని అన్నపానాదుల వద్ద తల్లిగా, సలహా సంప్రదింపులలో మంత్రిగా, ప్రణయమూర్తిగా ఆరాధించిన చేతులు కర్కశంగా అణచలేవు. అయితే స్త్రీని బానిసగా చూసి వారి మనోవేదనకు సానుభూతి చూపలేని పురుషులు లేరనటానికి వీల్లేదు. అలాంటివారు సాంఘిక జీవితానికే చీడపురుగులు. ఆలుమగలలో విభిన్న మనస్తత్వాల వలన కలిగే భేదాభిప్రాయాలను ఆసరాగా తీసుకుని పాశ్చాత్య స్వేచ్ఛను ఆశించడం పొరపాటు. డిగ్రీలు పొందినంత మాత్రాన విద్యాధికులైనట్లు భావించి వైవాహిక బంధంతో స్వాతంత్ర్యం కోల్పోయామని భావించటం సబబు కాదు. భారత స్త్రీ తరతరాలుగా తనకు లభించిన ఉత్కృష్ట స్థానాన్ని అవివేకంతో, తెలియని ఆవేశంతో పోగొట్టుకోవాలని ప్రయత్నించడం అజ్ఞానానికి నిదర్శనం.

—జి. వసుంధర
ఎనిమిదవ తరగతి, బి సెక్షన్; ప్రెజంటేషన్ కాన్వెంట్,
సెయింట్ కొలంబన్స్ హయ్యర్ సెకండరీ స్కూలు,
మెక్లీన్ స్ట్రీట్, జార్జి టవున్, మద్రాసు–600 001

అమెరికాలో న్యూ జెర్సీ అనే రాష్ట్రం వుంది. ఆ రాష్ట్రంలో క్రాన్‌ఫర్డ్ అనే వూరు వుంది. ఆ ఊళ్ళో ఇద్దరమ్మాయిలు వున్నారు. ఆ ఇద్దరికీ కూడా పెళ్ళయింది కానీ ఎందుకో విడాకులు పుచ్చుకున్నారు. విడాకులు పుచ్చుకోవడంతో వారికి విడి ఆకులు మాత్రమే దక్కాయి. మరి వట్టి ఆకులు తింటే కడుపు నిండదు కదా అందుకనో పథకం పన్నారు.

ఆ పథకం ప్రకారం అన్నీ వుండి భార్య లేని మగవారికి వారు భార్యలుగా నటిస్తారన్న మాట. అందుకు ఫీజు గంటకి ఇరవై డాలర్లు అంటే దాదాపు నూటఎనభై రూపాయ (లే!)లు. అలా ఒప్పుకున్న మగవారికి ఇల్లు శుభ్రం చేసి



పెడతారు. బజారు నుంచి పచారీ సామాను తెచ్చి పెడతారు. తోట పని వుంటే చేస్తారు. ఇద్దరికి మించకుండా అతిథులకి డిన్నర్ ఏర్పాట్లు చేస్తారు. అంతే. అంతకు మించి ఏ పనీ చెయ్యరట. ఇదెలా తెలిసిందంటే.... ఒకాయన 'వీపు రుద్దుతారా?' అని అడిగాడట. కొత్త చనువు తీసుకోబోయి. వెంటనే 'ఖబడ్దార్' అన్నదట వారిలో ఒకామె.

'వీటి కోసం యింత ఫీజా' అని అడిగితే 'ఇంతవరకూ మా జీవితమంతా మొగుళ్ళకి వుచితంగా వెట్టిచాకిరీ చేశాము. వాళ్ళ అరుపులు భరించాము. దానికేమంటారు?' అని ఎదురు ప్రశ్న వేశారట.

# ప్రాచీన అలంకరణ



ఇక్కడ కనిపిస్తున్న చిత్రం - అజంతాగుహలోది. ఈ చిత్రంలోని అప్సరస్త్రీ ఒక దేవదాసి. క్రీస్తు శకం 5వ శతాబ్దిలోని నాగరికత ఎటువంటిదో ఈ చిత్రం చెబుతుంది. అప్పటి స్త్రీలు అలంకరణ విషయంలో ఎలాంటి శ్రద్ధ చూపేవారో, ఎలా అలంకరించుకునేవారో తెలియజేస్తున్నది. చిత్రంలో అప్సరస ధరించిన ఆభరణాలనే విడిగా పెద్ద బొమ్మలుగా చూడవచ్చును. చేతులకు కంకణాలు, కంఠాహారాలు, కర్ణాభరణాలు, తలపై కొప్పు కొప్పు చుట్టూ పట్టీ మొదలైనవి అప్పట్లో - యిలా వుండేవి.

—చిత్రం: శ్రీమతి ఉదయగిరి

# బామ్మగారి పేజీ



'సప్తపది' ఐందాక—

ఇహ—

ఆ తర్వాతేం జేస్తారనుకున్నారు? - దంపతులు అగ్నికి ప్రదక్షిణం చేస్తారు. చేశాక హోమం చేస్తారు. దీన్నే ప్రధాన హోమం అంటారు. ఈ హోమంలో ఇంద్రుని ప్రార్థిస్తారు. ఏమని? "ఇంద్రుడా! ఈ వధువు పితృగృహాన్ని విడిచిపెట్టి, పతిగృహానికి వచ్చి చేరేలా అనుగ్రహించు. పతి కులాన్నుంచి విడిపోయేలా చెయ్యకు. పతికులంతో అనుబంధం కలిగేలా చెయ్యి. ఎప్పుడూ సుబద్ధురాలుగా వుండేటట్టు చెయ్యి" అని. అలాగే అగ్నినీ, గంధర్వుడు మొదలైనవారినీ ప్రార్థిస్తారు.

ఆ తర్వాత 'లాజహోమం' అని చేస్తారు. అంటే, పేలాలతో హోమం చెయ్యడం. దానికి ముందు, కుడికాలుతో సన్నికల్లు తొక్కిస్తారు. ఆ రాతిలాగే స్థిరమైన దానివి కావాలనీ, విరోధులను ఇలాగే అణగద్రొక్కమనీ – అప్పుడు చెప్పే మంత్రార్థం.

అలా హోమం అంతా పూర్తయిన తర్వాత, వరుడు కన్యకి కట్టిన యోక్త్రం విప్పుతాడు. "నీకు నా యింట సుఖస్థానాన్ని కల్పిస్తాను" అంటాడు. తర్వాత, తన యింటికి తీసుకెళ్లినప్పుడు 'ప్రవేశ హోమం' అని చేస్తాడు. కొంతమంది ఈ హోమం కూడా కన్యాదాత ఇంట్లోనే చేసేస్తారు.

తన ఇంటికి వెళ్తున్నప్పుడు - బండి మీద తీసుకెళ్తాడు. తీసుకెళ్ళే ముందు బండిని చూపి— "ఓ రథమా! ఏ విధంగా ఈ భూమి త్రికరణ శుద్ధమైన సత్యంచేత నిలబడి వున్నదో, ఏ విధంగా సూర్యునిచేత ఆకాశం నిలబెట్టబడినదో, చంద్రుడెలా వున్నాడో - అలాగే మాచేత నిలబెట్టబడిన నువ్వు కూడా అలాగే నిలిచి వుండు!" అని మంత్రాలు చదివి, ఎద్దుల్నిగాని, గుర్రాలనుగాని బండికి కట్టి, వధువును బండిలోకి ఆహ్వానిస్తాడు.

"ఉదుత్తర మారోహంతీ..." అన్న మంత్రంలో "ఈ బండి ఎక్కి, విరోధులను తరిమివేసి, నా జీవితంలో ప్రధానురాలివి కమ్ము. అత్తమామల మీదా, ఆడబిడ్డల మీదా 'సంరాజ్ఞి'వి కమ్ము. కోడళ్ళ పైనా, అత్తమామలపైనా నా సోదరుల పైనా, కలగబోయే మన సంతతి పైనా, నా ధనం మీదా ఆధిపత్యం వహించు." అంటాడు.

అన్నప్పుడు —ఆమె అంటుంది - "గృహాన్ భద్రాన్త్ సుమనసః ప్రపద్యే..." అన్న మంత్రానికి "నేను భర్త ఇంట అడుగు పెడుతున్నాను. ఈ ఇల్లు మనోహరమైనది. కోడల్ని చూసి సంతోషించే మంచి మనసుగల అత్తమామలు ఈ ఇంట వున్నారు. ఈ ఇల్లు అన్నసమృద్ధి గలది. నేను మంచి మనస్సుతో ఈ ఇంట ప్రవేశిస్తాను" అని అర్థం. తర్వాత మళ్లీ హోమం చేస్తారు.

తర్వాత 'స్థాలీపాకం'. అంటే 'స్థాలి'లో వండడం. ఆ అన్నాన్ని అగ్ని మొదలైన దేవతలకి నివేదించి, తర్వాత దంపతులు భోజనం చేస్తారు.

వివాహంలో —

ధ్రువదర్శనం, అరుంధతీదర్శనం కూడా ముఖ్యమైనవిగా పరిగణిస్తారు. "ఓ ధ్రువుడా! నువు స్థిరనివాసంగలవాడివి. ధ్రువమైన ఉత్పత్తిగలవాడివి. తక్కిన నక్షత్రాలకు కాడివంటివాడివి. కాడి ఎడ్లను తొలగిపోకుండా చేసేటట్టుగా, నక్షత్రాలు కదలకుండా వుండడానికి మధ్యలో నువ్వు వున్నావు. అలాంటి నువ్వు మమ్మల్ని కూడా కాపాడు." అని ధ్రువదర్శనం చేసుకుంటారు.

సప్త మహర్షులైన కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు మొదలైన వారికి కృత్తికలన్న పేరుతో భార్యలున్నారు. అరుంధతి ఏడవ ఆమె. పతివ్రతగా అరుంధతికి విశేష ప్రాముఖ్యం ఇచ్చారు పెద్దలు. అందువల్ల అరుంధతీ దర్శనం చేసుకుంటారు. తర్వాత 'సదస్యం' జరుగుతుంది. 'సదస్యం' అంటే సభలో జరిపేది అని అర్థం. వివాహానంతరం సభ చేసి గణపతి పూజ, అష్టదిక్పాలక పూజ, సరస్వతీ పూజ చేస్తారు. తర్వాత సదస్యులందరికీ సంభావనలు ఇస్తారు.

తర్వాత గంధర్వోత్థాపనము, శేషహోమము అని చేస్తారు. గంధర్వోత్థాపనంలో గంధర్వుడిని తలచుకుని ఉద్వాసన చెబుతారు. శేషహోమంలో

## వనిత మాటల కొలుపు – 48

సరైన సమాధానం:

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 క | మ | 14 అ | ■ | 2 పం | చ | 15 ద | 16 శి |
| థ | ■ | 3 వ | గ | పు | ■ | 4 డ | వ |
| 5 లు | 17 క | న | ■ | ■ | 18 మ | ■ | రా |
| ■ | లం | ■ | 19 చే | ■ | 6 సా | 20 వి | త్రి |
| 7 వ | కా | ■ | 8 ప | 21 ఆ | లా | న | ■ |
| 9 శా | రి | 22 క | ■ | ణి | ■ | 10 తి | 23 ఈ |
| త్ర | ■ | ద | ■ | 11 పూ | 24 ట | ■ | ద |
| 12 ము | ర | ళి | ■ | 13 స | మా | క | ర |

ఈ సమాధానంతో సరిపోయే సమాధానం పంపిన వారు: ఇరవైమూడు మంది. వారు:

1. పద్మామోహన్, గూటి 2. పి. సరస్వతి, హనుమకొండ 3. ఎస్. శ్రీవిద్య, శ్రీకాకుళం 4. డి. కళావతి, దుర్గాపూర్ 5. బి. లక్ష్మీరావ్, దుర్గాపూర్ 6. జె. వి. రత్నం, హైద్రాబాద్ 7. బి. నంద్య, సికింద్రాబాద్ 8. ఎన్. స్వరాజ్యలక్ష్మి, హైద్రాబాద్ 9. కె. రాజేశ్వరి, హైద్రాబాద్ 10. ఎ. అనూరాధ, మద్రాసు 11. డాక్టర్ సి. భువనేశ్వరి, శ్రీకాళహస్తి 12. పి. నారాయణమ్మ, విశాఖపట్నం 13. ఎన్. హిమబిందు, హైద్రాబాద్ 14. కె. గీతాకుమారి, నెల్లూరు 15. టి. అన్నపూర్ణ, పెనుగొండ 16. ఎన్. కామేశ్వరీమూర్తి, దుర్గాపూర్ 17. పి. ఉషారాణి, కాకినాడ 18. జె. హేమలత, విశాఖపట్నం 19. ఎ. సాయిమాధవి, తణుకు 20. ఎల్. ఆర్. రుక్మిణి, వి. కోట 21. పి. అనూరాధ, మార్కాపురం 22. ఎల్. సూర్యకుమారి, తణుకు 23. కె.జి. విజయారెడ్డి, తాంద్రపాడు. బహుమతి మొత్తం రూ. 150 లను వారికి అందజేస్తున్నాము.

దేవతలను ప్రార్థించడం జరుగుతుంది. సాముద్రిక దోషాలు, దుష్టలక్షణాలూ ఏవైనా వుంటే, అవి ఈ కన్యకి రాకుండా కాపాడమని దేవతలను ప్రార్థిస్తారు.

తర్వాత "నాగవిల్లి" అనేది జరుగుతుంది. 'నాగవిల్లి' అని మనం అనేస్తాం గాని, దీని పేరు 'నాకబలి'. అంటే, దేవతలకి బలులు ఇస్తూ చేసే పూజలని అర్థం. అనేక దేవతానామాలతో మంత్ర పఠనం జరుగుతుంది.

యుద్ధాల్లో జయించి వచ్చినప్పుడు, దుర్గాదేవికి 'బలి' ఇవ్వడం అనేది పూర్వాచారం. అలాగే, పితృగృహం నుంచి, పతి గృహానికి వస్తున్న భార్యకి దృష్టిదోషాలూ అవీ కలగకుండా వుండాలన్న ఉద్దేశంతో ఈ 'బలి' అన్న కార్యక్రమం ఏర్పాటు చేసి వుంటారు. మరి, ఈ ఏర్పాటు తర్వాత తర్వాత ఇంకోలా మారిపోయి వుండొచ్చు.

బియ్యపు పిండి, పసుపు, కుంకం - మొదలైన రంగులతో పలకలు పలకలుగా ముగ్గులు వేస్తారు. దాని చుట్టూ ముప్పైరెండు చిన్న పిడతలు, నాలుగు కుండలూ పెడతారు. కుండలకు పైన నాలుగు దిక్కులూ తిరిగొచ్చినట్టుగా, దారాలు కడతారు. చిన్న పిడతల్లోని మూడింటిలో ఉప్పు, పప్పు, బియ్యం వేస్తారు. నాలుగు దిక్కుల్లోనూ నాలుగు దీపాలు పెడతారు. ముప్పైమూడు దీపాలు వెలుగుతున్న పళ్లాన్ని ముత్తైదువులు తెస్తారు. ముప్పైమూడు దీపాలూ, ముప్పైమూడు కోట్ల దేవతలకూ ప్రతినిధులు అన్న ఉద్దేశంతో కావచ్చు. కొత్త దంపతులు ఈ దీపాలకు ప్రదక్షిణాలు చేస్తారు. తర్వాత నాలుగు దిక్కుల్లోనూ అర్ఘ్యాలు ఇస్తారు. "అగ్నిర్దేవతా వాతో దేవతా సూర్యో దేవతా చంద్రమా దేవతా" అని సర్వ దేవతల పేర్లూ వచ్చే మంత్రాలు చదువుతారు. ఈ సందర్భంలో వధువుకి పట్టు చీరె పెడతారు. (మరి, మనలో మాటర్రా — ఈ 'పట్టు చీరె' ప్రసక్తి వుండడం చేతనేనేమో, నాగివిల్లికింత ప్రాముఖ్యత వచ్చింది!)

అటు తర్వాత కొన్ని వేడుకలు జరుగుతాయి. నీళ్ళ బిందెల్లో నగలు వేసి వధూవరులను తియ్యమంటారు. ఇదొక శుభ పరీక్షలాంటిది.

గౌరీ పూజతో పాటు 'కుత్తుకంటు' పూజ కూడా జరుగుతుంది. కుత్తుకంటు అంటే ఏమిటి - కుత్తుకని అంటుకుని వుండే నగ. దీన్నే 'నీల లోహితం' అంటారు. ఈ నగలో ఎరుపు, నలుపు పూసలుంటాయి. "నీలలోహితే భవతః కృత్యాసక్తిర్వ్యజ్యతే...." అన్న మంత్రంతో కుత్తుకంటు కట్టి, "నీలలోహిత ధారణ ముహూర్తస్సుమూహూర్తోస్తు" అంటారు. కుత్తుకంటు భర్త జీవించి వున్నంతవరకూ విడవ రాదన్నారు.

అటు తర్వాత చేతులకు కట్టుకున్న రక్షా బంధనాలు విప్పేస్తారు. దంపతులందరికీ తాంబూలాలు ఇస్తారు. ఈ తంతంగాన్నే 'మిథున విడియములు' అనీ 'దంపత్తాంబూలాలు' అనీ అంటారు.

తర్వాత 'అప్పగింతలు' కార్యక్రమం. "అష్టవర్షా భవత్కన్యా పుత్రివత్పాలితామయా, ఇదానీం తవదాస్యామి దత్తా స్నేహేన పాల్యతామ్" అని వధువు తండ్రి — వరుడికీ వరుడి తలిదండ్రులకీ అమ్మాయిని వప్పజెపుతాడు. 'అష్ట వర్షములు ఈ కన్యకను నేను పుత్రువిలా పెంచాను. ఈమెను నీకు వప్పగిస్తున్నాను. స్నేహంతో పాలించు' అని శ్లోకానికి అర్థం. ఈ సమయంలో ఎంతటి ధైర్యం వున్న వధువు తలిదండ్రులకైనా కళ్ళ వెంబడి నీళ్ళు రాకమానవు! అప్పట్లో ఎనిమిదేళ్ళకే పెళ్ళిళ్ళు చేసేవారు. ఇప్పుడు 'రెండు అష్ట వర్షాలు' (పదహారేళ్ళు) ఆ పైబడీ కూడా వివాహాలు జరుగుతున్నాయి. ఎనిమిదేళ్ళు పెంచిన వాళ్ళకే అంత బాధ కలిగితే, ఇన్నేళ్ళు పెంచిన వాళ్ళకి ఇంకా ఎంత బాధ వుంటుందో!

చూశారా! పెళ్లిలో ఏవో మంత్రాలు చదువుతారు; బాజాలు వాయిస్తారు; అంతా వస్తారు; సరదాగా వుంటుంది - అనుకుంటామేగాని, ఆ మంత్రాల వెనక ఎలాటి అర్థాలుంటాయో - విన్నారు గదర్రా. ఇన్ని మాటలతో అన్ని ప్రమాణాలతో వివాహాలు జరుగుతాయన్న మాట. వివాహంలో అంతటి పవిత్రత, నిష్ఠా వున్నాయన్నమాట. కాదర్రా మరి ◘



అది పశ్చిమ జావాలోని ఓ గ్రామం. ఆ గ్రామంలో తమ పొలంలో ఓ ఇరవై మూడేళ్ళ యువతి పన్జేసుకుంటోంది. చుట్టు పక్కల ఎవరూ లేరు. పక్కనే వున్న అడవిలో ఆమె భర్త కట్టెలు కొడుతున్నాడు. పొలంలో పన్జేసి చేసి అలసిపోయి అక్కడే నీడపట్టున విశ్రమించింది ఆ అమ్మాయి. హాయిగా నిద్ర పట్టేసింది. ఇంతలో లావుగా గొరిల్లా లాంటి కోతి ఒకటి అటుగా వచ్చి ఆ అమ్మాయి మీద పడిందట. కొద్ది క్షణాల తరువాత మెలకువ వచ్చి చూసేసరికి ఆ కోతి తనని మానభంగం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నట్లు గ్రహించిందా యువతి. ఆమెకి ఆశ్చర్యం, భయం రెండూ కలిగాయి. అడవిలోకి తప్పించుకుని పారిపోబోయిందిట. కాని ఆ కోతి లాంటి మృగం లాంటి కోతి విడిచిపెడితేగా. దాని భల్లూకపు.... పొరపాటు .... కోతి పట్టునుంచి తప్పించుకోలేక లొంగిపోయిందా యువతి. ఆ తరువాత ఆమె అరుపులకి భర్తగారు అడవిలోనుంచి వచ్చాడు. కోతి పారిపోయింది. కాని అతను పోలీసులకి రిపోర్టివ్వడానికి ఒప్పుకోలేదు 'ఎందుకని?' అని మనీలా నుంచి వచ్చే ఓ పత్రిక అడిగితే—

"ఆఫ్టాల్!...కోతే కదా...మనిషైతే నరికి పారేసుందును" అన్నాడతను.

"మసాలా దినుసులు శరీరానికి హాని కలిగిస్తాయా?"

—వచ్చే సంచికలో వ్యాసం చదవండి!



మన దేవాలయాలు:

# అష్టలక్ష్మి

ఈ (శ్రావణ) మాసంలో (ఆగస్ట్ 3) వచ్చే 'వరలక్ష్మీ వ్రతం' సందర్భంగా — మద్రాసులో నూతనంగా నిర్మింపబడి, భక్తకోటిని ఆకర్షిస్తున్న అరుదైన 'అష్టలక్ష్మి' ఆలయం గురించిన విశేషాలను పొందుపరుస్తున్నాము:



ప్రతి ప్రాణీ, ప్రతి క్షణమూ ఏదో ఒక దానికి ఆరాటపడుతూ వుంటుంది. మనిషి మనిషికీ రక రకాల అవసరాలు, ఆశయాలు వుంటాయి. కొందరికి డబ్బంటే ప్రాణం. కొందరికి పదవులంటే పంచప్రాణాలు. చదువు సంధ్యలు కొందరికి ఆనంద ప్రదమైతే సర్వబాధల నుంచి విడివడాలన్నది మరి కొందరి తీరని కోరిక. ఆశల, ఆశయాల సిద్ధికోసం అనుక్షణం జరిగే పోరాటమే మానవ జీవితం.

జీవిత లక్ష్యాల కేంద్ర బిందువు లక్ష్మి. రక రకాల ఆశలతో ఆశయాలతో మనుషులు ఆమెను అన్వేషిస్తారు; ఆశ్రయిస్తారు. అందుకే లక్ష్మిని 'సహస్రదళ పద్మనివాసిని' అన్నారు మన పెద్దలు. మనిషి ఆశించదగిన సంపదలు అష్ట ఐశ్వర్యాలనీ, వాటికి అష్ట లక్ష్ములు అధి దేవతలనీ చెప్పడం వైష్ణవ సాంప్రదాయం. ఈ 'అష్ట లక్ష్ములూ' ఒకే చోట వెలుగొందే ఏకైక ఆధునిక మందిరం మద్రాసులోని అష్టలక్ష్మి సమేత శ్రీ మహాలక్ష్మి ఆలయం!

భారతదేశ స్వాతంత్ర్య సిద్ధికి, స్త్రీ జనోద్ధరణకు కృషి చేసి, 'దివ్యజ్ఞాన సమాజ' వికాసానికి పాటు పడిన ఆంగ్ల వనిత అనీబిసెంట్. ఆమె పేరిట వెలిసిన బెసెంట్ నగర్ సమీపంలో ప్రశాంత సముద్ర తీరంలో వుంది మహాలక్ష్మి ఆలయం. 1974 సం॥ ప్రారంభించబడిన ఈ ఆలయ నిర్మాణం 1976 సం॥ ఏప్రిల్ ఐదో తారీఖున మహా సంప్రోక్షణం జరిగి భక్తుల దర్శనానికి తెరువబడింది.

గోధుమ రంగుతో అరవై మూడు అడుగుల ఎత్తుతో తూర్పు ముఖంగా వున్న ఆలయ గోపురం చుట్టూ - క్షీరసాగర మథనం, లక్ష్మీ ఉద్భవం, లక్ష్మీ కల్యాణం, విష్ణు దశావతార లీలలు, శిష్య పరివారంతో త్రిమతాచార్యులు - మొదలైన దృశ్యాలు సుందర శిల్పాలుగా అమర్చబడి వున్నాయి.

ఆలయంలో ప్రవేశించి ప్రదక్షిణం వచ్చేప్పుడు దక్షిణ దిశలో 'ఆదిలక్ష్మి' ఆలయం వుంది. మానసికమైన, శారీరకమైన బాధలతోపాటు మని



షికి అంతుబట్టని కొన్ని కారణాలవల్ల ఇబ్బందులు కల్గుతూ వుంటాయి. వీటినే ఆధ్యాత్మికం, ఆది భౌతికం, ఆదివైవికం - అన్న 'తాపత్రయం'గా పేర్కొంటారు. తాపత్రయం నుంచి రక్షించడానికే 'ఆదిలక్ష్మిని' వేడుకుంటారు.

ఇహపర సౌఖ్యాలు సాధించాలంటే మనిషి బ్రతకాలి. బ్రతకాలంటే ఆహారం అవసరం. ఆహారాలకు మూలం ధాన్యం. కండలు పిండి, కటిక నేలను సస్యశ్యామలంగా మార్చి రైతన్న పండించే పసిడి పంటలు ప్రసాదించేది 'ధాన్య లక్ష్మి.' గుడికి వెనుకవైపు పశ్చిమాభి ముఖంగా వుంది 'ధాన్యలక్ష్మి' మందిరం.

కండ బలంతో పాటు మనిషి మనుగడకు కావలసింది గుండె బలం. మానవాభ్యుదయానికి మాణిక్య సోపానాలు ధైర్యసాహసాలు. ధైర్య సాహసాలు ప్రసాదించే 'ధైర్యలక్ష్మి' ఆలయం ఉత్తరాభి ముఖంగా వుంది.

ఆలయ గర్భగృహంలో - శంఖుచక్ర గదా ధారియైన మహావిష్ణువు సమేతంగా శ్రీ మహాలక్ష్మి-తరంగ హస్తాలతో నమస్కరిస్తూ ఓం.... ఓం.... అని నిరంతరం ప్రణవ నినాదం చేసే సాగర ముఖంగా తూర్పు వేపున దర్శనమిస్తోంది. సముద్రమే

ఈ 'ఓంకారక్షేత్ర' పుష్కరిణీ తీర్థం!

గర్భగృహం ముందునుంచి దక్షిణ దిశగా పై భాగానికి మెట్లున్నాయి. పైకి వెళ్ళినట్లయితే ఇరువైపులా తొండమెత్తి, కలశాలతో సేవిస్తున్న రెండు ఏనుగు శిరస్సుల మధ్య తూర్పు ముఖంగా 'గజలక్ష్మి' ఆలయం దర్శనమిస్తుంది. అక్కడి నుంచి ప్రదక్షిణంగా వెళ్ళేప్పుడు విష్ణు దశావతార శిల్పాలు కనులవిందు చేస్తాయి. ఆ తర్వాత దక్షిణ ముఖంగా 'సంతానలక్ష్మి' సన్నిధి వస్తుంది. పడమర పశ్చిమాభిముఖంగా 'విజయలక్ష్మి' మందిరం వుంది. ఇదే అంతస్తులో ఉత్తరాభిముఖంగా 'విద్యాలక్ష్మి' ఆలయం వుంది. అక్కడి నుంచి చూస్తే - సహస్ర దళ పద్మంలో ప్రసన్న వదనంతో పద్మమాలాంకృతయై ప్రకాశించే పద్మాక్షిని హరిహర బ్రహ్మాదులు సేవించే రమణీయ శిల్ప దృశ్యం నయనానందం కల్గిస్తుంది.

ప్రాకార ప్రదక్షణతో మళ్ళీ గజలక్ష్మి ఆలయం చేరుకుంటాము. అక్కడి నుంచి రెండో అంతస్తుకు వెళ్ళేప్పుడు 'శ్రీస్తుతి' చేసిన నిగమాంత దేశికులకు లక్ష్మీదేవి ప్రసన్నమై "స్వర్ణవర్షం" కురిపించిన శిల్ప దృశ్యం మన దృష్టిని ఆకర్షిస్తుంది.

పై అంతస్తులో "ధనలక్ష్మి మందిరం" మాత్రం వుంది. ఆ ఆలయాన్ని ప్రదక్షిణం చేయడానికి అనువుగా ప్రాకారం నిర్మాణం జరిగింది. ఆ చిన్న గుడి చుట్టూ దక్షిణ దిశగా జ్ఞానమూర్తియైన దక్షిణామూర్తి; పశ్చిమాభి ముఖంగా శాంతాకారంతో భుజగశయనుడైన పద్మనాభుడు; ఉత్తరాభిముఖంగా పద్మభవుడైన బ్రహ్మ విగ్రహాలు వున్నాయి. ఈ ప్రదక్షిణతో "అష్టాంగ విమానాన్ని" మూడు సార్లు ప్రదక్షిణ చేసినట్లవుతుంది.

'మానవ జీవితాలను శాసించి నడిపేది ధనం. దీనికి మించినది మరొకటి లేదు' అని సూచించడానికే ధనలక్ష్మిని ఈ అష్టాంగ విమాన మందిరాగ్రంలో ప్రతిష్ఠించారా అనిపిస్తుంది. అంతేకాదు. దాదాపు అరవై అడుగుల ఎత్తునుంచి కనుచూపు మేరకు కనబడే వినీల గంభీర సాగరాన్ని చూసినపుడు మానవాతీతమైన దివ్యశక్తి ఏదో వుందన్న పరమసత్యం మనసున్న ప్రతి మనిషికీ స్ఫురించక మానదు.



మూల విరాట్టులయిన లక్ష్మీనారాయణులను భూమట్టంలో ప్రతిష్ఠించి భక్తులను గోపురాగ్రం మీదికి అనుమతించడం భావ్యమా? అన్న సందేహం కొందరికి కల్గవచ్చు. అసదైన ఇలాంటి ఆలయ నిర్మాణ పద్ధతిని 'అష్టాంగ విమానం' అంటారు. దీనికి ఎన్నో కారణాలు చెబుతారు.

జీవిత సమస్యలను పరిష్కరించుకుని కష్టనష్టాల నుంచి కడతేరడానికి తరుణోపాయం అన్వేషిస్తూ ఎందరో గురువులను ఆశ్రయించి శుశ్రూషలు చేశారు రామానుజాచార్యులు. కట్టకడపట ఆ పరమ రహస్యాన్ని ఉపదేశించిన ఆయన గురువు "దీనిని మరెవరికైనా తెలియజేశావంటే నరక యాతన అనుభవిస్తావు" అని హెచ్చరిక కూడా చేశాడట. తను ఒక్కడు నరకం అనుభవించినప్పటికీ ఈ రహస్యాన్ని ప్రపంచానికి చాటడంవల్ల మానవ లోకమే తరిస్తుంది కదా - అదే చాలు" అన్న మానవతా దృక్పథంతో గురువాజ్ఞను మీరి ఆలయ గోపురాగ్రం చేరి గొంతెత్తి - జాతిమత వ్యత్యాసం చూపకుండా అందరికీ తెలియజేశాడట. అదే అష్టాక్షరీ మంత్రం. ఇది జరిగింది దక్షిణ భారతావనిలోని తిరుకోష్టియూర్‌లో. ఆ గుడి కూడా 'అష్టాంగ విమాన' పద్ధతిలోనే నిర్మించబడింది. రామానుజాచార్యుల మానవతాభిమానం గుర్తు చేయడానికే ఈ గుడి కూడా అష్టాంగ విమాన పద్ధతిలో నిర్మించబడిందట.

పైనుంచి క్రిందికి నడిచినట్లయితే, బయలుదేరిన చోటికే - అంటే లక్ష్మీనారాయణుల గర్భగృహ ప్రాంగణానికే చేరుకుంటాము. ఈ మధ్యలో మన దృష్టిని ఆకర్షించే మరో శిల్ప దృశ్యం 'కనకధారా' కథనం!

వాకిట నిలబడిన బాల భిక్షువుకు ఇవ్వడానికి ఏమీలేని ఓ పేద ఇల్లాలు పెరటిలో కాచిన ఓ ఉసిరికాయను సాధువు భిక్షాపాత్రలో వేసిందట. లేమితో విలవిలలాడుతున్నప్పటికీ ఆ పేదరాలి హృదయంలో వాడని దయాస్వభావానికి సంతసించిన ఆ సాధువు "కనకధారాస్తోత్రం" పఠించగా బంగారు ఉసిరికాయలు వడగళ్ళవానలా వాకిట జలజలా రాలాయట. లక్ష్మీదేవిని స్తుతించి, పేదరాలి కన్నీళ్ళు తుడిచిన ఆ కరుణాసింధువు — అద్వైత మతస్థాపకులైన ఆదిశంకరులే! □

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

**కేర్‌ఫ్రీ** మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

**కేర్‌ఫ్రీ** ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, **కేర్‌ఫ్రీ** ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపు కోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క **కేర్‌ఫ్రీ** మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

**కేర్‌ఫ్రీ**తో మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

**కేర్‌ఫ్రీ** వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

**కేర్‌ఫ్రీ** ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.

Johnson & Johnson

* కేర్‌ఫ్రీ జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి

# సంస్కృత పాఠమాల [8]

సః కః
**सः कः**
అతడెవరు ?

సః బాలః
**सः बालः**
అతడు బాలుడు

తౌ కౌ
**तौ कौ**
వారు (ఇద్దరు) ఎవరు ?

తౌ బాలౌ
**तौ बालौ**
వారు (ఇద్దరు) బాలకులు

తె పాత్రె
**ते पात्र**
ఆ రెండు పాత్రలు

ఇమౌ బాలౌ
**इमौ बालौ**
ఈ ఇద్దరు బాలురు

తౌ దేవౌ
**तौ देवौ**
వారు (ఇద్దరు) దేవులు

తె లతే
**ते लते**
ఆ రెండు లతలు

ఇమె ఫలె
**इमे फले**
ఈ రెండు ఫలములు

ఇమె బాలె
**इमे बाले**
ఆ యిద్దరు బాలలు

వృక్షౌ ఫలతః
**वृक्षौ फलतः**
వృక్షములు కాయుచున్నవి

బాలౌ పఠతః
**बालौ पठतः**
బాలురు పఠించుచున్నారు

నేత్రే స్ఫురతః
**नेत्रे स्फुरतः**
నేత్రములు స్ఫురించుచున్నవి

ఫలే పతతః
**फले पततः**
ఫలములు పడుచున్నవి

అజౌ తిష్ఠతః
**अजौ तिष्तः**
గొఱ్ఱెలు నిలబడినవి

గజౌ గచ్ఛతః
**गजौ गच्छतः**
గజములు వెళ్లుచున్నవి

ముఖేలసతః
**मुखे लसतः**
ముఖము ప్రకాశించుచున్నది

మాలే మ్లాయతః
**माले म्लायतः**
మాలలు వాడుచున్నవి

బాలే గాయతః
**बाले गायतः**
బాలలు పాడుచున్నారు

పుష్పే వికసతః
**पुष्पे विकसतः**
పుష్పములు వికసించుచున్నవి

ఇమౌ
**इमौ** పుంలింగము
**इमे** స్త్రీలింగము
ఇమె
**इमे** నపుంసకలింగము
} ఈ రెండు

తౌ
**तौ** పుంలింగము
**ते** స్త్రీలింగము
తె
**ते** నపుంసకలింగము
} ఆ రెండు

కౌ
**कौ** పుంలింగము
**के** నపుంసకలింగము
కె
**के** స్త్రీలింగము
} ఎవరు

ఎస్. మణిరామయ్య, విశాఖపట్నం

డైసీపువ్వులు అల్లటం నేర్చుకొన్నాను. కాని, ఎలా కలపాలో తెలియటం లేదు. మీకు తెలిస్తే చెప్పగలరా?

డైసీపూల షాల్ చాలా బాగుంటుంది. దీనిని వూలుతో 13 వ నంబర్ క్రోషియా (ప్లాస్టిక్ సూది) సూదితో కలపాలి. రౌండ్‌పూలు కలిపే విధానం చెబుతాను. దీనిని బట్టి స్క్వేయర్‌పూలు కలుపుకోవచ్చు. ఫోటోలో క్రింది వరుసలో ఎడమవైపు పైన లూపు వుంది చూశారు. దానికి కుడివైపు మూడు జడలతో స్టార్ట్ చేయాలి. పూవు రేకుగుండా వూలు



వేసి 3 జడలు అల్లి తిరిగి ఒక రేకు (ఎడమవైపు) గుండా వేసి, 6 జడలు అల్లి అదేరేకు మంది వేస్తే ఒక లూపు ఏర్పడుతుంది. 3 మార్లు 3 జడల చొ॥న వేస్తూ 3 రేకులగుండా వేయాలి. (క్రిందికి) తర్వాత 6 జడలతో లూపు వేసి తిరిగి 3 రేకులకు 3 జడలతో కలిపి (అడ్డంగా) 6 జడల లూపు వేస్తే 3 లూపులు వస్తాయి. పైన ఎడమవైపు ఒకటి క్రింద రెండు లూపులు వస్తాయి. తర్వాత 3 జడలతోపై రేకు కలుపుకోవాలి. ఇంకొక 3 జడలతో ఇంకొక రేకు కలపాలి. ఇప్పుడు ఇంకొక పువ్వు దీనికి కలపాలి. వేరొక పువ్వులోని రేకుగుండా వూలు పోనిచ్చి కలిపి 3 జడలు వేసి వేరొక రేకుకు (క్రిందుగా) కలిపి దీనిని మొదటి పువ్వు రేకుకు కలపాలి. తర్వాత 3 జడలతో వేరొక రేకు కలుపుకొని దానికి లూపు వేయాలి. ఎలాగంటే 3 జడలు అల్లి మొదటి పువ్వులోని లూపుగుండా గుచ్చి తీసి, తిరిగి 3 జడలు వేస్తే లూపు వస్తుంది. ఇలాగ మనకు కావలసిన పొడవులో పువ్వులు కలుపుకొని (అడుగునవే) తర్వాత పైపైవు కలుపుకొంటే మొదలు పెట్టిన స్థలానికొస్తాం. పై వరుస పువ్వులు ఇలాగే కలుపుకొని ముగించాలి. అంటే 2 వరుసలు పువ్వులు కలుపుకొంటాము ఒకేసారి. తర్వాత వూలు తెంపి ఒక్కొక్క వరుస కలుపుకోవాలి పువ్వులు. ఇది ఒక పద్ధతి ఇంకొక రకంగా కూడా కలుపుకోవచ్చు ముందు 4 పువ్వుల చదరం కలుపుకొని, తర్వాత చుట్టూ ఇంకొక చదరం లాగా కలుపుకోవచ్చు. షాల్ కాకుండా స్వెటర్‌కు కూడా ఈ పూలను వాడవచ్చు. ఎలాగంటే చేతులు, స్వెటర్ చెస్ట్ వరకూ మామూలుగ అల్లుకొని, క్రింది భాగానికి ఇలా పూలు కలుపుకొని అతికితే చాలా బాగుంటుంది. ముఖ్యంగా చిన్న పిల్లలకయితే మరీ బాగుంటుంది. ఫోటో చూస్తూ చెయ్యండి మీకే అర్థమవుతుంది.

కె. శోభ, గుంటూరు

2 ఏళ్ళ బేబికి సరిపోయే వూల్‌క్యాప్, సాక్స్, స్వెటర్ అల్లాలని వుంది. మీరు తప్పక చెబుతారని ఆశిస్తున్నను.

వూల్ టోపి, సాక్స్ అల్లకం ఇదివరలో వ్రాసి పంపాము. స్వెటర్ నిదానంగా వివరంగా వ్రాసి పంపుతాము. మీకు నిట్, పర్ల్ మాత్రమే వచ్చునా్నరు. ఫరవాలేదు ముఖ్యమైన కుట్లు అవేకదా! వాటితోనే రకరకాలు అల్లవచ్చు. డెయిసీపూలతో మీ బాబుకు స్వెటర్ అల్లి చూడండి. చక్కగా వుంటుంది. చెస్ట్ క్రింది నుండి డైసీపూలు అతికిస్తే చాలా బాగుంటుంది.

కె. పి. శ్యామలమ్మ, హిందూపురం

కొత్త జాకెట్లు, ఫ్రాకులు కుట్టినప్పుడు కొన్ని చిన్న ముక్కలు, పెద్ద ముక్కలు మిగులుతాయి. నేను చాలా రోజుల నుండి ఇటువంటి ముక్కలు సేకరించి అట్టేపెట్టాను. వాటితో ఉపయోగకరమైనదేమైనా చేస్తే బాగుంటుందని వుంది. ఏం చేస్తే బాగుంటుందో చెబుతారా?

మిగిలిన చిన్న ముక్కలు నిజంగా సమస్యగా వుంటోంది. పారవేయటానికి మనసు రాదు. రకరకాల డిజైన్‌లో ముచ్చటగా వుంటాయిమరి.




కొన్ని రకాలు చెబుతాము. వీటినిబట్టి మీకు మరి కొన్ని ఊహించుకోండి. మొగ్గలతో బ్యాగ్ కుట్టడం చెబుతాము. ఫోటో చూడండి తెలుస్తుంది ప్రతీ మారు



ఒకేరకం బ్యాగ్ వాడాలంటే విసుగేస్తుంది. అందుకే నాలుగైదు రకాలుంటే తీసికెళ్ళటానికి ఉత్సాహంగా వుంటుంది. నేను కూడా ఈ ముక్కలన్నీ లోపల దాచి వుంచాను. మీరు అడిగిన తర్వాత ఆలోచించి ఈ బ్యాగ్ కుట్టాను. లైనింగ్, జిప్ వేశాను కాబట్టి నాజూగ్గా, అందంగా వుంది. మొగ్గలు ఎవరెవరి అభిరుచిబట్టి ఆ సైజులో వారు అల్లుకోవచ్చు. కొందరు చిన్నవి ఇష్టపడ్తారు. ముందు ముక్కలన్నింటిని రెండు అంగుళాల చదరంలో కత్తిరించుకొని వేటికవి విడిగా వుంచుకొని మొగ్గలు కుట్టాలి. ఈ ముక్కను నిలువుగ, అడ్డంగా మడచి, 1 వ బొమ్మలో లాగా చిన్న గీతలున్నచోట మడిస్తే 2 వ బొమ్మలో లాగా వస్తుంది. అందులోని చిన్న గీతల ప్రకారం మిషన్ మీద కుడితే మొగ్గ వస్తుంది. మిగత గుడ్డ ముక్కను కత్తిరించాలి.

ఇలా మొగ్గలన్ని తయారు చేసుకొని బ్యాగ్‌కు కావలసిన రెండు ముక్కలకు పీటిని వుంచి కుట్టాలి. పైనుండి క్రిందుగా కుట్టుకోవాలి మొగ్గలు. మొదటి వరుస దగ్గరి దగ్గరిగా మొగ్గలు పెట్టి మిషన్ మీద కుట్టుకోవాలి. ఆ తర్వాత క్రిందివరుస కుట్టుకోవాలి. పై వరుస కుట్టు కనిపించకుండ దాని మీద మొగ్గలు పెట్టాలన్నమాట. ఇలా బాగా దగ్గరి దగ్గరిగా పెట్టుకొంటూ వరుసలన్నీ కుట్టుకోవాలి. రెండు ముక్కలకూ కుట్టడం అయిన తర్వాత, మొగ్గలు వంగిపోకుండా వుండటానికి ప్రతి మొగ్గ పైన ఒక చిన్న కుట్టు వేయాలి.

అడుగు భాగానికిగాను $1\frac{1}{2}$ అంగుళాల వెడల్పు గుడ్డ పొడవున్న అట్టముక్క తీసుకోవాలి. అలాగే రెండు గుడ్డ ముక్కలు కొలతలకు సరిపడా అట్ట ముక్కలను తీసుకొని ఈ మూడింటినీ లైనింగ్‌తో కప్పి మొగ్గలు కుట్టిన గుడ్డ అతకాలి. అంటే బ్యాగ్ అడుగున $1\frac{1}{2}$ అంగుళాల అట్టముక్క వుంటుంది విడిగా. లోపలి వెడల్పుకు కూడ అట్ట వుంటుంది కాబట్టి బ్యాగ్ స్టిఫ్‌గ వుండి చక్కగా నిలుస్తుంది. జిప్ వేయాలి.







III

హాండిల్‌కు రెండు మొగ్గల వెడల్పు వుండి, కావలసిన పొడుగు పెట్టుకోవాలి. క్రింద కుట్లు కనిపించకుండా లైనింగ్ వేస్తే కుట్లు దారాలు కనిపించవు లోపల కూడ నీట్‌గా వుండి ఓపెన్ చేసినా చూట్టానికి బాగా వుంటుంది.

పిల్లలకు కావాలంటే III బొమ్మలో చూపిన విధంగా అక్కడక్కడ అద్దాలు కుట్టి. వాటి చుట్టూ 2, 3 వరసలు మొగ్గలు పెట్టినా బాగానే వుంటుంది. చిన్నపిల్లల ఫ్రాకులకు కూడ ఊహించి రకరకాలుగా మొగ్గలు కుట్టవచ్చు.

మొగ్గలు ఒక రకమయితే పువ్వులకుగాను IIవ బొమ్మలోలాగ రెండు ముక్కలు కత్తిరించుకొని, లో గీత ప్రకారం మిషన్‌తో కుట్టి జాగ్రత్తగా రైట్ సైడ్‌కు త్రిప్పి ఓపన్ దగ్గర నాజూకుగ, కనిపించకుండా కుట్టు వేయాలి. జాగ్రత్తగా తిప్పటం చేతకానివారు ఓ వైపు పూర్తిగా కుట్టకుండా వుంటే సులభంగా త్రిప్పవచ్చు. ఆ భాగమంతా మడచి చేతి కుట్టు వేసుకోవచ్చు. ఇలాంటి పువ్వులతో రకరకాలుగా డిజైన్ వచ్చేలా ఇంకొక గుడ్డపైన కుట్టుకొని ట్రే క్లాత్ (ఫోటోలో వుంది) టీపాయ్ క్లాత్....ఇలా ఇష్టమొచ్చిన దానికి కుట్టుకోవచ్చు. పువ్వులను చక్కగా అమర్చి చీరల మీదికి అప్లిక్ లాగ కూడ చేసుకోవచ్చును. మనం చూపే నేర్పు, నైపుణ్యంలోనే అందమంతా ఇమిడి వుంది.

కాస్త పెద్ద ముక్కలు వుంటే చక్కటి డిజైను, రంగు వుండే ముక్కలను కంటికి ఇంపుగ వుండేలా అమర్చవచ్చును. ఒక షేప్‌లోకాక రకరకాలుగా కత్తిరించి ఒకదానికొకటి అతికి చిన్నదుప్పట్లు, డోర్, విన్‌డో కర్టెన్స్, టేబుల్ ఫాన్ కవర్స్



మొదలైనవి చేయవచ్చును. పిల్లో కవర్స్‌కు కూడా పెద్ద ముక్కలు ఒకదానికొకటి చూడ ముచ్చటగా అమర్చి ఉపయోగించవచ్చు. అలానే సూట్‌కేస్ కవర్స్‌కు విడిగ గుడ్డ కొనకుండా రెండు పొరలతో కవర్ కుట్టుకోవచ్చు.






మాతృత్వపు మమకారంలో మైమరచిపోవాలనే వుంటుంది అందరికీ. అది సహజం. కాని ఆ అదృష్టం కొందరు దురదృష్టవంతులకు కలగకుండాపోతోంది. తల్లితండ్రుల ఆకస్మికమరణం వల్ల కానీ, వాళ్ళు విడిపోవడం వల్ల కానీ, పెళ్ళి కాకముందే తల్లవడంతో ఏ పార్కులోనో, రోడ్డు చివర డస్ట్‌బిన్‌లోనో పుట్టిన పసికందుని విడిచిపెట్టడం వల్ల కానీ యిలాంటి ఎన్నో కారణాలవల్ల తల్లిదండ్రులని బాల్యంలోనే కోల్పోయినవారెందరో అదృష్టహీనుల కోవకి చెందుతారు. వారినే 'అనాథ'లు అని అంటున్నాం. 'పాపం' అని జాలిపడుతున్నాం. కాని కేవలం నోటి సానుభూతితో జాలి చూపినంత మాత్రాన వారి జీవితాలకి ఏవిధమైన సహాయం చేసినట్లు అవదు. పైపెచ్చు గాలికి పెరిగిన ఆ పిల్లలు రెండు విధాలుగా మారడానికి అవకాశం వుంది. ఆ సానుభూతివల్ల వారు తమలో తామే కుమిలిపోయి చివరికి ఒక విధమైన నిరాశావాదానికి లోనుకావడం, లేదా మానవత్వం తెలియని మహా దుర్మార్గులుగా పరిణామం చెందడం. అయితే వారలా కాకుండా కాపాడాల్సిన బాధ్యత సంఘానికి వుంది. అందుకే శరణాలయాలు, సేవాసదన్‌లు ముఖ్య నగరాలన్నింటిలోనూ వెలశాయి.

వాటిల్లో చెప్పుకోదగ్గది హైద్రాబాదులోని ఇందిరా సేవాసదన్ !

ప్రముఖ సంఘ సేవికురాలు, స్వాతంత్ర్య సమర యోధురాలు అయిన కీ. శే. సంగం లక్ష్మీబాయి గారు 1952 లో ఈ సేవాసదనాన్ని కేవలం అనాథ స్త్రీలకు, బాలికలకు వుద్దేశించి ప్రారంభించారు. ఆమె తన స్థిర, చరాస్తులన్నిటినీ ఈ సేవాసదనం అభివృద్ధికే వినియోగించారు. లక్ష్మీబాయిగారి తీవ్ర కృషి ఫలితంగా ఈ సంస్థ 'ఇంతింతై, వటుడింతై' అన్నట్లుగా పెరిగి అనాథాశ్రమంతోపాటే వృత్తి విద్యలు నేర్పించడానికి, విద్యాబోధనకూ పాఠశాలలు, బాలవాడీలు, కోళ్ళ పెంపకం, పశుసంపద, తోటలు, పొలాలు-యిలా ఎన్నో అనుబంధ సంస్థలూ ప్రారంభమయ్యాయి. అవి అభివృద్ధి చెందుతున్నాయి; అక్కడి పిల్లలని వృద్ధిలోకి తెస్తున్నాయి.

ఐతే, ఈ సేవాసదన్‌లో చేరదలచినవారు అనాథలే అయి వుండాలన్న నియమం లేదు. నిమ్నజాతుల వారూ, ఆర్థికంగా వెనుకబడినవారు కూడా తమ పిల్లలను చేర్చవచ్చును. కాని ఆడపిల్లలకి మాత్రమే పరిమితం. అనాథ స్త్రీలను కూడా వీరు చేర్చుకుంటారు. చేర్చుకున్న పిల్లలను వీరు తమ అనుబంధ పాఠశాలకి పంపుతారు. 'చదువు యిక రాదు' అనుకున్న పెద్దవాళ్ళకు - కోళ్ళ పెంపకం, వంటలో సాయం చేయడం, చిన్న పిల్లలను చూసుకోవడం మొదలైన పనులు అప్పచెబుతారు.

ప్రస్తుతం యిక్కడ దాదాపు నూరు నుంచి నూటయాభై దాకా పిల్లలూ పెద్దలు వున్నారు. తల్లులతోపాటే వారి పిల్లలను కూడా యిక్కడే వుండనిస్తారు.

మరి ఈ సేవాసదన్‌లోని పిల్లల రోజు వారి కార్యక్రమం ఎలా వుంటుంది ?

"ఉదయం ఐదు గంటలకు పిల్లలందరూ నిద్ర లేస్తారు. ప్రార్థన, సంస్కృత శ్లోకాలు, భజనలు చేస్తారు. ఆ తరువాత గంటసేపు పాఠ్యపుస్తకాలు చదువుతారు. ఏడుగంటల నుంచి ఎనిమిదిదాకా ఒక్కొక్కరే నిర్ణయించిన ప్రకారం – ఆశ్రమ ప్రాంగణం శుభ్రం చేయడం, నీళ్ళు నింపడం, చెట్లకు నీరు పొయ్యడం, వంట పనిలో సాయం చేయడం–యిలా తమ తమ విధులు నిర్వర్తిస్తారు.

ఎనిమిదిన్నరకి ఉప్మా, రొట్టెలు, పులిహోర వంటివి పిల్లలకి అల్పాహారంగా యిస్తారు. కాస్త పెద్ద పిల్లలు ఆశ్రమం ఎదురుగా వున్న గుప్తా ఉన్నత పాఠశాలకు చదువుకునేందుకు వెళతారు. ప్రస్తుతం రాష్ట్రప్రభుత్వం ఆధీనంలో నడుస్తున్న ఈ పాఠశాల 1958 లో వీరు ప్రారంభించినదే. ఇక్కడ సేవాసదన్ పిల్లలే కాకుండా చుట్టుపక్కల నుండి కూడా అనేకమంది బాల



# ఇందిరా సేవాసదన్



స్వాతంత్ర్య సమర యోధురాలు, ప్రముఖ సంఘ సేవిక అయిన శ్రీమతి సంగం లక్ష్మీబాయి జూన్ 2 సాయంత్రం తన 68వ ఏట దివంగతురాలయ్యారు.

ఆమె 1911 లో జన్మించారు. గుంటూరులో ఉన్నవ లక్ష్మీకాంతమ్మ దంపతులు నిర్వహించిన శారదా నికేతన్‌లో విద్యనభ్యసించారు. చిత్రలేఖనంలో కూడా ఆమెకు విశేషమైన ప్రతిభ వున్నది. చిన్నాటనే భర్తను కోల్పోయిన లక్ష్మీబాయిగారు తన జీవితాన్ని దేశ సేవకే అంకితం చేశారు.

ఆమె తన పదహేనవ ఏటనే గాంధీజీ ప్రభావానికి లోనై స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. తెలంగాణా ప్రాంతంలో స్వాతంత్ర్య సమరానికి నాయకత్వం వహించారు. పలుమార్లు జైలుకు వెళ్ళారు: వినోబా భావే భూదానోద్యమంలో కూడా ఆమె చురుకుగా పాల్గొన్నారు.

అప్పట్లో హైద్రాబాదు రాష్ట్రంలో తొలిసారిగా ఏర్పడిన బూర్గుల రామకృష్ణరావు మంత్రివర్గంలో ఆమె విద్యాశాఖ ఉపమంత్రి పదవిని నిర్వహించారు. ఆ రోజుల్లో ఆంధ్ర మహాసభ ఉద్యమంతో కూడా ఆమెకు దగ్గర సంబంధం వుంది. 1971లో ఆమె రాజకీయాల నుండి విరమించేవరకూ పార్లమెంటు సభ్యురాలుగా వికారాబాద్ నియోజకవర్గం నుండి మూడు మార్లు ఎన్నికయ్యారు.

నిస్వార్థ సేవా పరాయణురాలైన లక్ష్మీబాయిగారు అనాధ స్త్రీలకు, బాలికలకు ప్రత్యేకంగా హైద్రాబాదులో ఇందిరా సేవాసదన్ ప్రారంభించారు. తన యావదాస్తిని సేవాసదన్‌కి ధారాదత్తం చేశారు.



బాలికలు వచ్చి విద్య నభ్యసిస్తున్నారు. మరీ చిన్న పిల్లలైతే సేవాసదన్‌కి సంబంధించిన 'వాసు శిశు విహార్' మాంటెసొరి పాఠశాలకి వెడతారు. అనాధాశ్రమంలోని స్త్రీలు కొందరు యిక్కడ టీచర్లుగా పని చేస్తున్నారు. చదువురాని స్త్రీలు ఆయాలుగా వుంటున్నారు.

"సాయంత్రం పూట సేవాసదన్‌లో పిల్లలు ఆడుకునేందుకు తగిన ఏర్పాట్లు, ఆటవస్తువులు వున్నాయి. రాష్ట్రప్రభుత్వం టెలివిజన్ సెట్టును కూడా అమర్చింది. రాత్రి ఆరున్నర నుంచి ఎనిమిదిన్నరదాకా చదువు. ఆపైన భోజనం, నిద్ర పోయేముందు-అందరూ కలసి ప్రార్థన చేయడం. నియమబద్ధమైన ఆశ్రమ జీవితం అది.

ఛాయాచిత్రాలు : 'ప్రభు'

అయితే ప్రతి పనీ ఠంచన్‌గా టైమ్ ప్రకారం జరిగి తీరాలనే నియమం లేదు. అప్పుడప్పుడు పది నిముషాలు అటు యిటు అవుతూనే వుంటుంది. అంతమాత్రాన పురుకులు, పరుగులతో చేయాలని కట్టడి చెయ్యం. ఇది కూడా మామూలు గృహ వాతావరణం వంటిదే" అని చెప్పారు ప్రస్తుతం ఆశ్రమ వ్యవహారాలు చూస్తున్న శ్రీమతి వెంకటమ్మ. ఆమె లక్ష్మీబాయిగారి స్నేహితురాలు; సన్నిహితురాలు.

సేవాసదన్ పక్కనే పాఠశాలని ఆనుకుని పదహారెకరాల పొలం వుంది. తాజాకూరలు, వరి, జొన్నలు, రాగులు, పళ్ళు, అక్కడ పండిస్తారు. కోళ్ళ పరిశ్రమ, పాడి పరిశ్రమ నుంచి కోడిగ్రుడ్లు, పాలు కూడా సమృద్ధిగా లభిస్తాయి. వీటిలో ఆశ్రమవాసులు వాడుకోగా మిగిలినవన్నీ యిక్కడి పిల్లలే బజార్లో అమ్ముతారు.

ఇక్కడి బాలికలలో 'గౌతమి' అనే అమ్మాయిని ఎన్నుకొని ఆశ్రమ నిర్వహణలో తర్ఫీదు యిస్తున్నారు. నెమ్మదిగా మాట్లాడుతూ, చక్కగా పాడే ఈ అమ్మాయి తన భవిష్యత్తును ఈ సేవాసదన్‌కే అంకితం చేయాలనుకుంటోంది.

ఇక్కడి బాలికలకి స్కూల్ ఫైనల్ అయిపోగానే వుద్యోగం చేయగలిగిన వారికి వుద్యోగ సదుపాయాలు, పై చదువులు చదవదల్చుకున్న వాళ్ళకి ఆ సదుపాయం కల్పిస్తారు. వివాహ అవకాశాలు వచ్చినప్పుడు వివాహం చేస్తారు. కుట్టుపని, చేతిపనులలో కూడా వీరికి శిక్షణ యిస్తారు. కొందరైతే ఆశ్రమాన్ని అంటిపెట్టుకునే వుండిపోతారు.

లక్ష్మీబాయిగారికి పిల్లలు లేరు. ఈ పిల్లలందరినీ తన బిడ్డలుగానే ఆమె భావించేవారు. ఈ దీన చరితుల మధ్యనే జీవిస్తూ, వారు భుజించే ఆహారమే భుజిస్తూ, స్వయంగా పాటలు రాసి వారికి నేర్పుతూ వుండేవారు. 'మనం చేసేపనులు చిత్తశుద్ధితో చేస్తూ, మన పైన మనం నమ్మకం పెంచుకుంటే సాధించలేనిది ఏదీలేదు' అనేవారామె. నిజమే. అందుకు నిదర్శనం-ఆమెచేత స్థాపించబడి ఎందరో బాలికల జీవితాలలో వెలుగును ప్రసాదించి, వారి జీవితాలకి ఒక అర్థం యిచ్చిన ఇందిరా సేవాసదన్; ఒక వ్యక్తికి అంతకంటె ఉన్నతమైన స్మృతి చిహ్నం మరేముంటుంది?

—భార్గవి పి. రావు

## 4

కల్పన తొమ్మిదవ క్లాసు చదువుతున్నది. సిద్ధార్థ, రవీంద్ర పది చదువుతున్నారు.

కల్పన తన పదకొండో ఏటనుంచే నవలలూ, కథలూ పిచ్చిగా చదవసాగింది. శరభయ్య మాస్టారు చూస్తే ఊరుకోరని చాటుగా చదువుతూ ఉంటుంది. పగటి కలల్లోనే ఎక్కువగా జీవించసాగింది. తను కూడా రచయిత్రి అయినట్టూ, తన పేరు పత్రికల్లో వచ్చినట్టూ, తన ఫాన్స్ ఎందరో చుట్టూ మూగి ఆటోగ్రాఫ్స్ అడుగుతున్నట్టూ ఊహించుకుంటూ, ఆ లోకంలోనే గంటలకొద్దీ ఉండిపోయేది. మంచి సినిమా చూసినప్పుడు, అందులోని హీరోయిన్ తనే అయితే—అనుకుంటూ రాత్రిళ్ళు నిద్రపట్టేంత వరకూ ఊహల ఉయ్యాలలో ఊగుతూ ఉండేది.

తను ఏదో ఒక ప్రత్యేకతను సాధించాలి. మందలో మనిషిగా కాక, పదిమందిలో ఒక్కతెగా బ్రతకాలి. అందుకు తను ఏదో ఒక ఫీల్డ్‌లో ప్రత్యేకతను సాధించాలి. తెలిసీ తెలియని ఊహల్లో కొట్టుకుపోతూ ఉండేది.

చూడటం ఇష్టం ఉండేది కాదు. సినిమాల్లో వేషాలకు అసలే ఇష్టపడడని తెలుసు. అందుకే వివాహం అయాక భర్తను ఒప్పించి సినిమాలో చేరాలని ఆలోచిస్తూ ఉండేది.

కల్పన, రవీంద్రతోనూ సిద్ధార్థతోనూ చిన్నప్పటి నుంచి ఆడుతూ పాడుతూ పెరిగింది. ముగ్గురూ ఒకే స్కూల్లో చదివారు. కల్పన తండ్రి శరభయ్య అదే స్కూల్లో తెలుగు మాస్టరుగా పనిచేసేవాడు. ఇద్దరూ శరభయ్య మాస్టారి దగ్గిర ట్యూషన్‌కు వచ్చేవాళ్ళు.

సిద్ధార్థ శ్రీమంతుల బిడ్డ.

రవీంద్ర ఒక పేదరైతు కొడుకు. రవీంద్ర శ్రద్ధగా చదివేవాడు. సిద్ధార్థకు చదువంటే లక్ష్యం ఉండేది కాదు. ఎప్పుడూ చదివినట్టు కన్పించేవాడు కాడు. అయినా ఒక్క క్లాసూ తప్పకుండా పాసయ్యే వాడు.

వయసుతోపాటు వారి మధ్య ఏర్పడిన స్నేహం కూడా పెరగసాగింది.

కల్పన అంటే ఇద్దరికీ ఇష్టమే.

సశేష నవల

# నింగినుండి నేలకు



ఆమెకు కామెడీ కథలన్నా, సినిమాలన్నా ఇష్టం ఉండేది కాదు. ట్రాజడీలంటే ఇష్టం.

ఒక ప్రేమ కథ చదివి అందులో హీరోయిన్‌లా ప్రేమించి, విలపించాలని కోరుకొనేది. పద్నాలుగేళ్ళ కల్పన కలల్లోనే ప్రేమించడం విలపించడం చేసేది.

కల్పన అందాన్ని ఆ ఊళ్లో ప్రతి వాళ్ళూ మెచ్చుకొనేవారు.

"మల్లీశ్వరి సినిమాలోని చిన్న మల్లిలాగుంది" అనేవారు.

కల్పనకు తండ్రి అంటే గౌరవం. భయం కూడా ఉన్నది. తండ్రికి సినిమాలు విరివిగా

కల్పనకు కూడా ఇద్దరన్నా ఇష్టమే!

ఒకరోజు రవీంద్రా, సిద్ధార్థా ఘర్షణ పడుతున్నారు ఏదో విషయం మీద. శరభయ్య మాస్టారు లోపల భోజనం చేస్తున్నారు. కల్పన పుస్తకాలు తీసుకొని వరండాలోకి వచ్చింది.

కల్పనను చూడగానే "కల్పనా! నీకు నేనంటే ఇష్టమా లేక రవీంద్ర అంటేనా?" సూటిగా అడిగేశాడు సిద్ధార్థ.

సిద్ధార్థ ఏ విషయాన్నీ మనసులో దాచుకోలేడు. వెంటనే కక్కేస్తాడు. ధైర్యం ఎక్కువ. మొండితనం కూడా ఉన్నది. కోపం వస్తే ముందు దెబ్బ

కొట్టి తర్వాత మాట్లాడతాడు. ఆ దుడుకుతనం డబ్బుతో వచ్చింది.

కల్పనకు అతని ప్రశ్న తమాషాగా అనిపించింది. చక్రాలలాంటి కళ్ళను తిప్పుతూ ఇద్దర్నీ మార్చి మార్చి చూసింది. రవీంద్ర సిగ్గుతో తల వంచుకున్నాడు.

రవీంద్ర పిరిగ్గా ఉంటాడు. మనసులోని మాటను వెంటనే చెప్పలేడు. ఒకోసారి కల్పనకు రవీంద్ర కుళ్ళుబోతుగా కన్పించేవాడు.

"చెప్పు!" అన్నాడు సిద్ధార్థ.

"చెప్పనా!" మార్చి మార్చి చూడసాగింది.

"త్వరగా చెప్పు!"

"ఇద్దరంటేనూ!" అన్నది.

"మరీ ఎక్కువ ఎవరంటేనో చెప్పు!"

కల్పన "ఊ....ఊ....మరి...." అంటూ తల ఎడం చేతివేళ్ళతో గీరుకుంటూ ఆలోచించసాగింది.

సిద్ధార్థ ఆత్రుతగా కల్పన ముఖంలోకి చూస్తున్నాడు.

రవీంద్ర పుస్తకంలోకి చూస్తూ పేజీలు తిప్పుతున్నాడు.

"నేను నీకు నెమలి ఈక ఇచ్చాను. ఏం చేశావ్?" అడిగింది సిద్ధార్థను కల్పన.

"ఇంగ్లీషు టెక్స్టులో పెట్టుకున్నాను."

"పిల్లల్ని పెట్టిందా?" కిలకిల నవ్వింది కల్పన.

రవీంద్ర ఓరగా, కుళ్ళుగా చూశాడు ఓ క్షణం.

"చిన్నప్పుడు అలా అనుకొనే వాళ్ళంగదూ!"

"అయితే పుస్తకంలో భద్రంగా ఎందుకు పెట్టావ్?"

"నువ్వు ఇచ్చావు. అందుకే పారెయ్యలేక!"

"నేను పారేశాను. ఇన్నేళ్ళొచ్చి నెమలి ఈకల్ని పుస్తకాల్లో పెట్టుకొనేంత పిచ్చివాణ్ణిగాదు." అక్కసుగా, అడగకుండానే అన్నాడు రవీంద్ర.

ఇద్దరూ గిర్రున తలలు తిప్పి రవీంద్రను చూశారు. రవీంద్ర వాళ్ళను చూడటంలేదు. పక్కకు చూస్తున్నాడు.

రవీంద్ర ఉడుకుక్కుంటున్నాడు. అతన్ని చూస్తుంటే కల్పనకు తమాషాగా ఉంది. ఏదో థ్రిల్లింగ్, ఎందుకో తెలియదు. అయినా బాగుంది. సర్దాగా ఉంది.

"మా ఇద్దర్లో నీకు ఎవరంటే ఇష్టమో చెప్పలేదు." అన్నాడు సిద్ధార్థ.

"చెప్పానుగా ఇద్దరంటేనూ అని!"

"మరీ ఎక్కువ—"

అంతలో శరభయ్య మాస్టారు భోజనం చేసి వక్కపలుకు నములుతూ బయటికి వచ్చాడు. వాళ్ళ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

ఆ రాత్రి తన అభిమాన రచయిత్రి నవల చదవసాగింది. అందులో ట్రయాంగిల్ లౌ ఇతివృత్తంగా తీసుకుని రాసిన కథ. ఊపిరి సలపకుండా చదువుతోంది. హీరో హీరోయిన్ మధ్య బోలెడన్ని అపార్థాలు. సిల్లీ పోట్లాటలు, చిలిపితనం చేష్టలు. ఒకటేమిటి సెవెంటీ ఎం. ఎం. దోసెలా ఉంది కథ.



కథ ముగిసింది. ముగింపు కల్పనకు నచ్చలేదు. పుస్తకం గిరాటు వేసింది. ప్రేమికులిద్దరూ అన్ని అపార్థాలనూ అర్థం చేసుకుని కష్టాలను అవలీలగా జయించి చివరికి బోలెడంత ఆస్తితో ఒకరికి ఒకరు అతుక్కుపోతారు.

ఛా! పెళ్ళయాక ఇంక కథేమిటి? ఇక జీవితానికి ఫుల్‌స్టాప్ పెట్టాల్సిందే. ఇక వాళ్ళు చేసేది మామూలు సంసారమే. పిల్లలూ, జల్లలూ, వాళ్ళ జబ్బులూ, పెళ్ళిళ్లూ - ఈ మాత్రం దానికి ఇన్ని బాధలెందుకు పడాలి? ప్రేమించకుండానే పెద్దలు చేసిన పెళ్లి చేసుకున్నవాళ్లు చేసే పనికూడా ఇదేగా!

వాసిరెడ్డి సీతాదేవి

ఇంత మాత్రానికే మరి ప్రేమించడం, పెద్ద పెద్ద నిట్టూర్పులు విడవడం ఎందుకు? తీరా పెళ్ళయాక ఇక రొటీన్ జీవితం ప్రారంభం అవుతుంది. జీవితం లోని థ్రిల్ చచ్చి ఊరుకుంటుంది.

తను మాత్రం అలా చెయ్యదు. చెయ్యలేదు. తను మామూలు ఆడది కాదు. నేలబారు జీవితం తను గడపలేదు. తనలోని జ్వాల చల్లారకూడదు.

జ్వాల తనలో ఉందా? ఏమో! తను ఇంకా ఎవర్నీ ప్రేమించలేదుగా? నవలల్లో జ్వాల, అదే ప్రేమ జ్వాల గురించి తను చదివింది. ఆ జ్వాల తనలో రగలాలంటే తను ప్రేమించాలి. ప్రేమించిన వాడిని పెళ్లి చేసుకోకూడదు. అందులోనే థ్రిల్ ఉంది. జ్వాల, ఆర్తి, వేదన, ఇవన్నీ ఉన్న హృదయమే కళాసృష్టి చెయ్యగలదు. ఇవి తన భావాలు కావు. ఈ మాటలు కూడా తను ఏదో నవలలో చదివింది.

కాని తను ఎవర్ని ప్రేమించాలి?

సిద్ధార్థనా?

కాదు....లాభం లేదు.

రవీంద్రనే ప్రేమించాలి.

సిద్ధార్థను ప్రేమించి పెళ్లి చేసుకోకపోయినా పాటలు పాడుతూ తన కోసం ఏడవడు. దేన్నీ లక్ష్య పెట్టడు.

రవీంద్ర అలా కాదు. అతని మనసు చాలా సున్నితం. ప్రతి చిన్న విషయానికీ బోలెడంతగా బాధపడిపోతాడు. మనసులోని మాటను పైకి చెప్పడం కూడా సరిగా చేతకాదు. లోలోపల కుళ్ళు కుంటాడు. అతన్ని ప్రేమించి సిద్ధార్థను పెళ్ళి చేసుకోవాలి. తన కోసం అతను జీవితాంతం విల పిస్తాడు. అతన్ని తల్చుకుంటూ తను కూడా కొవ్వొత్తిలా తనను తాను కాల్చుకుంటూ, ప్రపంచానికి మాత్రం వెలుగునిస్తూ, అంటే తను బాధ పడుతూ, సిద్ధార్థకు ఆనందాన్ని ఇస్తూ, బ్రతకాలి.

అప్పుడే జీవితానికి ఓ అర్థం ఏర్పడుతుంది.

అవును! తను రవీంద్రనే ప్రేమించాలి.

ప్రేమించాలంటే ఏం చెయ్యాలి? ఇప్పుడే రవీంద్రకు నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పెయ్యాలా?

అమ్మో! నాన్నకు తెలిస్తే తాట వొలిచేస్తాడు. అతని కులం తమ కులం ఒకటి కాదు. ఆ మాట కొస్తే సిద్ధార్థ కులం కూడా వేరు. నాన్న వీళ్లిద్దర్లో ఎవర్ని పెళ్ళాడడానికీ ఒప్పుకోడు. తన ప్రేమ వ్యవహారంలో తండ్రితో కూడా ఘర్షణ పడాలి. సిద్ధార్థను పెళ్ళి చేసుకోవాలన్నా ఘర్షణ తప్పదు. నాన్న సినిమాల్లోని నాన్నలా డైలాగ్సు చెబుతాడు. తన సమాధానాలు కూడా హీరోయిన్ సమాధానాల్లాగే ఉండాలి. తనకు అంత ధైర్యం ఉంది.

కాన్సర్ వ్యాధిలా పధ్నాలుగు సంవత్సరాల వయసులో వున్న కల్పన బుర్రలో ప్రేమ తాలూకు ఆలోచనలు ఎటుబడితే అటే అల్లుకుపోసాగాయి.

# 5

రవీంద్ర పదో తరగతి పాసయ్యాడు. డిస్టింక్షన్‌తో పాసయ్యాడు.

సిద్ధార్థ బొటాబొటిగా వచ్చిన మార్కుల్తో పాసయ్యాడు. అదీ తండ్రి డబ్బు వెదజల్లి పాసు చేయించాడనే వదంతి కూడా వచ్చింది.

కల్పన ఇద్దరికీ ఇంట్లో పార్టీ ఇచ్చింది.

సిద్ధార్థ ఎప్పుడూ ఉత్సాహంగానే ఉన్నాడు. రవీంద్ర డిస్టిన్‌క్షన్‌లో రావడంతో ఉత్సాహంగా ఉన్నాడు.

"ఏ కాలేజీలో చేరాలనుకుంటున్నావ్?" అడిగింది కల్పన రవీంద్రను పార్టీ ఇచ్చిన రోజు.

"గుంటూరు కాలేజీలో చేరాలని ఉన్నది."

"నువ్వో?" సిద్ధార్థను అడిగింది.

"నేను ఏ కాలేజీలోనూ చేరను"

"అదేం?" ఇద్దరూ ఒకేసారి ఆశ్చర్యంగా ప్రశ్నించారు.

"చదివి నేను ఉద్యోగం చెయ్యవలసిన అవసరం లేదు."

"అందరూ ఉద్యోగం కోసమే చదువుతారా?"

"దాదాపు. కేవలం విజ్ఞానం ఆర్జించడానికి కాలేజీకి వెళ్ళక్కర్లేదు. నిరంతరం అధ్యయనం చెయ్యొచ్చు. ఎవరికి ఏ విషయంలో అభిరుచి ఉంటే ఆ విషయానికి సంబంధించిన పుస్తకాలు చదువుకో వచ్చును."

రవీంద్ర అదోలా నవ్వాడు. ఆ నవ్వులోని వ్యంగ్యాన్ని సిద్ధార్థ పసికట్టాడు.

"ఇంగ్లీషులో నువ్వు చదివిన కొన్ని క్లాసిక్స్ గురించి చెప్పు చూద్దాం!" అన్నాడు సిద్ధార్థ.

"నేను పనికిరాని పుస్తకాలు చదవను. క్లాసు పుస్తకాలే చదువుతాను. ఇంకా నేను విద్యార్థినే!" దురుసుగా అన్నాడు రవీంద్ర.

సిద్ధార్థ పకపక నవ్వాడు.

"అదే చిట్టినాన్నా నేను చెప్పేది కూడా! అందుకే విద్యార్థి జీవితం వదిలేసి హాయిగా మంచి పుస్తకాలు చదువుకుంటాను."

"నీకు పెద్దలు ఆర్జించినది బోలెడంత ఆస్తి ఉన్నది. కాని నా పొట్టనూ, నా మీద ఆధారపడిన వారి పొట్టల్నీ నింపాల్సిన బాధ్యత నా మీద ఉన్నది. నాకు ఉద్యోగం అవసరం. డిగ్రీ అవసరం."

"నేనూ సోమరిగా పెద్దలు సంపాదించింది తింటూ కూర్చుంటాననుకోకు. నాకు బిజినెస్‌లో ఇన్‌టరెస్టు ఉంది. బిజినెస్‌కు సంబంధించిన మెళకువలు తెలుసుకుంటాను." అన్నాడు సిద్ధార్థ.

"అసలు విద్య అంటే ఆ నాలుగు గోడల మధ్య లెక్చరర్స్ చెప్పే పాఠాలేనని చాలామంది భ్రమ. వాళ్ళిచ్చే డిగ్రీలే ఒక వ్యక్తి ఆర్జించిన జ్ఞానానికి కొలబద్దలు కావు. విజ్ఞానం సంపాదించడం వేరు, విజ్ఞానాన్ని ఆర్జించడం వేరు." మళ్ళీ సిద్ధార్థే.

రవీంద్ర మాట్లాడలేదు.

కల్పన తన పెద్ద పెద్ద కళ్ళను తిప్పుతూ ఇద్దర్నీ చూస్తూ కూర్చుంది.

రవీంద్ర గుంటూరు కాలేజీలో చదువుతున్నాడు. కల్పన నైన్త్ పాసయి టెన్త్‌లోకి వచ్చింది.

సిద్ధార్థ సగం రోజులు బస్తీలో స్నేహితులతో కాలక్షేపం చేస్తున్నారు.

ఆ రోజు సిద్ధార్థ కల్పనను చూడటానికి వచ్చాడు.

"రవీంద్ర కన్పించాడా? ఎలా ఉన్నాడు?" అని అడిగింది.

"ఆఁ! బాగానే ఉన్నాడు."

"బాగా చదువుతున్నాడా?"

"పుస్తకాలను బొద్దెంకలా కొరికేస్తున్నాడు."

"బలేవాడివి. ఇంటర్ ఫైనల్ పరీక్షలుగదా? బాగా చదవకపోతే డాక్టర్ చదవడానికి సీటు రావద్దూ?"

పట్నం నుంచి కల్పనకు పైటపిన్ను తెచ్చి ఇచ్చాడు. అది దంతంతో చేసింది. ఆమె పేరు కూడా దాని మీద చెక్కి ఉన్నది.

కల్పన కళ్ళు మెరిశాయి.

"బాగుంది. కాని పైటపిన్నేమిటి పంతులమ్మ లాగా" అన్నది కల్పన.

అంతలో శరభయ్య బయటి నుంచి వచ్చాడు.

"ఏం బాబూ ! బాగున్నావా ?"

"బాగానే ఉన్నాను సర్ !"

"చదువు మానేశావేం ? అప్పుడే దాదాపు రెండేళ్ళు వ్యర్థం చేసుకున్నావ్."

"లేదు సర్ ! ఈ రెండేళ్ళలోనూ నేను చాలా విషయాలు తెలుసుకున్నాను. త్వరలోనే బిజినెస్ చెయ్యాలనుకుంటున్నాను. నాన్న ఒప్పుకోవడం లేదు. మరో రెండేళ్ళు పోనివ్వు అంటున్నాడు."

"ఏమైనా డిగ్రీ ఉంటే బాగుండేది." అన్నాడు శరభయ్య.

సిద్ధార్థ నవ్వి ఊరుకున్నాడు.

# 6

కల్పన పది పాసయింది.

రవీంద్ర శెలవులకు ఇంటికి వచ్చాడు.

రవీంద్ర కల్పన సిద్ధార్థతో మాట్లాడుతూ, నవ్వుతూ, తుళ్ళుతూ ఉంటే ఎలాగో ముఖం పెట్టేవాడు. రవీంద్ర మాటకారికాదు. సిద్ధార్థలా తను ఎందుకు నవ్వలేకపోతున్నాడు ? కల్పనను నవ్వించలేకపోతున్నాడు. వాళ్ళిద్దరూ మాట్లాడుతూ ఉంటే తనకు మాటలే దొరకవ్ : ఎందుకని ?

రవీంద్ర ముఖం ముడుచుకుని కూర్చుంటే కల్పనకు చిత్రమైన అనుభూతి కలిగేది.

అతను తనను ప్రేమిస్తున్నాడు. అందుకే సిద్ధార్థతో మాట్లాడుతూ ఉంటే ఈర్ష్యపడుతున్నాడు !

కాని సిద్ధార్థ ! అతను కూడా తనను ప్రేమిస్తున్నాడో లేదో తెలియదు ! సిద్ధార్థ వచ్చేసరికి తను రవితో నవ్వుతూ మాట్లాడుతున్నా, ముఖం ముడుచుకోడు. తానూ ఉత్సాహంగా సంభాషణలో పాల్గొంటాడు.

కల్పన కూడా గుంటూరు కాలేజీలో చేరింది.

రవీంద్ర కల్పనా సన్నిహితులు అయ్యారు. కల్పనకు రెండు రోజులు రవీంద్ర కన్పించకపోతే పిచ్చెత్తినట్టు ఉండేది. దిగులుగా ఉండేది. ఇద్దరూ కలసి, పార్కులకూ, సినిమాలకూ వెళ్ళేవారు. గంటలకొద్దీ కబుర్లు చెప్పుకునేవారు. కల్పనకు తెలియకుండానే రవీంద్ర ఆమె మనసులో ప్రవేశించాడు.

ప్రేమను గురించి మాట్లాడేవాళ్ళు. కవిత్వం

ఫ్రాన్స్ దేశంలోని లయన్ నగరంలో ఈ మధ్య ఓ బ్రహ్మాండమైన ఉద్యమం చెలరేగింది. పదిహేను మంది వేశ్యలు ఆ ఉద్యమంలో పాల్గొన్నారు. కాని అంతటి సంచలనానికి కారణం వారందరూ కలిసి 'ఆపరేషన్ వర్చ్యూ (Virtue)' అంటే 'సౌశీల్యం కోసం పోరాటం' సాగించడమే.

ఈ పదిహేను మందీ కలిసి బకెట్ల కొద్దీ పెయింటు డబ్బాలు, జిగురు, పోస్టర్లు చేత పుచ్చుకుని అశ్లీల చిత్రాలు ప్రదర్శించే థియేటర్ల దగ్గర ప్రదర్శనలు జరిపారు. అక్కడి



పోస్టర్ల మీద రంగులు చల్లి, వాటి మీద తాము తయారు చేసిన పోస్టర్లు అంటించి నానా హడావిడీ చేశారు.

వారి నినాదాలలోనూ, పోస్టర్లలోనూ ఒకటే మాట – 'మీ పిల్లలని చెడుపుతున్నదెవరు మీరా? మేమా?' అని.

ఈ లోపల పోలీసులు వాళ్ళవెంట బడ్డారు. పోలీసుతో ఓ గంట సేపు దాగుడు మూతలాడి చివరికి టాక్స్ కలక్టర్ యింటి ముందు చివరి పోస్టరతికించింది వారి నాయకురాలు.

వారి వాదన ఏమిటంటే-సంఘానికి చీడ పురుగులుగా చిత్రించి మమ్మల్ని అరెస్ట్ చేసే పోలీసులు, అధికారులు ఎందరో పిన్నా, పెద్దా చూసి చెడిపోతున్న అశ్లీలకరమైన ఈ చిత్రాలను, పోస్టర్లను నిషేధించరేమిటని.

'ఆ రూలింకా రాలేదు ప్రస్తుతానికి రూలే వుంది' అంటూ రూళ్ళకర్ర ఝుళిపించి నాయకురాలినీ ఆమె మిత్రురాండ్రని అరెస్ట్ చేశారు ఫ్రాన్స్ పోలీసులు.

గురించి మాట్లాడేవారు. ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ గంటలకొలదీ కూర్చుండి పోయేవారు.

సిద్ధార్థ గుంటూరు వచ్చినప్పుడల్లా కల్పనను కలుసుకునేవాడు. ఎప్పుడూ హడావిడిగా గాలి దుమారంలా వచ్చి వెళ్ళిపోయేవాడు. సిద్ధార్థ కల్పనకు ఇంకా సింహాసనం ఎక్కని రాజకుమారుడిలా కన్పించేవాడు.

ఆ రోజు సిద్ధార్థ తనతో సినిమాకు రమ్మన్నాడు.

కల్పన ఆలోచనలోపడింది. అతనితో కలిసి సినిమా చూడాలన్న కోరికలేదు.

అయినా సినిమాకు బయలుదేరింది.

అదే సమయంలో రవీంద్ర ఫోన్ వచ్చింది.

ఆ రోజు బయటికి రాలేనని చెప్పి ఫోన్ పెట్టేసింది.

సినిమాలో ముందున్న రెండో వరసలో రవీంద్ర కల్పననూ, సిద్ధార్థనూ చూశాడు. ఇంటర్వెల్ లైట్లు వెలక్కుండానే లేచి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత రవీంద్ర కల్పనకు వారం రోజులు కన్పించలేదు. కల్పన అన్యమనస్కంగా ఉండటం చూసి హాస్టల్లో ఆమెతో సన్నిహితంగా ఉండేవాళ్ళు "ఏమోయ్ ! అలా ఉన్నావ్ ? నీ రాజకుమారుడు రాలేదా ?" అంటూ ఆటలు పట్టించసాగారు.

తను రవీంద్రను మనసారా ప్రేమిస్తున్నది. రవీంద్రను చూడకుండా తను ఉండలేదు. రవీంద్రను పెళ్ళి చేసుకోకపోతే తను జీవించగలదా ?

ఛ ! తన ఆదర్శాలు ఏమయ్యాయి. తను చస్తే ప్రేమించినవాణ్ణి పెళ్ళి చేసుకోదు.

ఆ రాత్రి కల్పన ఒక కవిత్వం రాసింది.

కల్పన ఫోన్ చేస్తే రవీంద్ర వచ్చాడు. అలిగిన పసివాడిలా కన్పించాడు.

"బెనహర్ చాలా బాగుందట ! వెళ్దామా ?"

"ఏం ? సిద్ధార్థ వెళ్ళిపోయాడా ?"

కల్పన చివ్వున తలెత్తి చూసింది.

"అదా సంగతి ? ఆ రోజు నువ్వు కూడా సినిమాకు వచ్చావా ? మమ్మల్ని చూసి మరి పలకరించలేదేం ?"

"సిగ్గు లేకపోతేసరి !"

"ఎవరికి ?"

రవీంద్ర సమాధానం ఇవ్వలేదు.

"అంతమాత్రానికే ఉడుక్కోవాలా ? ఒక్క రోజు సిద్ధార్థతో సినిమాకు వెళ్తే నా పాతివ్రత్య భంగం జరిగినట్టు నేను భావించడం లేదు."

"సంతోషించాంలే !"

"ఎందుకూ ? సిద్ధార్థతో సినిమాకు వెళ్ళినందుకేనా ?" వస్తున్న నవ్వును పెదవుల మధ్య బంధించింది కల్పన.

"నీ ధోరణి నాకు నచ్చలేదు."

"ఎందుకని ?"

"ఒక ప్రశ్న అడుగుతాను. సూటిగా జవాబు చెప్తావా ?"

"నాకు అబద్ధాలు చెప్పడం అంటే పరమ అసహ్యం అని నీకు తెలుసు."

"నాతో ఎందుకు తిరుగుతున్నావ్ ?"

"నిన్ను ప్రేమిస్తున్నాను కనక !"

"సిద్ధార్థతో ?"

"అతను నా చిన్ననాటి స్నేహితుడు. సరదాగా మాట్లాడతాడు. అతని కంపెనీలో ఉత్సాహంగా ఉంటుంది."

"అంటే నా కంపెనీలో నీకు ఏడుపు వస్తుందా ?"

"ఆ మాట నేను అనలేదే! నీతో ఉంటే నాకు సమయమే తెలియదు. యుగాలు అలాగే ఉండిపోవాలనిపిస్తుంది."

"అతనితో తిరగడం నాకు ఇష్టంలేదు."

"నాకు ఇష్టమే! నేను ఒకరి ఇష్టాయిష్టాల మీద నడవనని నీకు తెలుసు - నీకంటే ఆ విషయం సిద్ధార్థకే బాగా తెలుసు. నా వ్యక్తిత్వం నాది. దాన్ని ప్రేమకోసం కించపర్చుకోలేను."

"మనం పెళ్ళి చేసుకున్నాక కూడా ఇలాగే తిరుగుతానంటావా ?"

కల్పన కళ్ళు పెద్దవి చేసి రవీంద్ర ముఖంలోకి చూసింది.

"ఏమిటి ! అలా చూస్తావ్ ?"

"కొత్తగా మన పెళ్ళి గురించి విన్నాను కనక !"

"నీ ఉద్దేశం !"

"మనం పెళ్ళి చేసుకుందామని ఇంతకుముందు ఎప్పుడూ అనుకున్నట్టు నాకు గుర్తు లేదు."

రవీంద్ర కల్పన ముఖంలోకి వెర్రివాడిలా చూశాడు.

నిజ జీవితంలోనూ, కథల్లోనూ, సినిమాల్లోనూ మగవాడు అలా అని స్త్రీలను మోసం చేసినట్టు చూశాడు. చదివాడు. కాని ఇదేమిటి? ఈ రోజు ఒక ఆడపిల్ల తను ప్రేమిస్తున్న మగవాడితో ఆ మాట అన్నది.

"ఏమిటంత ఆలోచన ! లే ! సినిమాకు వెళ్దాం ! పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేయ్ !"

రవీంద్రకు ప్రాణం వచ్చినట్టు అయింది.

కల్పన మొండిపిల్ల ! కావాలనే అలా అన్నది. తను ఒక రోజు కన్పించకపోతే పిచ్చి పట్టినట్టు గొడవ చేస్తుంది. కల్పన తనది !

రవీంద్ర ఆ రోజు సినిమాకు వెళ్ళలేదు.

కల్పన తను రాసిన కవిత్వం వినిపించింది.

"ఎలా ఉంది ?" అని అడిగింది.

రవీంద్రకు పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టు అయింది. ఆ కవిత్వం ఏమీ బాగాలేదు. అసలు అది కవిత్వంలాగే అనిపించలేదు.

"నువ్వు కవయిత్రివి కావాలనుకుంటే కొన్ని మంచి కవిత్వాలు చదువు." అని మాత్రం అన్నాడు.

"అలా చెప్పకపోతే బాగాలేదని చెప్పరాదూ అంత పిరికితనం ఎందుకూ ?"

"ఎంతసేపూ అందని ఆకాశాన్ని అందుకోవాలని ప్రయత్నించడం శుద్ధ దండుగ. సమయం వ్యర్థం చేసుకోవడమే."

"అంటే కవిత్వం నాకు అందని ఆకాశం లాంటిదనేగా నీ అభిప్రాయం ? అలా చూస్తుండు ఒకనాడు నా కవిత్వానికి గుర్తుంపు వస్తుందో లేదో!"

"కవిత్వం పిచ్చి వదిలేసి, నవలలు రాయడానికి ప్రయత్నించు. ఆడవాళ్ళ నవలలకు మంచి గిరాకీ ఉంది. పేరుకు పేరు డబ్బుకు డబ్బు! ఫలానా ఆవిడ భర్తగా నువ్వు పెళ్ళి చేసుకోబోయే మగవాడు చలామణిలోకి వస్తాడు" రవీంద్ర మాటల్లో వ్యంగ్యం కొట్టవచ్చినట్టు కన్పించింది.

"నువ్వు నన్ను పెళ్ళి చేసుకోకు. చేసుకుంటే నా భర్తగానే గుర్తించబడతావు. ఆ తర్వాత బాధపడి ప్రయోజనం లేదు." నవ్వుతూ అన్నది.

రవీంద్రకు తన మీద కోపంగా ఉన్నది. ఎలాగయినా తనను గాయపర్చాలని అలా అంటున్నాడు. ఇంతకుముందు తనను కవిత్వం రాయమని ప్రోత్సహించేవాడు.

"కవిత్వం కవిత్వం కోసం కాదు. ప్రజల కోసం ! నీ కవిత్వానికి ప్రయోజనం ఏమిటో చెప్పగలవా ? నీలో తీవ్ర అనుభూతి లేదు. నాలుగు శబ్దాలను కష్టపడి చేర్చి అది కవిత్వం అంటే నేను ఒప్పుకోను."

"అవును ! నాలో తీవ్ర అనుభూతిలేదు. కవయిత్రికి అనుభూతి కావాలి. స్పందన కావాలి. హృదయంలో జ్వాల రగలాలి. అందుకే.... అందుకే....నిన్ను పెళ్ళి చేసుకోబోవడంలేదు" తనకు తానే చెప్పుకుంటున్నట్టు తగ్గు స్థాయిలో అన్నది.

రవీంద్ర కల్పన ముఖంలోకి వెర్రివాడిలా చూశాడు.

"నీకు పిచ్చెక్కింది" అన్నాడు రవీంద్ర.

"అవును పిచ్చే! మనిషికొక పిచ్చి. ఎవరి పిచ్చి వారికి ఆనందం! ప్రేమించిన వ్యక్తిని పెళ్ళి చేసుకోవాలనే పిచ్చి నిన్ను పీడిస్తుంది, నన్ను...."

రవీంద్ర చివ్వున లేచి నిల్చున్నాడు.

కల్పన పిలుస్తున్నా వినిపించుకోకుండా విసురుగా వెళ్ళిపోయాడు.

కల్పన గాఢంగా నిట్టూర్చింది.

# 7

కల్పన రెండో రోజు రవీంద్రకు ఫోన్ చేసింది. "నిన్ను చూడకుండా ఉండలేను రవీ! ఒక్కసారి వచ్చి కన్పించవూ ?" అన్నది.

ఆ మాట కొరకే ఎదురుచూస్తున్న రవీంద్ర రెక్కలు కట్టుకొచ్చి కల్పన ఉండే హాస్టలు ముందు వాలిపోయాడు.

ఇద్దరూ మళ్ళీ మామూలుగానే కలసి తిరగడం ప్రారంభించారు. రవీంద్ర - కల్పన కేవలం తనను ఉడికించడానికే, ప్రేమించినవాడిని పెళ్ళి చేసుకోకూడదు అంటూ ఉంటుందని భావించాడు. ఆమె మాటల్ని తేలిగ్గా తీసేసేవాడు. కల్పనలో పసితనం ఇంకా పోలేదని తనకు తానే సర్ది చెప్పుకొనేవాడు.

మెడిసిన్‌లో సీటుంచి రవీంద్ర బి. యస్ సి. పూర్తి చేశాడు. కల్పన ఇంటరు పాసయింది.

సెలవులకు ఇద్దరూ ఊరికి వచ్చారు.

సాయం సమయాలలో రవీంద్రతో నడిచి ఊరి బయట చెరువు కట్ట దగ్గరకు వెళ్ళేది కల్పన. గ్రామంలో అందరూ చిత్రంగా చూడసాగారు.

శరభయ్య కూతుర్ని మందలించాడు.

"ఇందులో తప్పేముంది ?"

"తప్పు ఒప్పుల గురించి మాట్లాడాల్సింది నువ్వు కాదు. గ్రామంలో కొన్ని కట్టుబాట్లు ఉంటాయి. ఇది బస్తీ కాదు. నువ్వు అలా భుజం భుజం రాసుకుంటూ రవీంద్రతో షికార్లు కొడుతుంటే నా తల పెద్ద మనుషుల ముందు వాలి

పోతున్నది. ఇకనుంచి నువ్వు బయట వెళ్ళడానికి నేను అంగీకరించను.''

"ఓ డాడీ! నువ్వు కూడా సినిమాల్లోని డాడీ లాగా ప్రవర్తిస్తావా?'' అంటూ అదోలా శూన్యంలోకి చూసింది.

"నీ తెలివి తేటలు చిన్నతనంలో చూసి ఎంతో గొప్పదానివి అవుతావని గర్వించేవాణ్ణి. కాని వయసు పెరిగిన కొద్దీ పిచ్చి ఆలోచనలు ఎక్కువైనాయి.''

"ఓ డాడీ!''

"నాకు అలా పిలవడం ఇష్టం ఉండదని నీకు తెలుసు!''

"నాన్నగారూ అనమంటారా?''

"ఏదో ఒకటిలే. ఇవాళ నుంచి రవీంద్రతో బయట తిరక్కు.''

"రవీంద్రను నేను ప్రేమిస్తున్నాను.''

శరభయ్య ఓ క్షణం కూతురి ముఖంలోకి చూశాడు.

"రవీంద్ర కులం మన కులం ఒకటి కాదు. చిన్నతనం నుంచీ నిన్ను తల్లిగా తండ్రిగా కూడా పెంచి పెద్ద చేశాను.''

"అవును డాడీ! సినిమాల్లోని హీరోయిన్స్‌కు కూడా సాధారణంగా తల్లి ఉండదు. తల్లి ఉంటే తండ్రి ఉండడు.''

"ఆ సినిమాలూ, పుస్తకాలే, నీకు వున్న మతిని కాస్తా పోగొట్టాయి.''

"అదిసరే నాన్నగారూ? తర్వాత డైలాగ్ చెప్పలేదు. నువ్వు రవీంద్రను వివాహం ఆడితే నీ మొహం కూడా చూడను అని అనబోతున్నారు కదూ?''

"లేదు!''

కల్పన తండ్రి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది. ఛా! ఏమిటి ఈ నాన్న! థ్రిల్ అంతా నాశనం చేశాడు.

"రవీంద్ర నువ్వూ వివాహం చేసుకోవడానికి నిర్ణయించుకున్నారా? నేను పాత భావాలు కలవాడినే కావచ్చును. కాని నీ జీవితం నీది. మీ ఇద్దరి వివాహానికి నాకు అభ్యంతరం లేదు. కాని వివాహం అయేంతవరకూ అలా చెట్టా పట్టా లేసుకుని పల్లెటూర్లో తిరగడం నాకు ఇష్టం లేదు. రవీంద్ర నాన్నగారిని కలుసుకుని మాట్లాడతాను.''

"ఓ మైగాడ్! అంతపని చెయ్యకండి!''

"అంటే?''

"రవీంద్రా నేను వివాహం చేసుకోవడం లేదు.''

శరభయ్య కల్పన ముఖంలోకి అయోమయంగా చూశాడు.

"ఆడపిల్లతో సరదాగా తిరుగుతాడా? వివాహం మాత్రం చేసుకోడటనా నీ ప్రియుడు?'' కోపంగా అన్నాడు శరభయ్య. మళ్ళీ అందుకున్నాడు.

"ఆడపిల్లని అల్లరి చేసి, పెళ్ళి చేసుకోనంటే వదుల్తానా? నలుగుర్లో పంచాయితీ పెట్టించి నీ మెళ్ళో తాళి కట్టించకపోతే ఈ శరభయ్య.....''

"ఓ డాడీ! పాపం రవీంద్రను ఏమీ అనవద్దు. తను పెళ్ళి చేసుకుందామనే అంటున్నాడు.''

"మరి? వాళ్ళ అమ్మా నాన్నా ఒప్పుకోవడం లేదని వంక పెడుతున్నాడా? ప్రేమించినప్పుడు అమ్మా నాన్నను అడిగే ప్రేమించాడా? వాడు వట్టి చవట, దద్దమ్మ అని నాకు ముందు నుంచీ తెలుసు. పిరికిపంద!'' పళ్ళు పటపటలాడించాడు శరభయ్య.

"నో డాడీ! నా మాట పూర్తిగా విను. రవిని ఏమీ అనకు. అతని తప్పేమీ లేదు.''

"ఆడవాళ్ళలోని ఈ బలహీనతనే అనాదిగా మగవాళ్ళు ఉపయోగించుకుంటున్నారు. ప్రేమించిన వాడు మంచివాడు. అలాంటి వాడు మరొకడు ఉండడు అనే అభిప్రాయం ప్రతి ప్రేమించిన ఆడపిల్ల అనే మాట.''

"అబ్బబ్బ! నేను చెప్పేది కొంచెం వింటావా? నేను నువ్వే అనుకుంటున్నట్టు మామూలు ఆడపిల్లను కాదు. నేనే చేసుకోకూడదు అనుకుంటున్నాను. ఆ మాట ఇంకా స్పష్టంగా రవితో చెప్పలేదు. పిచ్చివాడు తిప్పి తిప్పి చెబితే అదంతా తమాషా అనుకుంటున్నాడు. రవికి ఈ వార్త పిడుగు లాంటిదేనని నాకు తెలుసు. అయినా తప్పదు. ఇవ్వాళో రేపో చెప్పేస్తాను.''

శరభయ్య కూతురి ముఖంలోకి పిచ్చి చూపులు చూడసాగాడు.

కల్పన ముఖంలోకి భయం భయంగా చూడసాగాడు.

కల్పనకు మతి చలించలేదు గదా? చిన్నతనంలోనే పెద్దవాళ్ళలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడేది. ఇప్పుడు చిన్న పిల్లలా అర్థం పర్థం లేని మాటలు మాట్లాడుతున్నది. నిజంగానే కల్పనకు ఏదో అయింది. సైకియాట్రిస్ట్‌కు చూపించాలి.

"ఏమిటి నాన్నా అలా చూస్తావ్? ప్రేమించిన వాడిని పెళ్ళి చేసుకోవడం నాకు ఇష్టం లేదు.

---

ఇరాన్‌లో ఈ మధ్య పెద్ద విప్లవం చెలరేగడం మత నాయకుల చేతుల్లోకి రాజ్యాంగం మారడం అందరికీ తెలిసిన విషయమే. అలా మారిన తరువాత ఎన్నో మార్పులు జరిగాయి. జరుగుతున్నాయి.

ఇరాన్‌లోని విద్యామంత్రి శాఖ ఒక ప్రకటన జారీ చేసింది. ఆ ప్రకటన ప్రకారం వివాహమైన స్త్రీలు మామూలు పాఠశాలల్లో చేర్చుకోబడరుట.

ఇంతకీ అక్కడ చట్టం సమ్మతించిన వివాహ వయస్సు ఎంతో తెలుసా – పదిహేను ఏళ్ళు. సాధారణంగా పదిహేనో ఏడు రాగానే చాలా మందికి అక్కడ వివాహాలు జరిగిపోతాయిట. అందువల్ల వారిలో కొందరు ఆ తరువాత పాఠశాలల్లో విద్య నేర్చుకునేందుకు వెళుతూ వుంటారు.

వివాహమైన స్త్రీలు పాఠశాలలకు వెళ్ళడంవల్ల వివాహం కాని అమ్మాయిలకు 'సమస్యలు' వుత్పన్నమవుతున్నాయట.

"వీళ్ళేమో హాయిగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. తమ సంసార జీవితం గురించి, భర్తల గురించి వారి సమస్యల గురించీ, అవన్నీ కూడా పెళ్ళికాని అమ్మాయిలు తెలుసుకోవడం అంత మంచిది కాదు. అదీ అంత చిన్న వయస్సులో. అంతే కాదు. ఎంతోమంది కన్యల మధ్య ఓ పదిమంది గర్భిణీ స్త్రీలు పాఠశాలకి రావడం చూడటానికి ఏం బాగుంటుంది చెప్పండి'' అన్నారొక మంత్రిత్వశాఖ ప్రతినిధి.

అయితే వీళ్ళ కళ్ళు తుడవడానికా అన్నట్లు 'వివాహమైన స్త్రీలు ప్రత్యేకంగా ప్రారంభించబడిన పాఠశాలల్లో చదువుకోవచ్చు. ఆ తరవాత ప్రభుత్వం గుర్తింపు పొందిన విద్యాసంస్థ ద్వారా పరీక్ష రాసి వుత్తీర్ణులు కావచ్చు' అంటాడాయన.

అసలు 1976కి ముందు కూడా యిలా వివాహమైన యువతులను మామూలు పాఠశాలల్లో చేరనిచ్చేవారు కారు. కాని ఆ సంవత్సరం అప్పటి షా మహమ్మద్ రెజాపహ్లావి ప్రభుత్వం వీరు కూడా అవివాహిత స్త్రీలతో పాటు ఆ పాఠశాలల్లో చేరవచ్చునని ప్రకటించింది. భూమి గుండ్రంగా (ఉన్నదా?) వున్నదన్నట్లు యిప్పుడు యధాస్థితికి వచ్చారన్నమాట అక్కడి పాలకులు!

ప్రేమ పవిత్రమైంది. దాన్ని వివాహం పేరుతో నేలబారుకు తీసుకు రావడం నాకు ఇష్టం లేదు.''

''అయితే శుభ్రంగా ఆ కూచిపూడి సంబంధం కుదురుస్తాను. రవీంద్రతో మాత్రం ఇక తిరక్కు!''

''కూచిపూడి సంబంధమా? పూజారి కొడుకేనా? బుల్లి పూజారిలా ఉంటాడు.'' కిలకిల నవ్వింది కల్పన.

''ఇంగ్లీషు చదువుకోలేదన్న మాటేకాని వేద పఠనం అద్భుతంగా చెప్తాడు. శాస్త్రాలన్నీ కంఠో పాఠం.''

''పిలక జుట్టూ, పంగనామాలూ, మోకాళ్ళ వరకు ధోవతీ.... నేను కూడా కచ్చా పోసి చీర కట్టుకొని ఆండాళ్ళమ్మలా ఎంచక్కా తయారు కావొచ్చు!''

''నీ ధోరణి నాకేం నచ్చలేదు. ఇంతకీ ఎవర్ని పెళ్ళాడతావ్? ఊరంతా రవీంద్రతో తిరుగుతున్నట్టు తెలిసిపోయింది. చూస్తూ చూస్తూ ఎవడే నిన్ను పెళ్ళిచేసుకుంటాడు?'' కోపంతో ఊగిపోయాడు శరభయ్య.

అంతలో సిద్ధార్థ లోపలకు రావడంతో ఆ సంభాషణ ఆగిపోయింది.

''రా! సిద్ధూ! నేను ఈ ఊరు వచ్చి పదిహేను రోజులైంది. ఇవ్వాళా గుర్తొచ్చాను?'' అన్నది కల్పన నిష్ఠూరంగా.

''ఊళ్ళో లేను.''

''ఏమోయ్! ఈ మధ్య హైదరాబాద్‌లోనే ఎక్కువగా ఉంటున్నట్టున్నావ్?''

''అవును సర్! బిజినెస్ స్టార్ట్ చెయ్యబోతున్నాను.''

శరభయ్య బయటికి వెళ్ళిపోయాడు.

''రవీంద్ర బావున్నాడా? చూసి చాలాకాలం అయింది.''

''బాగున్నాడు. రోజూ వస్తూనే ఉంటాడు. కాని నిన్న ఏదో ఇంటర్వ్యూ ఉందని విజయవాడ వెళ్ళాడు.''

''ఐసీ!'' అన్నాడు సిద్ధార్థ ఏదో ఆలోచిస్తూ.

''ఏం జలసీగా ఉందా?''

''జలసీయా? నాకా? ఎవర్ని చూసి? నిన్నా లేక రవీంద్రనా?''

''ఇద్దర్నీ!''

''అవును మీ ఇద్దర్నీ చూస్తుంటే నాకు రవీంద్ర మీద జాలిగా ఉన్నది.''

''ఎందుకూ?''

''రవీంద్ర నిన్ను ప్రేమిస్తున్నాడు. నిన్ను పెళ్ళాడాలని కలలు కంటున్నాడు. కాని నీ తత్త్వం నాకు తెలుసు. నువ్వు రవీంద్రను పెళ్ళి చేసుకోవు.''

''నీ కెలా తెలుసూ?''

''నేను ఊహించగలను.''

''నువ్వు చాలా తెలివైనవాడివి. అర్థం చేసుకున్నావ్. రవీంద్రకు ఆ విషయం ఎన్నోసార్లు ఇన్‌డైరెక్టుగా చెప్పాను. అయినా అర్థం చేసుకోడు. పూర్ ఫెలో!'' అన్నది కల్పన.

''నిన్ను చూసినా నాకు జాలిగానే ఉంది.''

''నన్నా?''

''అవును! నీ గురించి నువ్వు చాలా అపోహల్ని పెంచుకున్నావ్. సెల్ఫ్‌లౌ మోతాదు మించిపోయింది. నీకేం కావాలో నీకే తెలియదు.''

''నన్ను అవమానిస్తున్నావ్!''

''నిన్ను అవమానించాలని నా ఉద్దేశంకాదు. నిన్ను బాధపెట్టాలనీ కాదు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఆ మాట ఇంతకుముందెప్పుడూ చెప్పలేదు. ఇవ్వాళ తేల్చుకోవాలని వచ్చాను. నన్ను పెళ్ళిచేసుకుంటావా?''

కల్పన తృళ్ళిపడి సిద్ధార్థ ముఖంలోకి చూసింది.

''ఇష్టంలేకపోతే చెప్పెయ్!''

''ఇష్టంలేదని చెబితే....''

''బాధపడతాను, కొద్ది కాలం! అంతేగాని నువ్వు చిన్నప్పుడు ఇచ్చిన నెమలి ఈకల్ని జేబులో పెట్టుకొని ఏడుస్తూ పిచ్చివాడిలా తిరగను. హాయిగా పెళ్ళి చేసుకుంటాను.'' సిగరెట్ పొగను విలాసంగా కల్పన ముఖంమీదికి ఊదాడు.

''సారీ'' అన్నాడు నవ్వుతూ.

కల్పనకు వెంటనే ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. అతని వ్యక్తిత్వంలో రవీంద్రలో లేని చొరవ, తెగింపు కన్పించాయి.

''నువ్వు రవీంద్రను వివాహం చేసుకోదలిస్తే నేను మధ్యలోకి వచ్చి విలన్ పాత్ర ధరించను. హాయిగా పెళ్ళి పెత్తనం చేస్తాను.''

ఏమిటి ఇతని తత్త్వం? మాటల్లో నిర్లక్ష్యం! ప్రపంచంతో నాకేం పని అన్నట్టు కన్పించే ధీమా....

''ఏమిటి ఆలోచిస్తున్నావ్. నువ్వు రవీంద్రను చేసుకోవని నాకు తెలుసు. నీకు సుఖం కావాలి. కార్లు కావాలి. పెద్ద బంగళా కావాలి. ఆకాశంలో గాలిమేడలు కట్టడానికి బోలెడంత తీరిక కావాలి.''

''అవన్నీ నీ దగ్గిర ఉన్నయ్యా!''

''ఇవన్నీ ఏర్పాటు చేసేంత డబ్బు మా నాన్న దగ్గిర ఉన్నది. కాని నిన్ను పెళ్ళిచేసుకుంటే మా నాన్న చిల్లిగవ్వకూడా ఇవ్వడు.''

''మరి అవన్నీ ఎలా అమరుస్తావ్?''

''నేను సంపాదించగలననే ఆత్మ విశ్వాసం నాకుంది.''

''నా కోసం మీ నాన్ననూ, అంత ఆస్తినీ త్యాగం చేస్తావా?'' కళ్ళు మెరిపిస్తూ అడిగింది.

సిద్ధార్థ పకపక నవ్వాడు.

''త్యాగమా? పిచ్చి త్యాగాలలో నాకు నమ్మకం లేదు. నువ్వంటే నాకు ఇష్టం! పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. నీ కిష్టం అయితే చేసుకుంటాను. ఆస్తి విషయం అంటావా? మా నాన్నకు నేను ఒక్కణ్ణే కొడుకును. చూస్తూ చూస్తూ ఆ ఆస్తిని బయటి వాళ్ళకు పోనివ్వడు. కొద్దిరోజులు కొత్త డబ్బుకు ఇబ్బంది పడ్తాను. అంతే!''

రవీంద్రలో కంటే సిద్ధార్థలోనే న్యాయంగా హీరో లక్షణాలు ఉన్నాయి.

''నీ కిష్టమేనా!''

''ఏమిటి?''

''నన్ను చేసుకోవడం!''

''ఆలోచించుకోవడానికి టైం ఇవ్వు!''

''ఓ కే! ఎన్ని రోజులు కావాలి''

''ఒక్కరోజు చాలు. రేపు చెబుతాను.''

''గుడ్. వస్తాను.'' అంటూ వెళ్ళిపోయాడు సిద్ధార్థ.

కల్పన ఆ రాత్రి అంతా ఆలోచిస్తూనే గడిపింది.

సిద్ధార్థలో ఉన్న ఠీవి రవీంద్రలో లేదు! తను సిద్ధార్థను ప్రేమించడం లేదు. రవీంద్రను ప్రేమిస్తున్నది. తన ప్రేమ అతి పవిత్రమైనది. ప్రేమను తను ఒక ఉన్నత ఆసనం మీద కూర్చోబెట్టి పూజిస్తుంది.

పవిత్ర ప్రేమకు శరీరంతో పనిలేదు.

తన ప్రేమ రాధ ప్రేమ!

తన ప్రేమ మీరాబాయి ప్రేమ! మీరా గుండెల్ని బద్దలు చేసుకుంటూ వెలువడిన ఆ విరహ గీతాలు నేటికీ వింటుంటే చిత్రమైన అనుభూతి కలుగుతుంది. తనూ మీరాలా తపించి పాడుతుంది. ఆ బాధ నుంచి, ఆ ఆవేదననుంచి, ఆ ఆర్తి నుంచి వెలువడే ప్రతి అక్షరం ఒక మధురగీతం

అవుతుంది. తన గీతాలు హృదయాల్ని ద్రవింప జేస్తాయి.

మీరాలా తను కూడా, పవిత్ర, శుద్ధ, అమలిన నిశ్చల ప్రేమమూర్తిగా మారి విరహ గీతాలను ఆలాపించాలి!

అవును! తను సిద్దార్థనే వివాహం చేసుకోవాలి.

రవీంద్ర పాపం - బాధపడ్తాడు. ఏడుస్తాడు. తనను తిట్టిపోస్తాడు. మోసం చేశావంటాడు. అతని బాధ చూసి తనూ బాధపడుతుంది. రవీంద్ర కోసం జీవితమంతా విలపిస్తుంది.

రవీంద్ర తనను అర్థం చేసుకోలేడు!

## 8

శరభయ్యకు సిద్దార్థను కల్పన వివాహం చేసుకోవడం ఇష్టం లేదు.

సిద్దార్థ తండ్రి కూడా మళ్ళీ గడపలో అడుగు పెట్టవద్దు అన్నాడు.

ఆరోజు రవీంద్ర మహా ఉత్సాహంగా వచ్చాడు.

"రా! రవీ! నీ కోసమే చూస్తున్నాను. ఒక ముఖ్యమైన విషయం నీతో చెప్పాలి."

"మన వివాహం విషయమేనా!"

"నా వివాహం విషయం"

"అంటే?"

"నేను సిద్దార్థను పెళ్ళి చేసుకోబోతున్నాను."

"అన్ని వేళలా తమాషాలు రుచించవు."

"నేను తమాషా చెయ్యడం లేదు. నిజంగానే చెబుతున్నాను."

రవీంద్ర ముఖం వెలా తెలా పోయింది.

కల్పన ముఖంలోకి వెర్రివాడిలా చూశాడు.

అతని ముఖంలోకి చూస్తుంటే కల్పనకు ఏడుపు వస్తోంది.

"మీ నాన్న నిర్ణయమా?" ఎలాగో అనగలిగాడు.

"కాదు. నా నిర్ణయమే!"

"సిద్దార్థను ప్రేమిస్తున్నావా?"

"లేదు."

"అతని డబ్బును ప్రేమిస్తున్నావా?"

"ఏమో చెప్పలేను."

"చాలా సంతోషం! కంగ్రాచ్యులేషన్స్ వస్తాను!" లేచి నిల్చున్నాడు.

### చిట్టికథలు

లోగడ 'వనిత'లో మీరు 'చిట్టికథలు' పేరిట ఎన్నో కథలు చదివారు. ఆ కోవలో మీరు కూడా చిట్టికథలు రాసి పంపడానికి ప్రయత్నించకూడదూ?—

కథలు రాయాలని ఉత్సాహపడేవారు ఏ చిన్న సంఘటననయినా తీసుకుని 'చిట్టి కథ'గా రాయవచ్చును; కథలు రాయడం మీద తమకు గల ఉత్సాహాన్ని పెంపు చేసుకోవచ్చును.

తావు సైజులో పేజీన్నరకు మించకుండా వుండే మీ చిట్టికథ ఏమాత్రం బాగున్నా సవరించి, ప్రచురించడానికి 'వనిత' సిద్ధంగా వుంది.

ప్రచురించి చిట్టి పారితోషికం కూడా పంపుకుంటుంది!

మరి, ప్రయత్నించండి!

కల్పన దిగులుగా నవ్వింది.

"నా పెళ్లికి వస్తావు గదూ?"

"ఎందుకు రానూ వస్తాను! పెత్తనం కూడా చేస్తాను."

మరో మాటకు అవకాశం ఇవ్వకుండా గబగబా వెళ్ళిపోయాడు రవీంద్ర.

కల్పన నిట్టూర్చింది. నిరాశపడింది. ఇదేమిటి? ఇంత తేలిగ్గా తీసుకున్నాడు!

"నువ్వు లేకుండా నేను బతకలేను." అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంటాడనుకుంది.

అలా కళ్ళనీళ్ళు పెట్టుకొన్న అతని గుండెల మీద వాలిపోయి బావురుమనాలనుకుంది. తననూ, తన ప్రేమను అర్థం చేసుకోమని బ్రతిమాలాలనుకుంది!

కాని....కాని....

ఏమిటి రవీంద్ర అంత తేలిగ్గా తీసుకున్నాడు!

తేలిగ్గా తీసుకోలేదు. ఆ ముఖంలో విషాద ఛాయలు స్పష్టంగా కన్పించాయి.

ఆ కళ్ళలోని వెలుగును చీకటి పొరలు కప్పేశాయి. అందుకే వెంటనే వెళ్ళిపోయాడు.

ఇంటికి వెళ్ళి గది తలుపులు మూసుకొని బావురుమని ఏడుస్తాడేమో!

అలా ఊహించగానే కల్పన కళ్ళలో నీరు తిరిగింది.

సిద్దార్థ కల్పనా దండల పెళ్లి చేసుకున్నారు. శరభయ్య చివరి నిముషంలో మౌనం వహించాడు. సిద్దార్థ తండ్రి తమ్మినాయుడు మాత్రం వెర్రి ఆవేశంతో ఊగిపోయాడు. పెళ్ళికి రాలేదు. వధూవరులను ఇంటికి ఆహ్వానించలేదు.

మూడోరోజు కల్పన భర్తతో హైదరాబాద్ బయల్దేరింది. ఒక్కసారి రవీంద్రను చూడాలనే కోర్కె కలిగింది. పక్కింటి రాముచేత కబురు పంపించింది. కాని రవీంద్ర రాలేదు.

కల్పన ముఖంలో విషాదం కొట్టవచ్చినట్టు కన్పించసాగింది.

"రవి కనీసం వీడ్కోలు ఇవ్వడానికైనా వచ్చాడేమో చూశావా!" అన్నది భర్తతో.

సిద్దార్థ భార్య కళ్ళలోకి చూశాడు.

"రవీంద్ర నువ్వు ఊహించినంత వెన్నెముక లేనివాడు కాదు. పాపం....నువ్వు బయలుదేరి వెళ్తుంటే "ఓదూర్ జానేవాలీ" అంటూ పాట పాడతాడనుకున్నావా?"

కల్పన మాట్లాడలేదు.

హైదరాబాద్‌లో చిన్న అద్దె ఇంట్లో కాపరం పెట్టారు. కొంతకాలం ఆర్థికంగా ఇబ్బందిపడ్డారు. సిద్దార్థకు మంచి స్నేహితులు ఉన్నారు. పౌల్ట్రీ ఫారంతో వ్యాపారం ప్రారంభించాడు.

కల్పన హైదరాబాద్ చేరిన కొత్తలో రవీంద్రకు ఉత్తరం రాసింది. దానికి సమాధానంగా రవీంద్ర శరీరం, మనసూ వేరుకాదనీ, పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోక శరీరం ఇచ్చినవాడికే మనసు కూడా ఇవ్వమన్నాడు. ఆమె ప్రేమ ఒక రకమైన ఉన్మాదం అన్నాడు. అది చదివి కల్పన చాలా బాధపడింది.

ఆ రాత్రి భర్తకు ఆ ఉత్తరం చూపించింది. సిద్దార్థ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా ఉండిపోయాడు. ఆ రాత్రి ఆమెతో పెద్దగా మాట్లాడలేదు.

కల్పన అతని దృష్టికి పసిపిల్లలా కన్పిస్తుంది. మానసికంగా పెరగని మనిషి అనుకున్నాడు. కొద్ది రోజులు పోతే తనే మారిపోతుంది అనుకున్నాడు. సిద్దార్థ కల్పన బాధపడటం చూడలేడు. అందుకే అతనికి నచ్చని పని చేసినప్పుడు, తన కోపాన్ని మౌనంతో వ్యక్తం చేస్తాడు.

# 9

సిద్ధార్థ తండ్రి గుండెపోటుతో అకస్మాత్తుగా చనిపోయాడు. ఇద్దరూ ఊరు చేరుకున్నారు. తండ్రి ఆస్తి అంతా సిద్ధార్థకే రాశాడు. ఆ ఆస్థి అతని స్వార్జితం.

కల్పన పుట్టింటికి వచ్చింది. రవీంద్ర గురించి వాకబు చేసింది. అతను విజయవాడలో ఉద్యోగం చేస్తున్నాడనీ, ఆ ఊళ్ళో ఉన్న ఇల్లు అమ్మేసి తల్లీ, తండ్రిని కూడా తీసుకెళ్ళాడనీ తెలిసింది. కల్పన విజయవాడ వెళ్ళి రవీంద్రను చూడాలనుకుంది.

కాని భర్తతో ఆ విషయం చెప్పడానికి జంకింది.

సిద్ధార్థ అతని కాలంలోనే హైద్రాబాద్‌లోని ప్రముఖ పారిశ్రామిక వేత్తల్లో ఒకడుగా గుర్తింపు తెచ్చుకున్నాడు. ఎప్పుడూ ఎక్కడో పార్టీ జరుగుతుంటుంది. కల్పనను వెంటబెట్టుకొని వెళ్ళేవాడు. వాళ్ళిద్దర్నీ చూసి కొందరు ఈర్ష్యపడేవారు. కొందరు 'ముచ్చటైన జంట' అనేవారు.

కల్పన పరిచయాలు పెరిగాయి. ఒకరిద్దరు రచయిత్రులతోనూ, చిత్రకారులతోనూ పరిచయం కలిగింది.

కల్పన తనను గురించి ఆలోచించుకోసాగింది. "మిసెస్ సిద్ధార్థ" అంటే కేవలం ఒక ధనికుడి భార్యగానే తను గుర్తించబడడం బాధగా ఉంది. నవలను రాయడం మొదలుపెట్టింది. రెండు నవలలు తిరిగివచ్చాయి. కల్పన బాధ చూసి సిద్ధార్థ తనే ఆ నవలలను అచ్చు వేయించాడు. దారుణమైన రివ్యూలు వచ్చాయి. కట్టలు కట్టలు ఒక గదిలో పుస్తకాలు పడి ఉన్నాయి. తన మిత్రులందరికీ పంచిపెట్టింది. అయినా స్టాక్ కదలడం లేదు. ఇంకా బోలెడన్ని ఉండిపోయాయి. "మూగవీణ" "చితికిన గుండెలు" ఆ నవలల పేర్లు.

ఏజెంట్లు మళ్ళీ పుస్తకాలు కావాలనడం లేదు. ఉన్న స్టాకే కదలడం లేదని చెప్పారు. సిద్ధార్థ ఆ నవలలు చదివాడు. చాలా పిచ్చిగా ఉన్నట్లు అనిపించాయి. అయినా ఆ మాట భార్యతో అనలేదు. ఆ రెండు పుస్తకాలూ వచ్చాక స్నేహితుల మధ్య, పార్టీలలో "మిసెస్ సిద్ధార్థ, రచయిత్రి" అని పరిచయం చేస్తుంటే మనసు జపాన్ రబ్బరు బంతిలా ఎగిరెగిరిపడేది.

ఆమెకు మిసెస్ రాజు అంటే ప్రత్యేకమైన అభిమానం. మిసెస్ రాజు ఏభై దాటినా పదహారేళ్ళ పిల్లలా డ్రెస్ చేసుకుంటుంది. మిసెస్ రాజుకు కల్పనను చూస్తే జలసీ. అయినా ఎంతో ఆత్మీయతను ప్రదర్శిస్తుంది.

సిద్ధార్థకు మిసెస్ రాజు అంటే ఇష్టం ఉండదు. ఎక్కువగా మాట్లాడడు. అతని మీద మిసెస్ రాజుకు చాలా కోపం. కల్పన వగటికలల్లో బ్రతికే మనిషి అని ఆమెకు తెలుసు.

"కల్పన! ఇంత అందంగా ఉన్నావుగదా? సినిమాలలో ఎందుకు చేరకూడదు?" అడిగింది మిసెస్ రాజు

"ఆయన ఒప్పుకోరు!"

"ఏ మొగుడూ ముందు ఒప్పుకోడు. భార్య అంటే వాళ్ళదృష్టి దుకాణంలో కొని ఇంట్లో అలంకరణగా పెట్టే బొమ్మ" అన్నది మిసెస్ రాజు.

"ఛ! అదేం లేదు. ఆయన నన్ను చాలా బాగా చూస్తారు," అన్నది.

ఆ రోజు నుంచి తను పెద్ద సినిమా హీరోయిన్ అయిపోయినట్టు కలలు కనసాగింది.

ఒక రోజు మధ్యాహ్నం ఒక యువకుడ్ని వెంటబెట్టుకొని వచ్చింది మిసెస్ రాజు.

"ఇతని పేరు మురళి. నాకు వేలువిడిచిన మేనమామకొడుకు. సినిమా ప్రొడ్యూసర్. ఏదో పని మీద వస్తే ఇక్కడకు తీసుకొచ్చాను. తీయబోయే సినిమాకు కొత్త హీరోయిన్ కావాలట. మీ. హీరోయిన్లకంటే అందమైన అమ్మాయిని చూపిస్తాను రమ్మని తీసుకొచ్చాను." గుక్క తిప్పుకోకుండా మాట్లాడేసింది మిసెస్ రాజు.

మురళి కన్నార్పకుండా కల్పనను చూస్తుంటే ఆమె ఎలాగో అనిపించింది.

"కూర్చోండి!" అని ఆహ్వానించింది.

కల్పన కూర్చుంది. అతని ఎదురుగా ఇబ్బందిగా కూర్చుంది. అతని చూపులు చిరాకును కల్గిస్తున్నాయి. మరోవైపు విచిత్రమైన ఆనందానుభూతి కలుగుతోంది. ఆమెకు చేతులు ఎలా పెట్టుకోవాలో తెలియనట్టు ఇబ్బందిపడసాగింది. ఎడంచేతి వాచీకి కీ ఇచ్చింది. కుడిచేతి గాజుల్ని పైకి కిందకూ తిప్పుతూ కూర్చుంది.

"ఎలా ఉంది? హీరోయిన్‌గా పనికి వస్తుందా?"

"అద్భుతం! ఈనాడే నిజమైన అందాన్ని చూశాను." అన్నాడు.

కల్పన ఇబ్బందిగా ముఖం పెట్టింది.

వంటింట్లోకి వెళ్ళి కాఫీ ఫలహారాలు చెయ్యమని వంటమనిషికి పురమాయించింది. వచ్చి కూర్చుంది.

"నీ సినిమాలో హీరోయిన్‌గా తీసుకుంటావా!"

"ఆమె అంగీకరిస్తే అది నా అదృష్టంగా భావిస్తాను."

"ఆయన ఒప్పుకోరు." చిన్నగా సన్నగా అన్నది.

"మరీ పాతకాలం మాటలు మాట్లాడకు. నీలాంటి సౌందర్య రాశి, మామూలు ఆడదానిలా నాలుగు గోడల మధ్య బ్రతకడం ఏమిటి? పైగా నువ్వు రచయిత్రివి కూడా. నీకు ప్రపంచం తెలియదు. ఇప్పుడిప్పుడే నలుగురి మధ్యకు రావడం నేర్చుకున్నావ్. స్త్రీ అంటే పంచదార చిలక కాదు. ఇష్టం అయినవాడు నోట్లో వేసుకోవడానికి. స్వతంత్రంగా బ్రతకటమంటే ఏమిటో నీకు తెలియదు. స్త్రీల అధికారాల గురించిన ఆలోచనలే నీకు రావు. పిల్లల్ని కనడానికీ, భర్త కోరిక తీర్చడానికి మాత్రమే స్త్రీ జన్మించింది అనుకునే రోజులు పోయాయి. నీ జీవితానికి ఓ అర్థం ఏర్పరచుకో! నీ సౌందర్యాన్ని సార్థకం చేసుకో. ఆ భగవంతుడు నీ కిచ్చిన అంత అందం నాకు ఇవ్వలేదు. లేకపోతే ఈపాటికి ఆంధ్రుల అభిమాన హీరోయిన్ అయి ఉండేదాన్ని."

"మీరు రచనలు కూడా చేస్తారుట. నవలలు ఏమైనా అచ్చు అయ్యాయా?"

"ఆ! రెండు నవలలు వచ్చాయి. కాపీలు మురళికి ఇవ్వు." అన్నది మిసెస్ రాజు.

కల్పన చివ్వున లేచి వెళ్ళి రెండు పుస్తకాలూ తెచ్చి ఇచ్చింది.

"అద్భుతం! పేర్లే ఇంత బాగున్నాయి. "మూగవీణ" అద్భుతం. ఇంతవరకు మేము కథ నిర్ణయించుకోలేదు. మీరు యాక్టు చేస్తానంటే మీ నవలే సినిమా తీస్తాను."

కల్పన నమ్మలేనట్టు అతని ముఖంలోకి చూసింది. కాని కాంక్షను కక్కుతున్న ఆ చూపుల్ని ఎదుర్కోలేక తన చూపుల్ని మరల్చుకుంది.

తన నవల సినిమా తీస్తాడు. హీరోయిన్ తనేనా? తన నవలలోని హీరోయిన్‌గా తనే నటించడం! ఇంతవరకు సినీ ఫీల్డులో ఇలాంటి అద్భుతం జరగలేదు.

"ఏమిటండీ అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు! ఇప్పుడు ఈ ఫీల్డులోకి మంచి గౌరవంగల కుటుంబాలవాళ్ళు ఎందరో వచ్చారు, వస్తున్నారు." అన్నాడు కల్పన కళ్ళలోకి లోతుగా చూస్తూ.

వాకిట్లో కారు ఆగిన శబ్దం వినిపించింది.

"ఆయన వచ్చినట్టున్నారు" కొంచెం గాభరా పడుతూ అన్నది కల్పన.

కల్పనకు భర్త వాలకం తెలుసు.

ఆమె భయం అల్లా మిసెస్ రాజును ఏదైనా అని అవమానిస్తాడేమోనని.

సిద్ధార్థ లోపలకు వచ్చాడు. అందరూ లేచారు. కల్పన ఆ యువకుణ్ణి పరిచయం చేసింది. సిద్ధార్థతో చేయి కలపడానికి మురళి చెయ్యి ముందుకు చాచాడు. సిద్ధార్థ చెయ్యి కలపలేదు. ఓ క్షణం అతన్ని ఆపాదమస్తకం పరికించి చరచర లోపలకు వెళ్ళాడు.

"నీ భర్తకు కనీస మర్యాద కూడా తెలియదు." అన్నది మిసెస్ రాజు.

"సారీ!" అంటూ మురళికి క్షమాపణ చెప్పుకుంది.

"దానికేంలెండి. మా సినిమావాళ్ళకు ఇలాంటివి అలవాటేలెండి." నవ్వుతూ అన్నాడు మురళి.

ఇద్దరూ వెళ్ళిపోయారు.

పోతూ పోతూ బాగా ఆలోచించుకోమని బోధించి మరీ వెళ్ళారు.

కల్పన సుడిగాలిలా భర్త గదిలోకి వెళ్ళింది.

"అంత గర్వం పనికిరాదు."

"గర్వించే అర్హత కొందరికే ఉంటుంది."

"నీ కుసంస్కారాన్ని బయటపెట్టుకున్నావ్. నాకు తల కొట్టేసినట్టు అయింది."

"థ్యాంక్యూ ఫర్ యువర్ రిమార్క్" నిర్లక్ష్యంగా అని సిగరెట్ ముట్టించాడు.

"నా నవల సినిమాగా తీస్తాడట!"

సిద్ధార్థ ఆశ్చర్యంగా కల్పన ముఖంలోకి చూశాడు.

"ఏమంత ఆశ్చర్యంగా చూస్తావ్? నీ దృష్టిలో నేను ఒక రచయిత్రినే కాను. అందుకు నేను విచారించను."

"ఎవడా పిచ్చివాడు? నీ నవలను సినిమా తీస్తానన్నవాడు?"

"మురళి."

"అతనెవరు?"

"ఇప్పుడేగా పరిచయం చేశాను!"



సి. సుజాత

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ఇటీవల తెనాలిలో జరిగిన ఉత్సవాలలో - తన కూచిపూడి నాట్య ప్రదర్శనతో ప్రేక్షకులని మంత్రముగ్ధులను చేసింది తొమ్మిదేళ్ళ బాలిక సుజాత.

ప్రముఖ కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ చింతా రాధాకృష్ణమూర్తి వద్ద నృత్యం అభ్యసించిన సుజాత విజయవాడ, నర్సారావ్‌పేట, గుంటూరు తదితర ప్రాంతాలలో పలు నాట్య ప్రదర్శనలు యిచ్చి అందరి మన్ననలు అందుకున్నది.

"ఓ అతనా? ఏ నవల కావాలన్నాడు?"

"రెంటిలో నేను ఏది తియ్యమంటే అదే తీస్తానన్నాడు."

"నేను నమ్మను. ఇందులో ఏదో తిరకాసు ఉంది. నీ నవలకోసం అతను నిన్ను వెతుక్కుంటూ వచ్చాడంటే నాకు నమ్మకంలేదు. ఆ మిసెస్ రాజు నీ సౌందర్యం గురించి వర్ణించి అతన్ని ఊరించి ఉంటుంది. పాపం! సినిమావాడు కదా? చూద్దాం! పిట్ట వలలో చిక్కుతుందేమోనని వచ్చి ఉంటాడు."

"నువ్వు మరీ దారుణంగా మాట్లాడుతున్నావ్. అతను వచ్చింది నిజంగా నేను ఎంత సౌందర్యవతినో చూడాలనే కాని నువ్వు భావించినట్టు కాదు. అతను సినిమా తీస్తాడట. నన్ను హీరోయిన్‌గా తీసుకుంటానన్నాడు. నా నవలే సినిమా తీస్తాననీ, నేను సృష్టించిన హీరోయిన్‌గా నేనే యాక్టు చెయ్యాలనీ కోరుతున్నాడు." కల్పన కలల్లో తేలిపోతూ అన్నది.

"అందుకు నువ్వేమన్నావ్?"

"నువ్వు ఒప్పుకోవని చెప్పాను."

"వాళ్ళేమన్నారు?"

"అది నీకు అనవసరం! నాకు సినిమాల్లో నటించాలని ఉంది."

"నటించు!"

"నిజంగా?" ఆశ్చర్యంగా అడిగింది.

"నా భార్యగా ఉన్నంతకాలం కాదు. ముందు విడాకులు తీసుకో! ఆ తర్వాత నీ ఇష్టం!"

కల్పన కళ్ళలో నీరు తిరిగింది.

కల్పన సినిమాలో వేషం వెయ్యాలనే ఆలోచన వొదులుకుంది. అలా గొప్ప ఛాన్సు వదులుకోవడంలో తను తన భర్త కొరకు పెద్ద త్యాగం చేసినట్టు భావించింది.

తన జీవితమంతా త్యాగాలపుట్ట! ప్రేమ కోసం ప్రియుణ్ణి వదులుకుంది. సిద్ధార్థ తనను ప్రేమిస్తున్నాడు కనక అతన్ని వివాహం చేసుకుంది.

భార్యగా భర్తకోసం తనకు లభించిన గొప్ప అవకాశాన్ని త్యాగం చేసింది.

తన జీవితమే నవలగా రాస్తే అద్భుతమైన పవిత్రప్రేమ కథ అవుతుంది. పాఠకులు ఆవురావురుమని చదువుతారు. ఆ దెబ్బతో తను ప్రముఖ రచయిత్రుల జాబితాలో పడిపోతుంది.

ఆ రాత్రే ఒక నవల ప్రారంభించింది.

[ నశేషం ]

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

'బ్రాహ్మాదేవి'

## 'అవ్వయ్యారు'

తమిళ సాహిత్య ప్రియులు ప్రాచీన కాలంలోనే జాగ్రత్తపడ్డారు. తమ తమ కాలాలలో ప్రచారంలో ఉన్న సాహిత్య రచనల్ని సంపుటీకరించి భద్రపరచి ప్రచారం చేశారు. ఇట్లా ప్రచారం చేసిన ప్రాచీన కాలపు సాహిత్య ప్రియులలో ముఖ్యంగా చెప్పవలసినవారు మధురలో వుండిన 'సంగమ్' అను సాహిత్య పరిషత్తువారు. 'తమిళ్ సంగమ్' అను పదం మధురలోని తమిళ పరిషత్తుకే చెల్లుతుంది.

మూడు సంగములు మధురలో ఒకదాని వెనుక ఒకటి కొన్ని సంవత్సరాల వ్యవధితో వర్తిల్లినట్లు చరిత్ర. మొదటి రెండు సంగములనాటి



ప్రాచీన రచనలు నేడు ఉపలభ్యమగుటలేదు. నేడు ప్రాచీన తమిళ రచనలనదగ్గ గ్రంథజాలమంతా మూడవ సంగము (క్రి. శ. 2వ శతాబ్ది వరకు) కాలం నాటిదే.

మూడవ సంగకాలం నాటి మహారచనలను చేసిన వారిలో మహాకవయిత్రి అవ్వయారు ప్రసిద్ధురాలు. ఈమె మహాకవులైన కపిలర్, భరణరులకు సమకాలికురాలు. ఈమె రచనలు చాలవరకు లభిస్తున్నా కూడా - యీమెను గురించిన వివరాలు మాత్రం అతి స్వల్పంగా లభిస్తున్నాయి. ఆమె జన్మస్థలం గురించి, వంశం గురించి సరియైన కాలం గురించి ఏమీ తెలియడం లేదు.

తమిళనాడులో కొంత ప్రాంతానికి రాజుగా వున్న అదియమానుని ఆస్థానమున అవ్వయారు కవయిత్రిగా వుండేదని స్పష్టంగా తెలుస్తున్నది. అయితే ఈమె చోళ, చేర, పాండ్య రాజ్యములలో - ఇతర ప్రభువుల ఆస్థానములలో మిక్కిలి గౌరవింపబడినది. ఈమె కవితలో అసామాన్య విజ్ఞానము, సమయస్ఫూర్తి పరిస్ఫుటములై సమకాలికులచేత మాత్రమేగాక నేటికిని ఘన గౌరవం పొందేటట్లు చేశాయి.

విభిన్న సమర్థతలు కల మనుజులతో, విభిన్న సాంఘిక స్థితిగతులకు చెందినవారితో - యీమెకు గల పరిచయం - ఆ సందర్భాల్లో యీమె కవితలో ప్రదర్శించిన తీరు - పరిశీలించగా యీమెకు సర్వ మానవుల మీదా మిక్కిలి దయ, సానుభూతి కలవని తోస్తున్నది.

అవ్వయ్యారు కృతులు అసంఖ్యాకములు. ఈమె రచించిన పద్యకథలలోని వాక్యాలు తమిళ దేశంలో సామెతలై - ప్రతి నోట నేటికిని నిలచివున్నాయి. ప్రాచీన తమిళ వాఙ్మయంపై వ్యాఖ్యాన గ్రంథములలో యీమె చెప్పిన కవితావాక్యములను ప్రమాణములుగా ఉదహరించడం పరిపాటి. తమిళనాడున ఇంటింట యీమె నిత్యస్మరణీయురాలు.

ప్రభువులకు, ప్రజలకు, ఆమె చెప్పిన సమాధానాలు పదునుగా - నిశిత రమణీయంగా ఉదాత్తంగా వుండి - యీనాటి రాజకీయ వాతావరణానికి కూడా సముచితంగా వుంటాయి.

మూడవ సంగకాలం నాటి తమిళ సాహిత్య సంకలనములలో నట్రినై, కురుంతొగై, పురనానూరు, అహనానూరు అనువాటియందీమె పద్యాలు వున్నాయి. ఈమె పద్యాలు ప్రాచీన తమిళ ఛందస్సులలో వున్నవి.

'అవ్వయారు' అను పేరుతో మరొక కవయిత్రి క్రి. శ. 12వ శతాబ్దికి చెందిన ఆమె కూడా వున్నది. ఒట్టకూత్తర్, పుహళేంది, అను వారికి రెండవ అవ్వయ్యారు సమకాలికురాలు. ఈ రెండవ అవ్వయ్యారు ఆత్తిచ్చుడి, కొన్రై వేందన్, మూదురై, నల్వళి అనుకృతులు రచించినది. ఈ కృతులలోని శైలి, ఛందస్సు మొదటి అవ్వయారు రచనలకంటె భిన్నంగా వున్నాయి. అయితే అవ్వయ్యారు ఒక్కతేయనీ, అన్ని కృతులు ఆమె రచించినవే అనీ భావించేవారు కూడా వున్నారు.

తన సమకాలికుడైన కపిలర్ కవిని అవ్వయ్యారు పవిత్రాంతఃకరణ కలవాడని ప్రశంసించినది. ఆమెకు సమకాలికురాలైన వెల్లవీధియారు అను ఒక కవయిత్రి దారిద్ర్యంచేత కష్టపడుతుండగా అవ్వయారు చాలా సాయం చేసింది.

అదియమాన్ తన ఆస్థాన కవయిత్రి అవ్వయ్యారు కొక ఉసిరిపండిచ్చాడు. అది ఎన్నో సంవత్సరాలు చెట్టు మీద పండినది. దానిని తిన్న వారికి దీర్ఘాయువు కలుగుతుందట. మహాకవయిత్రి చాలాకాలం బతికి వుండాలని ఆమెకిచ్చాడట. తిన్న తరువాత ఆమెకు దాని సంగతి తెలిసి "లోకరక్షణార్థము హాలాహలమును భక్షించిన పరమశివుడు చిరంజీవియైనట్లే నీవునుకమ్ము" అని ప్రభువును దీవించినది. అతడును చిరంజీవియైనాడు. ఈ విషయమునకు సంబంధించిన పద్యములు 'పురనానూరు' సంకలనమునందున్నవి.

తొండైమానుడను ప్రభువు అవ్వయ్యారుకి తళతళలాడు తన ఆయుధాల ప్రదర్శనశాల చూపించాడు. ఆమె ఒక పద్యంలో అతనిని ఆక్షేపిస్తూ "తొండైమానుని ఆయుధములు రణరంగమున ఉపయోగింపబడుటచేత ఇంత తళతళలాడుట లేదు. అవి విరిగినను కొలిమికి పంపబడుటలేదు" అన్నదామె. తొండైమానుడు పిరికిపందయనీ అతని ఆయుధాలు క్రొత్త రంగు చెడకుండ ప్రదర్శనశాల యందున్నాయే కాని రణరంగంలో ఉపయోగింపబడుటలేదని ఆమె భావం.

ఆమె రచనలలో సమయోచితమైన పరిపూర్ణమైన ప్రజ్ఞ, అతి తీక్షమైన విజ్ఞానం - ఔచిత్య మధురమైన శైలి ప్రస్ఫుటంగా వుంటాయి.

తమిళ భాషను ఔచిత్యవంతంగా నిసర్గరమణీయంగా కవితయందు ప్రయోగించిన మహారచయితలలో - ఆమె ప్రథమశ్రేణిలోనిది.

మద్రాసులోని సాంస్కృతిక సంస్థ కళాసాగర్-కందుకూరు వీరేశలింగం పంతులు జన్మదినోత్సవాల సందర్భంగా — ఒక వ్యాస రచన పోటీని ఇటీవల నిర్వహించింది. "నేటి సమాజంలోని దురాచారాలను ఈనాటి వీరేశలింగం ఎలా ఎదుర్కొంటాడు?" అన్నది—పోటీ విషయం. ఈ వ్యాస రచన పోటీలో కుమారి కె. యస్. కృష్ణకుమారి రాసిన వ్యాసం 'ఉత్తమ బహుమతి' పొందింది. ఈ వ్యాసం పాఠకులకు కూడా ఉపయుక్తంగా వుండగలదన్న వుద్దేశంతో ఇక్కడ ప్రచురిస్తున్నాము.

చేసేవారు. కాటికి కాళ్ళు చాచిన వానికి, పసికూనల నమ్మి, ఆస్తిగల అల్లుళ్ళని సంబరపడడం తగని ఘోరమని ప్రచారం చేసేవారు. కన్యాశుల్కాన్ని, వితంతువు-జీవితాంతం వితంతువుగానే ఉండాలన్న వాదాన్నీ ఆయన తీవ్రంగా ఖండించారు. వేశ్యా వృత్తి తగని ఘోరమని, స్త్రీగాని పురుషుడు గాని, తన ఇష్టం వచ్చినట్లు తప్పుడు త్రోవ తొక్కితే రాను రాను, అది క్రమంగా దేశమంతటా అలుముకుపోయి, దేశ-సౌభాగ్యానికే తీరని ముప్పు తెస్తుందని ఆయన ఖండించారు. భోగం మేళాలు సంఘాన్ని ఏ విధంగా సర్వనాశనం చేస్తున్నాయో, సంసారాలు ఏ విధంగా కూలిపోతున్నాయో కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. బహు భార్యాత్వ నిషేధానికి కూడా ఆయనే పునాది వేశారు. వితంతు వివాహాలను ప్రోత్సహించారు. విద్యావంతుడైన పురు

దుర్భర విషాద సమయంలో, కమ్ముకున్న కారుచీకట్లను చీల్చుకుని, దివ్యజ్యోతియై ప్రకాశించి, అమాయక లేత హృదయాలలో భాగ్య జ్యోతిని వెలిగించిన సహృదయులు శ్రీ వీరేశలింగం. బాల్య వివాహాల దుష్ఫలితంగా, భూలోక నరకాన్ననుభవించే స్త్రీ మూర్తుల నుదుట, చెదరిన కుంకుమదిద్ది, సాంఘిక జీవనంలో అన్ని విషయాలలోను, వారికి కూడా సరియైన ప్రాతినిధ్యమీయడమే పంతులుగారి ఆశయం. తెలుగు దేశానికి వెలుగుబాటను చూపి యుగకర్తయై 'దక్షిణ భారత విద్యాసాగరుడ'నిపించుకున్నాడు. వీరేశలింగంగారు లేవనెత్తిన విప్లవం ఏదో ఒక్క సమస్యపై మాత్రమేగాదు తాను దురాచారంగా భావించే ప్రతి ఒక్క సమస్యపైనా ఆయన విప్లవం వర్ధిల్లజేశారు.

# నేటి సమాజంలోని దురాచారాలను ఈనాటి వీరేశలింగం ఎలా ఎదుర్కొంటాడు?

శతాబ్దాల తరబడిగా, మత, వర్గ వైషమ్యాలతోను, కులతత్వపు మూఢ ప్రచారాలతోను, సాంఘిక దురాచారాలతోను నిండి, జడత్వం దాల్చిన ఆంధ్రావనిలో మహత్తర సాంఘిక విప్లవం లేవదీసి సమాజాన్ని మేల్కొల్పిన మహత్తర వ్యక్తి వీరేశలింగం.

ఇప్పటికి 131 సంవత్సరాల ముందు ఆయన జన్మించేసరికి, మనం వూహించుకోలేనంత అధోగతిలో మన తెలుగుదేశం వుంది. అనేక దురాచారాలతో సంఘం కుళ్ళిపోయి వుంది. అందులో అతి దారుణమైన దురాచారాలు, కన్యాశుల్కం, బాల్య వివాహాలు, భోగం మేళాలు మొదలైనవి. నాటి ప్రజల అజ్ఞానానికి, మూఢ నమ్మకాలకు అంతులేదు. దుర్వ్యసనాలకు దరిలేదు. ఆనాటి అసంతృప్తికర పరిస్థితుల నుండి ఉద్భవించిన అగ్నిజ్వాలయే కందుకూరి వీరేశలింగం పంతులుగారు. జ్యోతిశ్శాస్త్రం, శకునాలు, ముహూర్తాలు మున్నగు వాటిలో తనకు నమ్మకం లేదని బాహాటంగా చెప్పటమేకాక, అవి పాటించక పోవడం వల్ల, తనకు వచ్చిన నష్టం ఏమీలేదని స్వయంగా రుజువు

షునికంటె, విద్యావంతురాలైన స్త్రీ తన పిల్లల్ని విద్యావంతులుగా చేయడానికి ఎక్కువ ఓపికతో కృషి చేస్తుందన్న సారాంశం గ్రహించి వీరేశలింగం గారు స్త్రీ విద్యావ్యాప్తి కోసం కృషిచేయ నారంభించారు.

సంఘ సంస్కార ప్రచారానికి, సాహిత్యాన్నే ఆయుధంగా పెట్టుకున్నారు. ఆధునిక వాఙ్మయ నిర్మాణానికి శంకుస్థాపన చేసి, సులక్షణమైన సులభశైలిలో రచనలు చేసేవారాయన. నిర్మొహమాటంగా తమ భావాలను వెలువరచుటకై, 'వివేకవర్ధని' అనే సొంత పత్రికను నడిపేవారు. అతి బాల్య వివాహాలను, వ్యభిచార వృత్తిని, నిరసిస్తూ పత్రికలలో వ్యాసాలు రాసేవారు. సంఘంలో సగభాగమైన స్త్రీలను, పురుషుని బానిసలవలె చూస్తూ పురుషునకు ఒక న్యాయం, స్త్రీకి ఒక న్యాయం అమలు జరిపితే, శరీరంలో సగభాగం పక్షపాతం వచ్చి పడిపోయినట్లే వుంటుందని గ్రహించి స్త్రీ జనాభ్యుదయానికై పాటుపడ్డారు. 'స్త్రీ పునర్వివాహ సమాజం', 'పతిత యువతీ రక్షణశాల' మొదలైనవి స్థాపించారు.

ఎంతోమంది ఆయన ఆశయాలను గుర్తించినప్పటికీ, కాకుల్లా పొడిచే లోకులకు భయపడి ఆయనతో చేతులు కలపలేకపోయారు. సంఘం వెలివేసినా, తనను కొట్టడానికి ప్రజలు సిద్ధపడ్డా— ఆయన అకుంఠిత దీక్షతో చేపట్టిన పనిని సాధించగలిగారు.

శతాబ్దాలుగా జీర్ణించుకుని వున్నట్టి మూఢాచారాలను, సనాతన సంప్రదాయాలను, అమానుషచర్యలను రూపు మాపటం అన్నది ఒక జీవితకాలంలో జరిగేపని కాదు. ఒక్క మనిషి మాత్రం నడుం కడితే ముగిసే పనికాదు. ఆయన తన చివరికాలం వరకూ, క్రుళ్ళిపోయిన సంఘాన్ని బాగు చెయ్యడం కోసం ప్రయత్నించారు. సంఘంలో ఎటువంటి మార్పులు అవసరమో వేలెత్తి చూపారు. సామాన్యజన సముద్ధరణకై, ప్రజాబాహుళ్య సంరక్షణకై, ఆయన జీవితాన్ని వినియోగించారు.

కాని తలపెట్టిన యజ్ఞం పూర్తిగా ముగియక ముందే అసువులు బాసారు. తాను సాధించదలచినది, సాధించవలసినది యింకా యెంతో వున్నదని,

ఆయన తన అనుయాయులను, సంఘ సంస్కరణాభిలాషులను తాను పూర్తి చెయ్యలేని భాగాన్ని కొనసాగించమని, అంత్య సందేశమిచ్చారు. చీకటిలో కొట్టుమిట్టాడుతున్న హైందవ సంఘంలో వెలుగురేఖను చూపించిన మహనీయుడు — ఏ విషయాల మీద, ఏ సమస్యలపై విప్లవాన్ని తీసుకువచ్చారో, ఆ సమస్యలకు సంపూర్ణ పరిష్కారం లభించిందా? సంఘంలో ఆయన ఆశించిన మార్పు కనిపించిందా?

ఈనాడు బాల్య వివాహాలను మనం నిరసిస్తున్నామంటే అందుకు మూలపురుషుడాయనయే. ఈనాడు బాలవితంతు వివాహాలను మనం హృదయపూర్వకంగా ప్రోత్సహిస్తున్నామంటే అది ఆయన చేతి భిక్షయే. ఈనాడు స్త్రీ గూడా, పురుషునివలె విద్య నభ్యసించడం ఎంతైనా ఆవశ్యకమని మనం గుర్తిస్తున్నామంటే అది ఆయన మహత్తర కృషి వల్లనే. తెలుగుదేశం నలుమూలలా వేలాదిగా నేడు విద్యాలయాలకు వెళ్ళే అనేకమంది బాలికలు వీరేశలింగం మహనీయుడు కన్న కలల పంటలు.

ఆనాడు సంఘాన్ని తొలిచేసిన చీడపురుగుల్లాంటి దురాచారాలు యీ నాటికీ వున్నాయి. ఆనాటి సమస్యలే యీనాడు క్రొత్త రూపాలు దాల్చాయని చెప్పక తప్పదు. ఒకే సమస్యకు రెండు ముఖాలన్నట్లు, ఆనాడు వాడుకలో వున్నటువంటి కన్యాశుల్కం యీనాటి వరకట్న పిశాచమై సంఘాన్ని పట్టి పీడిస్తున్నది. చట్ట వ్యతిరేకమని న్యాయశాస్త్రం ఘోషిస్తున్నా వరకట్నం తీసుకోవడం అనే దురాచారం నానాటికీ మరింత విస్తృతంగా వ్యాపిస్తున్నది.

ఆనాడు మతాంతర, కులాంతర వివాహాలు చేసుకున్న వారిని సంఘంలో వెలివేసినట్లు చూసేవారు. ఈనాటికీ కూడా అటువంటి వివాహాలకు, పూర్తి ప్రోత్సాహం లభించడం లేదు. మతం, కులం అన్న జాడ్యాలు యింకా సంఘంలో అలాగే వుండిపోయాయి. వర్గ కలహాలు, కుల కలహాలు, మత కలహాలు మొదలైన వాటివల్ల శాంతి భద్రతలకు భంగం వాటిల్లుతునే వున్నది.

పడుపు వృత్తి పరువు ప్రతిష్ఠలకు కళంకం తెస్తుందని ఆనాడు వీరేశలింగంగారు ఖండిస్తే, యీ వృత్తిని చట్టబద్ధం చెయ్యమంటున్నారు కొందరు! మన పయనం పురోగమనానికా? తిరోగమనానికా?

లంచగొండితనాన్ని వీరేశలింగంగారు రూపుమాపడానికి ప్రయత్నాలు చేసి, లంచగొండులకు సింహస్వప్నంగా వుండేవారు. కానీ యీనాడు....? అవినీతి సమాజంలో కూకటివేళ్ళతో వ్యాపించి వున్నది. పట్టణాలలో, పల్లెలలో, అణువణువుగా మనిషి ప్రాణాన్ని కబళించే మద్యపానం ఇవాళ ఫ్యాషనై పోయింది. సంఘం త్రాగుబోతుల సమూహమైతే దేశ సౌభాగ్యానికెంత ముప్పు!

సమాజాన్ని చెదపురుగులా తినేసి నేలమట్టం చేసే యీ దురాచారాలను రూపుమాపి నవసమాజ నిర్మాణానికి కంకణం కట్టుకొనేదెవరు? సంఘాన్ని అభ్యుదయమార్గాన నడిపించేదెవరు? నవశకారంభం చేసేదెవరు? నేటి యువతరం ముందుకు కదలాలి. వరకట్న పిశాచాన్ని పారదోలాలి. మత కలహాలు, కులభేదాలు జాతి పురోగమనానికి అడ్డంకులని తెలియజేయాలి. ఆధునిక పారిశ్రామిక నాగరికత బాగా వేళ్ళు పాతుకున్నచోట, మత సంకుచితత్వాలకు, దురభిమానాలకు తావుండరాదు. స్వార్థపర శక్తులను, సంఘ వ్యతిరేకశక్తుల విజృంభణను అరికట్టాలి. అణుయుగంలోకి అడుగిడినా, యింకా యీ కులాలను, మతాలను పట్టుకుని వ్రేలాడడం మన సంకుచితత్వాన్ని తెలియజేస్తున్నది. అంతరిక్షంలోకి చొచ్చుకుపోతున్నా, యితర గ్రహాలపై అడుగుపెట్టినా, ఇంకా మూఢ విశ్వాసాలు ప్రజలలో అలాగే వున్నాయి. ప్రజలలో హేతువాద దృష్టి రావాలి. అలుముకున్న అజ్ఞానం నుండి విజ్ఞానం వైపు పయనించిననాడే, దేశపురోభివృద్ధికి నాంది పలికినట్లవుతుంది. అంతవరకూ, మనం వైజ్ఞానిక పరంగా, యెంత విజయం సాధించినప్పటికీ, దురాచారాల కుళ్ళులో మ్రగ్గిపోతున్నట్టే.

ఈ లక్ష్యాలను సాధించడానికి మరొక వీరేశలింగం వుదయించి, పై బాధ్యతలను నిర్వహించాలి. ఈనాటి సమాజంలోని అసంతృప్తికర పరిస్థితులనుండి ఒక్క నిప్పురవ్వ ఉదయించినా చాలు - అది జ్వాలై వెలుగునిస్తుంది. ఆ వెలుగు ప్రజావళికి మార్గదర్శకమవుతుంది. ఈనాటి వీరేశలింగం క్రొత్త ఉద్యమాన్ని ప్రారంభించాలి. కదిలేది, కదిలించేది 'ఉద్యమం'. కనుక వుద్యమాలు కావాలి, ఉద్యమాలు రావాలి! నేటి వీరేశలింగం, ఆనాటి వీరేశలింగం ఏ ఆశయసిద్ధికి పాటుపడ్డారో, ఏ లక్ష్యాలు సాధించడానికి తమ జీవిత సర్వస్వం ధారపోశారో పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ఆ 'విప్లవమూర్తి' అడుగుజాడలలో ఆ లక్ష్యాలన్ని సంపూర్తిగా సాధించడానికి తీవ్ర కృషి చేసి కృతకృత్యుడవాలి.

దేశాభివృద్ధికి, సాంఘికాభివృద్ధికి స్వయం కృషి మాత్రం సరిపోదు. సామూహికకృషి యెంతైనా అవసరం. విప్లవశంఖ నినాదాలు, మారుమూల పల్లెటూళ్ళలో కూడా మారుమ్రోగాలి. పల్లెలు, పట్టణాలన్న భేదం లేకుండా, నిరంతర చర్చలు జరగాలి. వీలైనంతమంది యీ కార్యక్రమాలలో పాల్గొనునట్లు చూడాలి.

అలా అని - సభలు, సదస్సులు, సమ్మేళనాలు, గోష్ఠులు, చర్చలు మాత్రమే కావు కావలసినవి. ఉపన్యాసాలతోనే అన్నీ అయిపోవు. కేవలం, తర్కంతోను, వాదపటిమతోను, అన్నిటినీ సాధించలేము. క్రొత్త రూపాల్లో తలెత్తుతున్న అనేక సాంఘిక దురాచారాలను చేతలతో ప్రతిఘటించాలి.

క్రొత్త వీరేశలింగం! నువ్వు సాంఘిక దురాచారాలపై ధ్వజమెత్తి, ప్రజలలో గాఢమైన సంస్కరణాభిలాషను, ప్రగతిశీల దృష్టిని కలిగించి, యీ మహోజ్జ్వల కార్యక్రమాన్ని నేడే చేపట్టు. నిద్రాణమైన ప్రజాశక్తులలో చైతన్యాన్ని కలిగించు. వర్గరహిత సమాజాన్ని సృష్టించు. యువతరాన్ని నడిపించు. నీకు మా జోహార్లు!!!

— కె. యస్. కృష్ణకుమారి



**ఈ వ్యాస రచయిత్రి కృష్ణకుమారి — మద్రాసులో గత సంవత్సరం ఎమ్ ఎస్‌సి. పరీక్ష రాసి, మద్రాసు విశ్వ విద్యాలయానికంతటికీ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలై, 'స్వర్ణపతకం' పొందారు. వక్తృత్వపు పోటీల్లో కూడా పాల్గొని ఆమె పలు బహుమతులు అందుకున్నారు. ప్రస్తుతం మద్రాసులోని పంజాబ్ నేషనల్ బ్యాంక్ రీజనల్ ఆఫీసులో ఆమె ఉద్యోగం చేస్తున్నారు.**

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-50' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు ఆగస్టు 27వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 అక్టోబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. మెడపైన ఉండేది
2. కడలికి మరో పేరు
3. తొందరగా విడదు
4. ఉత్తర దక్షిణాలుగా సూర్యుడి పోకడ
5. అలా చూస్తే పొగర్తలా కనిపిస్తుంది; ఇలా చూస్తే భుజించమంటుంది.
6. ఇదొక మత్స్య విశేషం
7. ఇంకో పదం ముందుకు
8. వయసులో వున్న స్త్రీ
9. ఇలా చూస్తే ఏదో పాములా అనిపించినా, కొద్దిగా నర్దితే, తియ్యని ద్రవ పదార్థం
10. ఈ రకం కవిత్వం కూడా వుందిట.
11. జుట్టునీ వెయ్యొచ్చు; తాడునీ వెయ్యొచ్చు
12. సంక్రాంతి ముందు పిల్లలకి పోయడానికి ఉపయోగిస్తారు.
13. పొత్తరం.

### ఆధారములు – నిలువు

1. ఉచితం-డబ్బుతో ఏమీ సంబంధంలేదు !
2. గెలుపును సూచించే శివసతి
4. తమ్ముడి కంటె పెద్ద; చెల్లెలుకంటె పెద్ద
6. గోల
7. వాలం ముందుగానే పొట్టిదయిపోయింది.
8. ఒకరి తరపున. బదులుగా—అన్నమాట.
9. అర్ధరాత్రి !
14. దొరుకుతుంది !
15. రెండో అక్షరంలో ఎకారం వుంచి తిరగబెడితే మాసం అవుతుంది !
16. కొందరు తలకిందులుగా వుండి కూడా తపస్సు చేస్తారు.
17. శ్మశానాల్లో వుంటుందని.
18. క్షీర మొలికెను...
19. తొక్కు
20. చిన్న కొలను లాంటిది కిందా మీదా అయింది.
21. పండితే ?...



# రాజకీయ రంగంలో స్త్రీలు

రాజులు, రాజ్యాలూ అంతరించి అధికారం ప్రజా ప్రతినిధుల హస్తగతమై పోయింది. ఇవాళ ప్రజా జీవితాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావితం చేసేవీ, జీవితాలకు రూపురేఖలు దిద్దేవీ ఆయా ప్రభుత్వ విధానాలు. ప్రభుత్వ విధానాలను, చట్ట దిట్టాలను రూపొందించేవి అధికారంలో వున్న, రాజకీయ పక్షాలు. చట్టాలు, శాసనాలు నిర్ణయించే సంఘాలలో, పార్లమెంటు, శాసన సభలలో ప్రాతినిథ్యం వహించాలంటే రాజకీయ రంగ ప్రవేశం చాలా అవసరం.

మన దేశంలో స్త్రీలు రాజకీయాలలో ఉధృతంగా పాల్గొనడం అన్నది మహాత్మాగాంధి శకంతోనే ఆరంభమయింది. సహాయ నిరాకరణోద్యమం, సత్యాగ్రహాల ద్వారా బాపూజీ జరిపిన సాత్త్విక స్వాతంత్ర్య సంగ్రామంలో వివిధ రంగాలలోని స్త్రీలు అమితోత్సాహంతో పాల్గొన్నారు. అతివాద పక్షంలో చేరి ఎన్నో కష్టనష్టాలు అనుభవించి ప్రాణాలు కూడా పోగొట్టుకున్న వనితామణులూ లేకపోలేదు. కాని స్వాతంత్ర్య సిద్ధి తర్వాత - అర్థబలం, అంగబలం వున్న ఏ కొందరో తప్ప చాలామంది తమకూ రాజకీయాలకూ ఎలాంటి సంబంధమూ లేనట్టు మసలుకుంటున్నారు. అందువల్లే రాజ్యాంగ చట్టం పురుషులకు సరిసమానంగా ఎన్నో అవకాశాలు కల్పించినప్పటికీ భారతనారీ ప్రగతి - వేదికల మీద ప్రభుత్వాధినేతల, వక్తల కంఠశోషలో మాత్రం దర్శనమిస్తోంది.

ఇంతవరకు మన దేశంలో పార్లమెంటు ఎన్నికలు ఆరుసార్లు జరిగాయి. 1952 సం॥లో జరిగిన లోక్ సభ ఎన్నికలలో దాదాపు ఏడు కోట్ల ఎనభై లక్షలమంది స్త్రీలు తమ వయోజన ఓటు హక్కును వినియోగించుకున్నారు. ఈ సంఖ్య అప్పటి మొత్తం ఓటర్లలో నలభై అయిదు శాతం. 1977 సం॥లో జరిగిన లోక్ సభ ఎన్నికలలో ఓట్లు వేసిన స్త్రీలు పదిహేను కోట్ల రెండు లక్షలమంది. అంటే మొత్తం ఓటర్లలో నలభై ఎనిమిది శాతం. ఈ పెరుగుదల మన స్త్రీలలో పెంపొందిన రాజకీయ చైతన్యానికి ప్రతిబింబమా ?- అంటే అదేం కాదు. ఓటు వేసి (ఎందుకు వేస్తున్నారో కూడా తెలియని వాళ్ళూ వున్నారు. అది వేరే విషయం) తమ పని అయిపోయిందనుకుంటున్నారేగాని ఎన్నికలలో పోటీ చేయడానికి ఎవరూ ముందుకు రావడం లేదు.

కేంద్ర ప్రభుత్వం తరఫున 'స్త్రీ సంక్షేమ సంస్థ' ఇటీవల సేకరించిన కొన్ని వివరాలు ఈ నిజాన్ని బట్టబయలు చేశాయి.

1952 సం॥నుంచి ఇంతవరకు పార్లమెంటుకు పోటీ చేసిన పురుషులు 12,587 మంది. అయితే స్త్రీలు 383 మంది మాత్రమే. వివిధ రాష్ట్ర అసెంబ్లీలకు 105,702 మంది పురుషులు పోటీ చేయగా 235 మంది స్త్రీలు మాత్రమే పోటీ చేశారు.

దాదాపు మూడు దశాబ్దాలుగా పార్లమెంటులో స్త్రీల ప్రాతినిథ్యం 7.1 శాతం మాత్రమే. రాష్ట్ర అసెంబ్లీలకు ఎన్నికైన స్త్రీలు పురుషులతో పోల్చి చూసినప్పుడు 6.77 శాతం మాత్రమే.

రాష్ట్రాలలోనూ కేంద్ర మంత్రి మండలిలోనూ, వనితలు కొందరు మంత్రి పదవులు అలంకరించారు. కానీ అవి "మేమూ వనితలకు ప్రాముఖ్యం ఇచ్చాము" అని చెప్పుకోడానికి మాత్రమే అన్నట్టుగా కనిపిస్తుంది. అవి కూడా ఆరోగ్యం, విద్య, సంక్షేమం శాఖలకే పరిమితం చేయబడుతుంది - ఇతర శాఖలను స్త్రీలు నిర్వహించలేరు అన్నట్టు. ఇది గర్హనీయమైన విషయం.

ఈ విషయాలన్నిటినీ చూస్తే - రాజకీయరంగం పురుషుల గుత్తాధిపత్యంలోనే వుంది. పురుషులను రాజకీయ రంగంలో పై అంతస్తుకు పంపే నిచ్చెన మెట్లుగానే స్త్రీలు నిలచిపోతున్నారన్న సత్యం తేటతెల్లమవుతుంది. అందుకే ఎన్ని పథకాలు వేసినా అవి కాగితాల మీదే నిలచిపోయి స్త్రీల పరిస్థితి 'గొంగళి' సామెతకు దగ్గరి ఉదాహరణగానే వుంటూంది.

ఇటీవల ఢిల్లీలో 'వనితా జనాభ్యుదయం' గురించి జరిగిన జాతీయ వనితా సమ్మేళనంలో – "గుర్తింపు పొందిన ప్రతి రాజకీయ పక్షం-నిర్ణీత

---

## పాపలు - వేళ్ళు చప్పరించడం

పిల్లలు వేళ్ళు చప్పరించడానికి కారణం మానసిక ఆనందమే. పాలు తాగడం, హాయిగా నిద్రపోవడం, తల్లి ఆదరణ శిశువులకు ఆనందం కల్గిస్తాయి. అందువల్ల పాలు తాగడంలో కలిగే ఆనందాన్ని పాపాయి వేలును చప్పరిస్తూ పొందుతుంది. ఇది సహజమే.

ఒకటి రెండు సంవత్సరాలు నిండగానే ఎన్నో కొత్త అనుభవాలు ఏర్పడడంతో నోట్లో వేలు వేసుకునే అలవాటును సాధారణంగా మరచిపోతుంది.

కొందరు పాపలు నిద్రపోవడానికి ముందూ, తల్లి దగ్గర లేనప్పుడూ బోర్ కొట్టేటప్పుడూ చేతివేళ్ళు చప్పరిస్తూ వుంటారు. ఇది కూడా తప్పేమీ కాదు. అయితే కొందరు పాపాయిలు ఎప్పుడు చూసినా నోటిలో వేలుంచుకుని అదే పనిగా పుండు పడే వరకు చప్పరిస్తూ వుంటారు. దీనికి కారణం - తల్లి ప్రేమ, ఆదరణ చాలినంత లభించక పోవడమే.

రెండో పాప పుట్టగానే మొదటి పాప మీద శ్రద్ధ తగ్గడంవల్ల - లేదా ఆ పాప శ్రద్ధ చూపడం లేదన్న బెంగవల్లా, అసూయ చెందడంవల్లా వేలు చప్పరించడం ప్రారంభిస్తుంది.

సాధారణంగా ఒక సంవత్సరం తర్వాత కూడా వేలును చప్పరిస్తూ వున్నట్టయితే పాపను ప్రేమగా చూస్తూ పాప దృష్టిని – ఆటవస్తువుల మీదికి లేదా మరేవైపుకో మళ్ళించినట్టయితే - వేలును చప్పరించడం మరచిపోతుంది. —డాక్టర్



# వైద్య విశేషాలు

స్వేచ్ఛ అంటూ వనితలు విజృంభించి పురుషులతో పోటీపడుతూ స్వతంత్రంగా ఉద్యోగాలు చేసి, ఆస్తి, హోదా సంపాయించడం, మరో ప్రక్క ఇంటిని చక్కదిద్దుకొనడం వంటివి చెయ్యడం బాగానే వుంటుంది కానీ, ఈ వేగంలో తమకు ప్రకృతి సిద్ధంగా సంక్రమించిన సౌకుమార్యాన్ని, లావణ్యాన్ని స్త్రీత్వపు పరిధులనూ అతిక్రమించితే, ప్రమోదానికి బదులు ప్రమాదం వాటిల్లే అవకాశం వుందని ప్రొఫెసర్ ఐవర్ మిల్స్ అనే వైద్యశాస్త్రజ్ఞుడు - ఇటీవల తెలియజేశారు. స్త్రీలు ఈ పనుల ఒత్తిడికి లోనైతే, మామూలుగా దేహంలో ఉత్పత్తి అయ్యే స్త్రీ హార్మోనులకు బదులు-పురుష హార్మోనులు తయారవుతాయని, ఆ కారణంగా చాలామందిలో మగ లక్షణాలు వస్తాయని ఆయన చెప్పారు. ఆ మగ లక్షణాలలో సాధారణంగా ముఖం పై రోమాలు రావడం, క్రమక్రమంగా బట్టతల రావడం, కొంత కాలానికి ప్రవర్తనా ధోరణిలోనే మార్పులు ఏర్పడడం జరుగుతుందట!

*

పురిటినొప్పులు రావడానికి, ప్రసవం తేలికగా జరగడానికి వైద్యులు తరచుగా 'ఆక్సిటోసిన్' మందును ఇంజెక్షన్ ద్వారా - ఉపయోగించడం జరుగుతోంది. ఇది సురక్షితమైన మందే అయినప్పటికీ, 'ఇంజెక్షన్' చేసిన తర్వాత-ఆ భాగంలో విపరీతమైన నొప్పి కలుగుతుంది. అందువల్ల - 'ఇంజెక్షన్' కంటే, తేలికైనది, మరింత సురక్షితమైనదీ అయిన విధంగా ఆ మందును మాత్రల ద్వారా ఉపయోగించే విధానాన్ని వైద్యశాస్త్రజ్ఞులు కనుగొన్నారు. గర్భవతులు - ఈ 'ఆక్సిటోసిన్' మాత్రలను - అరగంటకు ఒకసారి వేసుకోవాలి. ఈ మాత్రలను ఉపయోగించినవారిలో 81 శాతం స్త్రీలకు - మంచి ఫలితాలు లభించాయని, వీటిని విరివిగా ఉపయోగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని వైద్యశాస్త్రజ్ఞులు తెలియజేశారు.

*

చర్మానికి బదులుగా ఉపయోగించడానికి - కృత్రిమ చర్మాన్ని వైద్యశాస్త్రజ్ఞులు రూపొందించారు. దీని పేరు 'సిస్పర్‌డెర్మ్'. అగ్ని ప్రమాదానికి గురై, తీవ్రంగా చర్మం కాలిపోయిన వారికి - ఈ కృత్రిమ చర్మాన్ని ఉపయోగించి చూసిన తర్వాత మంచి ఫలితాలు లభించినట్లు వైద్యశాస్త్రవేత్తలు తెలియజేశారు. పైగా ఈ కృత్రిమ చర్మంతో చికిత్స చేయడానికి ఎక్కువ ఖర్చు కూడా కాదట!

*

కేన్సర్ (పుట్టుకురుపు వ్యాధి) అంటువ్యాధి అని నిర్ధారణ అయినట్లు, కేన్సర్ నిరోధానికి త్వరలోనే 'వాక్సిన్' తయారు చేయడానికి ప్రయోగాలు జరుగుతున్నట్లు సోవియట్ వైద్యశాస్త్రజ్ఞులు ఇటీవల ప్రకటించారు. ఈ ప్రయోగాలు జార్జియాలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్‌పెరిమెంటల్ పాథాలజీలో డాక్టర్ బోరిస్‌లాపిన్ నాయకత్వంలో జరుగుతున్నాయి. కృత్రిమమైన కేన్సర్ క్రిములను - కోతులపై ప్రయోగించి చూడడం వల్ల, ఈ వ్యాధి తక్కినవాటికి సంక్రమించే విధానం పట్ల కొన్ని వివరాలు లభ్యమయ్యాయని, ఈ అంశంపై పరిశోధనలు సమగ్రంగా జరిగిన తర్వాత 'వాక్సిన్' రూపొందించడం, అది ఏ దశలో రోగికి యిస్తే, వ్యాధి నయమవుతుందో తెలుసుకోవడం జరుగుతుందనీ ఆ వైద్యశాస్త్రజ్ఞులు వివరించారు.

*

స్త్రీల గర్భంలో నులిపురుగులు వుండడం వల్ల కూడా సంతానం కలగకపోవడానికి ఆస్కారం వున్నట్లు కలకత్తాకు చెందిన ఇద్దరు వైద్యశాస్త్రజ్ఞులు డా॥ పి. సిన్హా, డా॥ ఎ. కె. దే-ఇటీవల ప్రకటించారు. వివిధరకాల గర్భాశయ వ్యాధులతో బాధపడుతున్న వారిని పరీక్షచేసి చూసినప్పుడు-కొందరి దేహంలో నులిపురుగులు వున్నట్లు కనుగొనడం జరిగింది. వారిలో సంతానం లేని స్త్రీలలో కొందరికి - నులిపురుగులకు చికిత్స జరిగిన తర్వాత రెండు మూడు నెలల్లోనే-గర్భం ధరించారని, ఇందువల్ల స్త్రీలకు గర్భధారణ జరగకపోవడానికి నులిపురుగులు కూడా కారణం కావచ్చని తాము నిర్ధారణకు రాగలిగామనీ - ఆ వైద్యనిపుణులు తెలియజేశారు.

*

మద్రాసు మెడికల్ కాలేజ్ ఆధ్వర్యంలో జరుగుతున్న వైద్య పరిశోధనల ఫలితంగా-పక్షవాతాన్ని, మెదడుకు సంబంధించిన ఇతర జబ్బులను ముందుగానే సూచించే ఒక ప్రత్యేక వైద్యసాధనం కనుగొనబడింది. ఈ సాధనం సహాయంతో-రోగికి పక్షవాతం వచ్చే అవకాశాలను ముందుగానే తెలుసుకుని, అది రాకుండా చికిత్సను ప్రారంభించవచ్చునట! దీని ధర కూడా తక్కువేనని, ఈ సాధనాన్ని పూర్తిగా స్వదేశీ పరికరాలు ఉపయోగించి రూపొందించడం జరిగిందనీ - వైద్యశాస్త్రజ్ఞులు తెలియజేశారు.

*

పొగ త్రాగడానికీ, ముట్లుడిగే దశకు సంబంధం ఉన్నట్లు వైద్య పరిశోధనలవల్ల రుజువైంది. ఈ పరిశోధనలవల్ల తేలిందేమిటంటే, స్త్రీలలో పొగ త్రాగేవారికి, పొగ త్రాగనివారికంటే తొందరగా ముట్లుడిగే స్థితి ఏర్పడుతుందట! □

---

శాతం స్థానాలను స్త్రీలకు కేటాయించాలి'' అని ఒక తీర్మానం చేశారు. ఇది ముదావహమైన తీర్మానమే. అయితే - దేశప్రగతి, ప్రజా సంక్షేమం అని ఎన్ని ఉపన్యాసాలు దంచినా రాజకీయ పక్షాల ప్రథమ లక్ష్యం - అధికారం చేపట్టడం. నదులే లేనిచోట సైతం బ్రహ్మాండమైన వంతెనలు నిర్మిస్తామని వాగ్దానాలు చేసే పార్టీ నాయకులు - పలుకుబడి, విజయావకాశాలు ఎక్కువగా వున్న అభ్యర్థికే పార్టీ టికెట్ ఇస్తారు - కానీ ఆడ, మగ, అన్న ప్రస్తావనే వుండదు.

పై ప్రతిపాదనను వాదానికి ఒప్పుకున్నప్పటికీ దాన్ని సద్వినియోగం చేసుకునేందుకు ఎందరు స్త్రీలు ముందుకు వస్తారన్నది ప్రశ్నార్థక చిహ్నమే.

ఆర్థిక అస్వతంత్రం, నిరక్షరాస్యత, తలకుమించిన కుటుంబ బాధ్యతలు మొదలైన సమస్యలు స్త్రీలను ముందుకు రానీయక వేధిస్తున్నాయి. వీటన్నిటినీ రూపుమాపాలంటే సామాజిక వ్యవస్థలోనే సమూలమైన మార్పు రావాలి. అలాంటి ఆరోగ్యకరమైన మార్పు తీసుకు రావడానికి ప్రతి ఒక్కరూ పాటుపడాలి. ముఖ్యంగా వనితా సమాజాలు, మహిళా సంఘాలు ఈ విషయం బాగా ఆలోచించాలి. ఆ ఆలోచనలు నిర్మాణాత్మకమైన పథకాలుగా నెరవేరడానికి కృషి చేయాలి. —బాల







శ్యామలావిహారి

"భారతీ, ఆ డబ్బా తీసుకొచ్చి ఈ మైసూర్ పాక్ ముక్కలన్నీ అందులో పెట్టేయ్. నానిగాడు లేచేడంటే వూరుకోడు. ఇదిగో, ఆ చేత్తోనే రెండు ముక్కలు, కాస్త మిక్స్చరు మీ అన్నయ్యకిచ్చిరా. ఈ లోపల నేను లడ్డు ముద్దలు కట్టేస్తాను." మొహం మీద పడ్తున్న జుట్టును ఎడంచేత్తో పైకి తోసుకుంటూ అన్నది అరుణ.

భారతి పళ్ళెంలో ముక్కలన్నీ డబ్బాలో పెట్తూ, "వదినా, అక్కయ్య ఈపాటికి దగ్గర్లో కొస్తూ వుంటుంది కదా" అన్నది.

"అవును. తనకీ కూచుని కూచుని విసుగు పుట్తూ వుంటుంది. అయినా ఏం చేస్తుంది? దూరా భారం మరీ" అంటూ గరిటతో బూందీని కలియ తీసింది అరుణ.

డబ్బా అలమరలో పెట్టి ప్లేటు అన్నయ్యకివ్వ డానికి ముందు గదిలోకి వెళ్ళింది భారతి.

ఆ రోజు ఆదివారం. మధ్యాహ్నం రెండు గంటలు దాటింది.

నిద్రపోయిలేచి తీరికగా పేపరు చూస్తున్నాడు ప్రకాశం. మధ్య మధ్య వదినా మరదళ్ళ హడావిడి గమనించి నవ్వుకుంటున్నాడు. "ఇదిగో అన్నయ్యా" అంటూ ప్లేటు టీపాయ్‌మీద పెట్టి "స్టేషన్‌కి నేనూ వస్తానన్నయ్యా" అన్నది భారతి.

"మీ వదిన కూడా వస్తుందేమో అడుగు" అన్నాడు ప్రకాశం ఎగతాళిగా నవ్వుతూ.

"నీకెప్పుడూ వేళాకోళమే. అక్కయ్యను చూసి చాలా రోజులైంది." గునుస్తున్నట్లుగా అన్నది భారతి.

"అవును మరి. స్టేషన్ నుంచి ఇంటికి రాకుండా అటే వెళ్ళిపోతుందాయే" నవ్వాడు ప్రకాశం.

"మీ కన్నింటికీ ఎగతాళే. పోనీ సరదా పడుతోందికదా తీసికెళ్ళకూడదూ. అది సరేగానీ ఇవెలా వున్నాయో చెప్పండి." అంటూ రెండు లడ్లు ప్లేట్లో పెట్టింది అరుణ.

"ఇవన్నీ నేను తినాలనేనా చేసింది. మీ రాబోయే ఆడపడుచు కోసమా" ప్రకాశం మాటల్లోని వ్యంగ్యాన్ని వినిపించుకోనట్లుగా కాఫీ తేవటానికి లోపలికెళ్ళింది అరుణ.

"వచ్చేటట్టయితే తొందరగా తెమలవే భారతీ. నువ్విప్పుడు మొదలుపెడితేగానీ అవదు నీ పని. అప్పటికి ట్రెయిన్ వస్తేనేగానీ బయటికి రావు." అన్నాడు ప్రకాశం టైము చూస్తూ.

ఇంతలో నానిగాడు లేచేడు. అరుణ వాడిని సముదాయించడం లో పడింది. భారతి తయారవ డానికి లోపలికి పరిగెత్తింది. ప్రకాశం కూడా లేచాడు.

"ఒక్కతెను-నాకేల-ఓపలేనీ సుకము-ఒక్క క్షణం ఒక్కక్షణం నా....న....నాన....నాననాన... మోయలేని ఈహాయిని మోయనీ-మురళీధరా- నీస్వరలహరులలో – మరణమైనా మధురమురా – నీపేరు తలచినా చాలు-" అద్దంలో తన అందానికి తానే మురిసిపోతూ, రాగయుక్తంగా-రకరకాల పాటలూ కలగాపులగంగా పాడుకుంటోంది భారతి.

"వెళ్దామా భారతీ" పిలిచేడు ప్రకాశం.

"యస్-నేను రెడీ అన్నయ్యా" అని చివరి సారిగా మొహాన్ని అటూ ఇటూ వంచిచూసుకుని, జడలో తురిమిన సంపెంగ పువ్వును సరిచేసుకుని గదిలోంచి బయటకొచ్చింది భారతి.

హాల్లో తచ్చట్లాడుతున్నాడు ప్రకాశం. "వదినా, వెళ్తున్నాం, తలుపేసుకో. నానిగాణ్ణి తీసికెళ్తానంటే వద్దన్నావ్" అంటూ వీధిలోకొచ్చింది భారతి. వీధిలో నిలబడి వున్నాడు ప్రకాశం.

"మీరు వచ్చేటప్పటికి వాణ్ణి తయారుచేస్తాగా. ఇంకా వాడికి నిద్ర మత్తు వదల్లేదు. వెళ్ళరండి" అంటూ వచ్చింది అరుణ.

"రిక్షా పిలవనా?" అడిగేడు ప్రకాశం.

"వద్దు. టైముందిగా నడిచేపోదాం." అన్నది

భారతి. ఇద్దరూ నడవసాగేరు.

"విస్సునీ, రమనీ తీసుకురావట ల్లేదుట అక్కా. వాళ్ళకి స్కూల్ కదా - ఏం చేస్తాం. వాసుగాడు ఈపాటికి పెద్దవాడై వుంటాడు కదన్నయ్యా. కబుర్లు బాగా చెప్తూ వుండాలి. బుజ్జి నడుస్తోందో లేదో యింకా?" అక్క సంతానాన్ని గురించి మాట్లాడు తోంది భారతి.

ప్రకాశం మౌనంగా నడుస్తున్నాడు.

"అక్కయ్య ఈసారి ఆపరేషన్ చేయించు కుంటుందిట."

ప్రకాశం భారతికేసి సాలోచనగా చూసేడు.

"అవును. అక్కకిప్పుడు నాలుగోనెల...."

"సర్లే....ఆ సంగతులన్నీ రోడ్డుమీదెందుకు? పద....త్వరగా నడు." విసుగ్గా అన్నాడు ప్రకాశం.

భారతి ఉత్సాహం చప్పబడింది. అన్న వైపు అదోలా చూసి మౌనం వహించింది.

రైల్వేస్టేషన్ చేరేసరికి ట్రెయిన్ వచ్చేసింది. ప్రకాశం మాట వరసకు అన్నాగానీ, నిజంగానే ట్రైనొచ్చేసినందుకు సిగ్గుపడింది భారతి. గబగబా ప్లాట్‌ఫామ్ మీది కొచ్చారు - ప్రకాశం, భారతి. అప్పటికప్పుడే ట్రెయిన్‌లోనుంచి దిగి వీళ్ళకోసం ఎదురుచూస్తోంది పార్వతి. చెంగున ఎగురుతూ అక్క దగ్గర వెళ్ళింది భారతి. పార్వతి చేతిలోని బుజ్జిని తీసుకుని ఒక చేత్తో ఎత్తుకుని, రెండో చేత్తో వాసు భుజం తట్టూ - "ఏరా వాసూ.... బాగున్నావా?" అంది. "ఓ" అని తల తాటిం చాడు వాడు.

"రండి వెళ్దాం" అంటూ సూట్‌కేస్ అందు కుని ముందు నడిచేడు ప్రకాశం. పార్వతీ, భారతీ అతన్ని అనుసరించారు.

"నీ వొంట్లో కులాసాగా వుంటోందిటే అక్కా. బావ కులాసాగా వున్నాడా....విస్సూ, రమా బాగా చదువుకుంటున్నారా?" ప్రశ్నల వర్షం కురిపిస్తోంది భారతి.

పార్వతి ముభావంగా ఊఁ కొట్టూ నడుస్తోంది. ఉన్నట్టుండి అడిగింది పార్వతి - "భారతీ నీ మెళ్లో నెక్లెస్ చాలా బాగుందే. ఎంతయింది?"

"రెండు వేలుట-డిజైన్ బాగుంది కదూ...."

"బాగుంది. చాలా బాగుంది. కానీ - అంత ఖరీదెట్టి ఎట్టా చేయించాడే అన్నయ్య...." అంది పార్వతి. భారతి క్రీగంట అక్కకేసి చూసింది. అమె మొహంలో వెలుగు లేదు.

పార్వతి ప్రశ్నకు భారతి మనస్సు నొచ్చు కుంది. తాను ఉత్సాహంగా అక్కను 'రిసీవ్' చేసుకోవటానికి వెళ్తే, తనకు ఎదురైన ప్రశ్న ఇదీ. భారతి సమాధానం చెప్పలేదు.

రిక్షాలు బయల్దేరినై. దారిలో పార్వతి భారతిని అడిగింది, "ఈ ఎనిమిది నెలల్లో వదినా నువ్వూ ఏం చీరలు కొనుక్కున్నారే?"

భారతి మనస్సు చివుక్కుమంది. వచ్చినప్ప ట్నుంచీ చూస్తోంది - నగలు, చీరలు మినహా వేరే ఏమీ అడగలేదు అక్క. కనీసం మాట వరసకైనా వదినా, నానిగాడు ఎలా వున్నారని అడగలేదు. క్షేమం అడిగిన అన్నయ్యకు కూడా సరీగా సమా ధానం చెప్పలేదు. పైగా చీరలేం కొనుక్కున్నారని అడుగుతోంది! భారతి మౌనంగా వుండిపోయింది.

భారతి మౌనానికి వేరే అర్థం వెతుక్కున్న పార్వతి, "పోనీలే, నాకు చెప్పకూడదు కాబోలు. నేను తెలుసుకోకూడనిదాన్నా-అంత రహస్యమా?" సాగదీస్తూ అంది.

భారతి చటుక్కున తల తిప్పి "అబ్బే-అదేం కాదక్కా. ఇంటికొచ్చాక ఎటూ చూస్తావుగా. అందుకని...." తడబడ్తూ అంది. కోపం వచ్చినట్లు మరోవైపు మొహం తిప్పుకుంది పార్వతి. ఒళ్లో నిద్రపోతున్న బుజ్జిని అవసరం లేకపోయినా జోకొడ్తూ బయటికి చూడటం మొదలుపెట్టింది భారతి. రిక్షాలో మరేం మాట్లాడలేదు పార్వతి.

ముందుపోతున్న రిక్షాలో మాత్రం వాసు - మామయ్యతో ఎన్నో కబుర్లు చెప్తున్నాడు. వింటు న్నట్లుగా ఊఁ కొడ్తున్నాడు ప్రకాశం. ఒకదాని వెనుక ఒకటిగా రెండు రిక్షాలూ సాగినై.

ఇంటి ముందు ఆగినై రిక్షాలు. గడపలోనే ఎదురుచూస్తూ నిలబడి వున్న అరుణ పలక రింపుగా నవ్వుతూ ముందుకొచ్చింది. వాసును దింపి సూట్‌కేస్ తెచ్చి లోపలపెట్టాడు ప్రకాశం. పార్వతి, భారతి లోపలికి వచ్చారు. బుజ్జిని గదిలో మంచం మీద పడుకోబెట్టి వచ్చింది భారతి.

"కులాసాగా వున్నావా వదినా...."

"ఎట్లా కనబడ్తున్నాను" అరుణ ప్రశ్నకు కావాలని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నది పార్వతి.

వాసు నానిగాడితో కబుర్లలోకి దిగేడు. కాళ్ళు కడుక్కొచ్చిన పార్వతి అరుణ వేసిన పీట మీద కూర్చుంది. పార్వతికి కాఫీ యిస్తూ "బాగా చిక్కి పోయావ్" అంది అరుణ.

"ఈ పిల్లమూక నన్ను బ్రతకనిస్తే కదా! చచ్చే చావుగా వున్నదనుకో వీళ్ళతో" పార్వతి కళ్లల్లో నీళ్ళు తిరిగేయి. 'పెళ్ళయి ఏడేళ్ళయితే ఇది అయిదో కాన్పు. ఓపికెలా వుంటుంది' మనసులో అనుకుంది భారతి. అలా అనుకునేసరికి భారతికి అక్క మీద జాలివేసింది.

ఆ కబుర్లూ ఈ కబుర్లూ జరిగినై కాస్సేపు. 'ఇప్పుడే వస్తా'నంటూ బయటికి వెళ్ళాడు ప్రకాశం. రిక్షాలోంచీ దిగుతున్నప్పుడే, చెల్లెళ్ళ మొహాలు చూసి-వాళ్ళేం మాట్లాడుకుని వుంటారో గమనించగలిగేడు ప్రకాశం.

చిన్నప్పట్నుంచీ పార్వతి మనస్సే అంత. ఆడంబరాలంటే ఎంతో ఇష్టం. వున్నదానితో గుట్టుగా వుండటమంటే ఎంతో బాధపడుతుంది. ఎప్పుడూ తానొక్కతే ఈ ప్రపంచంలో కష్టపడ్తు న్నట్లుగా మాట్లాడుతుంది. పార్వతి మన స్తత్వం తెలిసిన ప్రకాశం, పార్వతి సంతోషంగా తిరిగి వెళ్ళాలంటే తామేం చేయాలనే దాన్ని గురించి ఆలోచిస్తూ ఇంటికి చేరేడు.

ప్రకాశం కోసమే ఎదురు చూస్తున్న వదినా మరదళ్ళు భోజనాలకు లేచేరు. ఆ రోజు సందడిగా గడిచిపోయినందుకు స్థిమితంగా నిద్రకుపక్రమించేడు ప్రకాశం. వంట యింట్లోంచి వదినా మరదళ్ళ నవ్వులు వింటూనే నిద్రపోయేడు.

మర్నాడు సాయంత్రం - పార్కుకి బయల్దేరా రందరూ.

"మీ చీరలెలాగూ వుంటాయి కదా అని రెండు చీరలే తెచ్చుకున్నానొదినా. నీదో చీర ఇస్తావా" అంటూ అరుణ దగ్గరకొచ్చింది పార్వతి.

అక్కడే వున్న భారతి అక్క మాటలకు ఆశ్చర్యపోయింది. అక్క సూట్‌కేస్‌లో మధ్యా హ్నం అర డజను పైగా ఖరీదైన చీరలు చూసింది తను. తామిద్దరి చీరలు చూశాక అవి బైటపెట్టదలచుకోలేదన్న మాట.

అరుణ చీరల్లో తనకు నచ్చిన చీర తీసుకుని, తయారై వచ్చింది పార్వతి. అందరూ బయటికి నడిచేరు. చివరగా తాళంవేసి వీధిలోకొచ్చిన ప్రకాశం అరుణ చీరలో పార్వతిని చూసి నవ్వు కున్నాడు.

పార్వతి వచ్చి వారం దాటింది.

గంట నుంచీ భారతీ, అరుణ బ్రతిమిలాడుతున్నా ఇంకా సుముఖురాలు కాలేదు పార్వతి. ఆ రోజు

సినిమాప్రోగ్రాం వేసుకున్నారు. బుజ్జికి కొంచెం నలతగా వున్నట్లనిపిస్తే "పోనీ రేపు వెళ్దాంలే అక్కా" అంది భారతి. "దానికెప్పుడూ అట్లాగే వుంటుంది. ఇంతకీ నీకు ఇవాళ రావడం ఇష్టం లేదని చెప్పరాదూ...." రోషంగా అంది పార్వతి.

ఆ వారంలో నాలుగు సినిమాలు చూశారు. ఓ రోజు పార్కుకి, ఓ రోజు గుడికి వెళ్ళారు. గుడికి, పార్కుకి, ఒక సినిమాకి మాత్రమే అరుణ, ప్రకాశం వెళ్ళారు. మిగతావాటికి భారతే పార్వతితో వెళ్ళింది. నీళ్ళు కొత్త చేయటం వల్లనేమో బుజ్జికి బాగా జలుబు చేసి నలతగా వుంది. మధ్యాహ్నం నుంచి లేవకుండా అలా పడుకునే వుంది.

"పోనీ బుజ్జిని నేను చూసుకుంటాను. నువ్వా వదినా వెళ్ళండి భారతీ" అన్నది అరుణ.

తనకీ కొంచెం తలనొప్పిగా వున్నట్లున్నా అక్కకి మళ్ళీ ఏం కోపం వస్తుందో అని 'సరే' అంటూ లేచింది.

బాత్‌రూమ్‌లో నుంచి భారతి వచ్చేసరికి భారతి చీర తీసుకుని తయారై వుంది పార్వతి. వాసు నానిగాడితో ఆటల్లోపడి సినిమాకు రానన్నాడు.

భారతీ, పార్వతీ వెళ్ళాక తలుపేసుకుని చిన్నగా నిట్టూర్చింది అరుణ.

పార్వతి వున్నన్నాళ్ళూ అరుణ, భారతీ ఎంతో జాగ్రత్తగా మసలుకుంటారు. పార్వతి ఎక్కడ బాధపడుతుందో అని ఇద్దరూ ఎక్కడికక్కడ సతమతమౌతూ వుంటారు. అయినా పార్వతి ఎప్పుడూ కళ్ళనీళ్ళతోనూ, అసంతృప్తితోనే రైలెక్కుతుంది.

అరుణ వంట యింట్లో ప్రవేశించింది. వంట చివరిలో వుండగా ప్రకాశం వచ్చాడు. చెల్లెళ్ళిద్దరూ సినిమాకు వెళ్ళారని తెలుసుకుని అరుణకు సహాయం చెయ్యటం మొదలెట్టాడు. అంతలో బుజ్జి ఏడుపు వినపడింది. అరుణ వెళ్ళి బుజ్జిని తీసుకొచ్చింది.

"బుజ్జికి జ్వరం వచ్చిందండీ" బుజ్జిని ప్రకాశానికిస్తూ అంది అరుణ.

"డాక్టరు దగ్గరికి తీసికెళ్తాను" ప్రకాశం లేస్తూ అన్నాడు. అరుణ పాలు కలిపి బుజ్జిచేత తాగించింది. బుజ్జిని బుజం మీద పడుకోబెట్టుకుని బయటికి వెళ్ళాడు ప్రకాశం.

వాసూనీ, నానిగాణ్ణీ పిలిచి అన్నం పెట్టింది అరుణ. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నిద్ర పోయారు.

ఓ గంటలో తిరిగొచ్చేడు ప్రకాశం. ఇంజక్షను చేయటం వల్ల బుజ్జి ఏడ్చి నిద్రపోయింది. కొనుక్కొచ్చిన మందులు అరుణ చేతికిచ్చి బుజ్జిని పడుకోబెట్టాడు. ఇంతలో పార్వతీ, భారతీ సినిమా నుంచి వచ్చారు.

"నేననుకుంటూనే వున్నాను. జ్వరం వస్తుందో ఏంవిటో అని" విషయం విన్న పార్వతి కంగారు పడింది.

"అనుకున్నదానివి ఇవాళ్టికి సినిమా వొద్దంటే విన్నావా? చెత్త సినిమా. ఏం బాగా లేదు. తలనొప్పి తప్ప" విసురుగా అంది భారతి.

ఆ రాత్రి ఎవ్వరూ సరీగా భోజనం చేయలేదు.

తెల్లవారుతూనే భారతి బియ్యే రిజల్ట్సు వచ్చాయి. ఫస్టుక్లాసులో ప్యాసైంది భారతి. బుజ్జికి కూడా జ్వరం తగ్గడంతో అందరికీ ఎంతో సంతోషమైంది. ఆ రోజు మధ్యాహ్నం మరో వార్త ఆ యింటిని ఇంకా సంతోషంలో ముంచింది. "ఫలానా రోజున మేం తాంబూలాలు పుచ్చుకోటానికి వస్తున్నాం." అని భారతిని చూసి వెళ్ళిన పెళ్ళివారు వుత్తరం వ్రాశారు. భారతిని ఆటలు పట్టించడం మొదలెట్టింది అరుణ.

ప్రకాశం ఇంటికి రాగానే వుత్తరమిస్తూ సంగతి చెప్పింది అరుణ. ఇంతలో పార్వతి అక్కడకొచ్చింది. "అన్నయ్యా! నేను ఎల్లుండి వెళ్ళిపోతాను. అక్కడ పిల్లలూ ఆయనా ఏమిబ్బంది పడ్తున్నారో ఏమో. టిక్కెట్లు రిజర్వేషన్ చేయించు." అంటూ ప్రకాశం వైపు చూసింది.



1. ఒక దేశపు క్యాలెండర్‌లో ఒక్కొక్క సంవత్సరానికి చిహ్నంగా ఒక్కొక్క జంతువు ఎంచుకోబడింది. ఆ విధంగా అవి పుష్కరాని కొకసారు పునరావృతం అవుతాయి. అయితే అది ఏ దేశం?

2. ప్రపంచంలో కల్లా అతి పెద్దదైన యుద్ధ నౌక ఏదో చెప్పగలరా?

3. ప్రపంచ చరిత్రలోనే తొలిసారిగా ఒక వనిత ఒక దేశానికి అధ్యక్ష పదవిని అలంకరించింది. ఆమె ఎవరు? ఆ దేశం పేరేమిటి?

4. మన దేశం తొలిసారిగా అంతరిక్షంలోకి పంపిన ఉపగ్రహం పేరు 'ఆర్యభట్ట' అన్నది అందరికీ తెలుసు. అయితే యిటీవల మరో ఉపగ్రహాన్ని పంపింది. దాని పేరేమిటి?

5. వైద్యులు రోగులను పరీక్ష చేయడానికి ఉపయోగించే సాధనం 'స్టెతస్కోప్'. మరి ఈ 'స్టెతస్కోప్'ను ఎవరు కనిపెట్టారో చెప్పగలరా?

6. అమెరికా అంతరిక్షయానంలో విశేషమైన ప్రగతిని సాధించింది. అందులో ఒక భాగంగా ప్రయోగాలకోసం కొంత కాలం క్రితం స్కైలాబ్ లేక 'గగన ప్రయోగశాల'ను అంతరిక్షంలోకి పంపింది. సాంకేతిక కారణాల వల్ల అది భూమి మీదకి పడనున్నది. అయితే అది ఎంత వేగంతో భూమి వైపు పయనిస్తున్నది? దాని బరువెంత?

7. బంగారం, వెండి, రాగి, పాదరసం — ఈ నాలుగు లోహాలలోనూ దేనిపైన నత్రజని ఆమ్లం తన ప్రభావాన్ని చూపలేదో చెప్పగలరా?

8 భూమి మీద సంచరించే అతి పెద్దదైన వన్యమృగం ఏది?

9 మాడమ్ మాంటిస్సొరి—అంటే ఎవరు?

10. 'పంచతంత్రము'ను ఎవరు రాశారు? అందులో ఏ ఏ భాగాలు వున్నాయి?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

"అదేమిటి పార్వతీ! నాలుగు రోజుల్లో వాళ్ళు తాంబూలాలు పుచ్చుకోవడానికి వస్తుంటే నువ్వెళ్ళడం ఏమిటి? అన్నీ మాట్లాడుకున్నాక ముహూర్తం త్వరలోనే వుంటే బావగారికి వుత్తరం వ్రాసిపడేస్తాను, పిల్లల్ని తీసుకుని రమ్మని. ఈలోగా నువ్వెళ్ళడం దేనికి?" ప్రకాశం మాటలకు అడ్డు వస్తూ అంది అరుణ. "వచ్చి పది రోజులయిందో లేదో అప్పుడే ఇంటి మీద గాలి మళ్ళిందేవిటి? వదిన వెళ్ళదులెండి. ఇవతల శుభకార్యం పెట్టుకుని ఎలా వెళ్తుంది?"

"లేదులే వదినా. వెళ్ళాలి. అంతగా అవసరమైతే మళ్ళీ వస్తాను. టిక్కెట్ల విషయం మరిచిపోకు అన్నయ్యా" అంటూ లోపలికి వెళ్ళింది పార్వతి.

ఇంతలో భారతి ఫ్రెండ్స్ వచ్చారు. ఒకళ్ళనొకళ్ళు అభినందించుకున్నాక, అందరికీ స్వీట్స్ కాఫీలు తెచ్చింది భారతి.

ప్రకాశం నెమ్మదిగా వంటింట్లోకి చేరేడు. వయసులో ఎదిగినా, మనసు ఎదగని పార్వతి మీద అతనికి చాలా జాలిగా వుంది. అరుణతో పెళ్ళివారి గురించి ఆలోచించడం మొదలెట్టాడు.

ముందు గదిలోంచి పెద్దగా నవ్వులు వినిపించాయి. అంతలో పార్వతి గొంతు వినవడింది. "మా అన్నయ్య నాకు ఇంటర్ వరకే చెప్పించి పెళ్ళి చేశాడు. లేకపోతే నేనూ బియ్యే అయ్యేదాన్ని" ఆ అనడంలో తాను చదవలేకే మానేశానన్న అర్థం లేకుండా ప్రకాశం మీద నిష్ఠూరమే ఎక్కువగా వుంది.

పార్వతి మాటలు విన్న ప్రకాశం తెల్లబోయాడు. అతని బాధను గమనించిన అరుణ అతన్ని మళ్ళీ మాటల్లో పడేసింది.

భారతి ఫ్రెండ్సందరినీ సాగనంపి లోపలికి వచ్చింది. పార్వతి వెనకాలే వచ్చి ప్రకాశం పక్కగా కూర్చుంది.

"అన్నయ్యా, అక్క వెళ్తానంటోంది" భారతి మాటలకు అడ్డొస్తూ "మీకు తెలీవే నా పరిస్థితులు. నేను వెళ్ళాల్సిందే. అన్నయ్యా రిజర్వేషన్ సంగతి మరిచిపోకు." పార్వతి ఖచ్చితంగా చెప్పింది. పిల్లలు అన్నాలకు రావడంతో ఆ ప్రసంగం ఆగిపోయింది.

మర్నాడు కూడా అరుణ పార్వతిని పెళ్ళిదాకా వుండమని బలవంత పెట్టింది. కానీ పార్వతి వెళ్ళి తీరాలని మొండి కేసింది.

ఆ సాయంత్రం పార్వతి, అరుణ బజారు వెళ్ళారు. అరుణ పార్వతిని చీర తీసుకోమంది. నూటడెబ్భై రూపాయల్లో అమెరికన్ జార్జెట్ చీర తీసుకుంది పార్వతి. పిల్లలకు బట్టలు తీసుకుని ఇంటికి చేరారు.

"పెళ్ళి కెలాగూ పెద్ద చీర పెట్టాలి. చౌకలో వంద రూపాయల్లో తీసుకోకపోయావా" అన్నాడు ప్రకాశం అరుణతో నెమ్మదిగా.

"పోనీలెండి. పట్టిమనిషి కాదు గదా. ఆవిడ తృప్తిపడితే అంతేచాలు" అంటూ ప్రకాశం వైపు ఓసారి చూసి అక్కడి నుండి కదిలింది అరుణ. ఆ చూపులో – 'మీ చెల్లెలి సంగతి మీకు తెలీదా' అన్న భావాన్ని చదివాడు ప్రకాశం.

తలంటి పోసుకుని కొత్త చీర కట్టుకుంది పార్వతి. అరుణ పిల్లలకోసం ఇచ్చిన తినుబండారాలన్నీ సర్దుకుంది.

"భారతీ! నీ వాచీ నాకు చాలా బాగుందే. నేను తీసికెళ్తానే" అంది పార్వతి. తెల్లబోతూ చూసింది



## వి. శాంతి శ్రీదేవి

'పండితపుత్ర పరమ శుంఠః' అని అన్నారు పెద్దలు. అది పుత్రులకి వర్తిస్తుందేమో కాని పుత్రికలకు మాత్రం కాదని నిరూపించింది కుమారి వెల్లటూరి శాంతి శ్రీ దేవి. ఆమె తండ్రి శ్రీ పూర్ణానంద శర్మ వేదాలభ్యసించిన పండితుడు కాదు గానీ చిత్రలేఖనంలో తలపండిన ఉద్దండుడు. శాంతి శ్రీదేవికి కూడా చిన్నతనంలోనే చిత్రలేఖనం పట్ల ఉత్సాహం కలిగింది. అందుకు తండ్రి ప్రోత్సాహం లభించింది.

పాలకొల్లులో జరిగిన ఆంధ్రప్రదేశ్ బాలల చిత్రకళ పోటీలలో తన ఐదవఏటనే శాంతిశ్రీ ప్రథమ బహుమతి గెల్చుకున్నది. అప్పుడామె వేసిన చిత్రం పేరు-'మా ఊరు'. 1969 లో జపాన్ అంతర్జాతీయ బహుమతినీ '73 లో అమృత్‌సర్ ఆర్ట్స్ అకాడెమివారి బహుమతినీ పొందింది. భీమవరం, సిద్దిపేట, గుంటూరు, వెల్లటూరులలో జరిగిన అనేక చిత్రకళా ప్రదర్శనలలో పలు బహుమతులు పొందిన శాంతి శ్రీదేవి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించాలని ఆశిస్తోంది.

—ఆర్. భార్గవి





భారతి. అరుణ విననట్లుగా అక్కడ్నించి వెళ్ళిపోయింది.

పార్వతి వచ్చినప్పట్నుంచీ ఒక్క క్షణం కూడా భారతి వాచీ వదలలేదు. పూరికెనే మోజు కొద్దీ పెట్టుకుంటోందనుకున్నారే గానీ, తీరా ఇలా అడుగుతుందని ఎవ్వరూ అనుకోలేదు. లోగడ ప్రకాశం పార్వతికి కూడా వాచీ కొనిపెట్టాడు. అది క్రమేపీ పిల్లలకు ఆట వస్తువు క్రింద అయిపోయింది. మళ్ళీ ఇది కూడా అట్లాగే అవుతుంది: వస్తువుల మీద పార్వతి శ్రద్ధ ఎలాంటిదో తెలిసి కూడా భారతి ఏమీ మాట్లాడ లేకపోయింది.

టయిమయిందంటూ రిక్షాలు తెచ్చాడు ప్రకాశం.

"పురిటికి ఇక్కడికే వస్తా ఒదినా. అక్కడ పిల్లలతో చాలా కష్టం అవుతుంది" కళ్ళు చెమర్చాయి పార్వతికి.

"తప్పకుండా రా. ఇది నీ పుట్టిల్లు. నీకు ఎప్పుడూ స్వాగతమే" నవ్వుతూ అంది అరుణ.

'ఇంతకు ముందు నాలుగు కాన్పులకు ఇక్కడికే వచ్చింది. కడుపుతో వున్నప్పుడు ఏడోనెలన వచ్చి, పుట్టిన పిల్లలకు ఐదవనెల వచ్చాక గానీ వెళ్ళేదికాదు. తనకి మొన్నటికి అయిదవనెల వచ్చిందో లేదో మళ్ళీ పురిటికి వస్తానని అప్పుడే చెప్పేస్తోంది. వదిన ఎంతో మంచిది కాబట్టి గానీ, నిజానికి అలా ఏదైనా అనుకునే మనిషయితే ఎలా జరిగేదో' అక్క మీద మనసులోనే విసుక్కుంది భారతి.

"మీ అన్నయ్య వుత్తరం రాస్తారు. పెళ్ళికి పదిరోజులు ముందుగానే రా వదినా." అరుణ రిక్షాదాకా వచ్చి చెప్పింది పార్వతితో.

నానిగాడి చేతిలో బిస్కెట్లు కొనుక్కోమని ఓ రూపాయి పెట్టి, కళ్ళు తుడుచుకుంటూనే రిక్షా ఎక్కింది పార్వతి.

చూస్తూండగానే రిక్షాలు కనుమరుగయినై.

నాలుగు రోజులు నాలుగు క్షణాల్లా గడిచాయి.

పెళ్ళివారొచ్చారు. తాంబూలాలు పుచ్చుకున్నారు. పదిరోజుల్లో మంచి ముహూర్తం వుందని నిశ్చయించారు.

పార్వతికి టెలిగ్రాం ఇచ్చాడు ప్రకాశం. వెంటనే బావగారికి లెటర్ కూడా వ్రాశాడు.

పెళ్ళి పనులు చకచకా సాగాయి. పెళ్ళి నిర్విఘ్నంగా జరిగింది.

అయితే —

పెళ్ళికి పార్వతిగానీ–పార్వతి భర్త రామనాథం గానీ రాలేదు. పార్వతి రాకపోవడాన్ని గురించి తలోరకంగా అనుకున్నారు.

మనుగుడుపుల హడావిడి అయిన మర్నాడు—

భారతి తనకు వచ్చిన ప్రెజంటేషన్స్ అన్నింటినీ అలమరలో సర్దుతోంది.

నానిగాణ్ణి నిద్రపుచ్చి అరుణ స్టోర్ రూమ్ సర్దుతోంది.

ప్రకాశం ముందుగదిలో వాలుకుర్చీలో కూర్చుని జమ - ఖర్చులు చూసుకుంటున్నాడు.

అందరి మనస్సుల్లోనూ పార్వతే మెదుల్తోంది.

పోస్ట్‌మాన్ పిలుపుతో ఉలిక్కిపడి లేచివెళ్ళాడు ప్రకాశం.

రెండు కవర్లిచ్చాడు పోస్ట్‌మాన్. వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చుని ఒకటి తెరిచాడు.

"భావగారికి – ఏ కారణం చేతనో పార్వతి–భారతి పెళ్ళికి రావడానికి వొప్పుకోలేదు. నన్ను కూడా వెళ్ళవద్దని పిల్లల మీద వొట్టు పెట్టింది. అందువల్లనే నేను కూడా రాలేకపోయాను. అన్యధా భావించక నన్ను క్షమించి ఇందుతో పంపుతున్న అయిదువందల రూపాయల డ్రాఫ్టును భారతికి పెళ్ళి కానుకగా ఇవ్వకోరుతున్నాను-రామనాధం."

ఆశ్చర్యపోతూ రెండవ కవరు విప్పాడు ప్రకాశం. అందులోని సారాంశం అతని ఆశ్చర్యాన్ని ద్విగుణీకృతం చేసింది.

"అన్నయ్యా! నేను భారతి పెళ్ళికి రాలేదని-నన్నెంతో చెడ్డదాన్నిగా అనుకుని వుంటారు. పైకి కనపడకుండా మీరు నాకు ఎంతో అన్యాయం చేశారు. మొదటి నుంచీ భారతినీ-నన్ను 'ఒక కంట్లో బెల్లం-ఒక కంట్లో సున్నం' పద్ధతిలోనే చూస్తున్నారు వదినా, నువ్వు. పెళ్ళి విషయంలో కూడా అలాగే చేశావు. భారతి భర్తా వాళ్ళు కనీసం ఇరవై వేలన్నా కట్నం అడుగుతారని నువ్వూ, వదినా అనుకోవడం నేను వినకపోలేదు. అంటే, మీరు అంతకి సిద్ధమైనట్టేకదా! మీ బావకు పదివేలిచ్చి నీ శక్తికి మించిన పనిగా బాధపడే వాడివి. ఖరీదైన చీరెలూ, విలువైన నగలూ సమకూర్చి భారతిని మీరెంత నెత్తిన పెట్టుకుంటున్నదీ మొన్న చూశానుగదా! సాటి వాళ్ళల్లో కూడా చులకన కావడం దేనికి? అందుకే నేను పెళ్ళికి రాలేదు. ఒక్క విషయం మాత్రం నీకు జ్ఞాపకం చేయక తప్పటం లేదు. నీకు ఇద్దరు చెల్లెళ్ళు–పార్వతి."

నవ్వుకున్నాడు ప్రకాశం. "పిచ్చిపార్వతీ! ఇరవై వేల కట్నం తీసుకోవటానికి తగిన అర్హతా, అంతస్తూ వుండి కూడా పైసా తీసుకోలేదు భారతి భర్త. ఈ మాట నేను నీకిప్పుడు చెప్పినా నమ్మవు. అసూయ ముందు పుట్టి ఆడది తర్వాత పుట్టిందంటే 'కాబోలు' అనుకునేవాణ్ణిగానీ, చెల్లెలి అదృష్టానికీ అసూయపడే అక్క వుంటుందంటే నాచేత 'అవును నిజం' అనిపిస్తావనుకోలేదు!!" □

## ఈ జీవితమింతే!

ఏకశిలా నగరమైనా
ఏరువాకా పున్నమైనా
ఏకాంత జీవితానికి
ఏక శోక సాగరమే.

వెన్నెల నిండినా
వెల్లువైపొంగినా
మనసు మూగదైతే
మనుగడలో మార్పురాదు.

ఏది నాకు సొంతం?
ఏ బంధం శాశ్వతం?
ఏదో తెలిసని బాధకు అంకితం
ఏ గమ్యమెరుగని జీవితం.

ఎదమంటలు రేగినా,
ఎవరున్నారు చల్లార్చువారు?
ఎవరికేమౌతాను నేను?
ఎవరేమౌతారు నాకు?

మనసుపడే మూగ బాధ
మాటల్లో చెప్పలేను.
మంచితనమే మహా పాపం!
మనిషికదో తీరని శాపం!

ఈ జీవితం నాది కాదు
ఈ జీవనం నాది కాదు
ఇది ఎవరికో సొంతం
ఇది నాకు తప్పదు ఆమరణాంతం.

—పాటిబండ్ల విజయలక్ష్మి

# నాణ్యతగల వస్తువులు ఎన్నుకోవడం ఎలా?



## వినియోగదార్లకు:

కమల బజార్లో పాలడబ్బా కొన్నది. కాని మూడు రోజులకే అది కాస్తా వుండలుకట్టి, పురుగులు పట్టింది. చూస్తూ చూస్తూ పిల్లాడికి ఆ పాలు పట్టలేదుకదా. దాంతో అంత డబ్బుపెట్టి కొన్న పాలపొడి కాస్తా చెత్తబుట్టలో పారెయ్యాల్సి వచ్చింది.

రాధ కమల పొరుగింట్లో వుంటోంది. ఇస్త్రీ చేసుకునేందుకు సులభంగా వుంటుందని ఒక ఆటోమేటిక్ ఇస్త్రీపెట్టె కొన్నది. కాని ఆ మర్నాడే అది కాస్తా 'ఫట్' మంది. ఆ ఇస్త్రీపెట్టె కంపెనీ చేసిన భారీ ప్రచారం చూసి రాధ అది కొన్నది. గ్యారంటీ కార్డు పేరుకి వుందే కానీ ఆ కంపెనీకి వెళ్ళిన వస్తూవేదీ తిరిగి రాలేదని తెలుసుకుంది రాధ. ఏం చేస్తుంది? అంత ఖరీదుపెట్టి కొన్న ఇస్త్రీ పెట్టెని కాస్తా మూలపడేసింది. నాణ్యత లేని వస్తువులు కొనడం వల్ల ఏర్పడిన పరిణామం యిది.

అసలు మార్కెట్‌లో ఈనాడు ఎన్నో రకాల వస్తువులు వస్తున్నాయి. బేబిఫుడ్ కానివ్వండి, బిస్కత్తులు కానివ్వండి మరోటేదైనా కానివ్వండి. ఒక వస్తువు బజార్లోకి వచ్చి విరివిగా అమ్ముడు పోతోందీ అంటే వెంటనే అటువంటి వస్తువులు మరెన్నో పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి. జనాభా పెరుగుతున్నట్లే ప్రజల అవసరాలు కూడా నానాటికీ పెరుగుతున్నాయి. అందువల్ల సహజంగానే వీటిలో అనేక వస్తువులకి గిరాకీ వుంటోంది.

అందువల్ల కమల, రాధల్లాగే చాలామందికి యిలా తయారవుతున్న వస్తువుల్లో నాణ్యతగలవేవీ లేనివి ఏవీ అని నిర్ణయించడం కష్టమైపోతోంది. పెద్ద పెద్ద సంస్థలు ప్రచార సాధనాల ద్వారా తమ వస్తువులకు భారీ ఎత్తున ప్రచారం చేస్తున్నాయి. ఈ ప్రచారంలో వుపయోగించే పదజాలం చూసి అనేక మంది ప్రలోభపడి ఆ వస్తువులు ఖరీదు చేస్తున్నారు. నిజానికి చాలామందిని తప్పుదారి పట్టిస్తున్నవి ఈ బూటకపు ప్రచారాలే. సగటు మానవునికి నాణ్యత గురించి సాంకేతిక పరిజ్ఞానం లేకపోవడం మూలాన, ఈ ప్రచారాలనిబట్టి, తమకు లభించిన యితరత్రా సమాచారాన్నిబట్టి ఆ వస్తువులు కొనడం జరుగుతోంది. ఇలాంటి వస్తువులు కొనడం మూలాన అవి కొన్నవారికి సంతృప్తికరంగా వుండదు; ఆహారసామగ్రి అయితే ఆరోగ్యమూ పాడవుతుంది.

అయితే బజారులో లభించే వస్తువులు నాణ్యత గలవా లేవా అని తెలుసుకునేందుకు అవకాశమే లేదా?

ఎందుకు లేదు....వుంది. అది అనేక వస్తువుల మీద కనిపించే ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్‌వారి చిహ్నం ఐ. ఎస్. ఐ.

ఒక్కొక్క వస్తువుకి ఒక్కొక్క ప్రమాణం మేరకు దాని నాణ్యతకు కొలమానం నిర్ణయిస్తుందీ సంస్థ.

1947 లో ప్రారంభించబడిన ఈ సంస్థ 1952 నుంచి తాము రూపొందించిన ప్రమాణాల మేరకు తయారీదారులకు లైసెన్సులు మంజూరు చేయడం ప్రారంభించింది. భారతదేశంలోని ముఖ్య నగరాలన్నిటిలోనూ శాఖలు - ప్రయోగశాలలు వున్న ఈ సంస్థ ప్రధాన కార్యాలయం ఢిల్లీలో వుంది.

బిస్కత్తులు, ఇన్‌స్టెంట్ కాఫీ, బేబిఫుడ్స్, ఆహారంలో వుపయోగించే ఫుడ్‌కలర్స్, సబ్బులు, బ్లేడులు, ఇస్త్రీపెట్టెలు, వాటర్ హీటర్స్, ప్రెషర్ కుకర్స్, అల్యూమినియమ్ గిన్నెలు, బెడ్‌షీట్లు, సిరాలు, తెల్ల కాగితం-యిలా మనం నిత్యం వుపయోగించే గృహ సంబంధమైన వస్తువులు నూటయాభై దాకా ఈ మార్కు పొంది వున్నాయి. ఇవికాక అనేక వందల పారిశ్రామిక వస్తువులు, వ్యవసాయ పనిముట్లు తదితర పరికరాలు కూడా ఐ. ఎస్. ఐ. చిహ్నం కలిగివున్నాయి.



నేడు తయారీదారులు అధికంగా ఈ సంస్థ నుండి లైసెన్సు పొందడం పట్ల వుత్సాహం చూపడానికి కారణం – వారిలో వారికి నానాటికీ పెరిగిపోతున్న పోటీయే. తమ వస్తువు నాణ్యత గురించి తెలియజెప్పడానికీ; వినియోగదార్లలో నమ్మకం కలిగించడానికీ వారు ఈ లైసెన్సుపట్ల మోజు చూపుతున్నారు. అయితే యిటువంటి పోటీ మంచిదే.- ఆరోగ్యదాయకం కూడా. ఇలా వారు లైసెన్సు పొందాలంటే అందుకు చెల్లించాల్సిన రుసుము కేవలం ఆ వస్తువు ఖరీదులో రెండు శాతం మాత్రమే. కాని ఆ వస్తువు నాణ్యతా ప్రమాణాలు మాత్రం ఈ సంస్థ రూపొందించిన పరిధులలోనే వుండాలి. తమ వస్తువులను పరీక్షించడానికి తగిన ప్రయోగశాల నిర్మించుకోవాలి.

"ఏ కారణం వల్లనైనా గానీ ఈ ఐ. ఎస్. ఐ. చిహ్నం వున్న వస్తువు పాడయిపోయినట్లయితే వినియోగదార్లు తమకు సమీపంలో గల కార్యాలయానికి వివరాలతో సహా ఫిర్యాదు చేయవచ్చును. మేము ఆ ఫిర్యాదును పరిశీలించి, ఆ వస్తువులో నాణ్యత ప్రమాణాలు లోపించినట్లు రుజువైతే ఫిర్యాదుదారుకి ఆ వస్తువుకి బదులుగా నాణ్యత గల అదే వస్తువు మరోటి అందజేస్తాము.

ఆ తరువాత ఆ వస్తువు తయారీదారుని హెచ్చరించి యికపై నాణ్యత తగ్గకుండా చూడమని హెచ్చరిస్తాము. అప్పటికీ తయారీదారు మేము విధించిన నిబంధనల మేరకు నాణ్యతగల వస్తువు తయారుచేయక పోయినట్లయితే తాత్కాలికంగా లైసెన్సు రద్దుచేయడం కాని శాశ్వతంగా ఐ. ఎస్. ఐ. చిహ్నం వారు యిక ఉపయోగించలేనట్లుగాని చేస్తాము" అని తెలియజేశారు మద్రాసులోని ఐ. ఎస్. ఐ. డైరక్టర్ శ్రీ ఎమ్. రఘుపతి.

ఒకవేళ తయారీదారులు చట్ట సమ్మతంగా ఐ. ఎస్. ఐ. చిహ్నం పొందకుండా దానిని తమ వస్తువుల అమ్మకానికి వినియోగించుకున్నట్లయితే వారికి జరీమానాగానీ జైలు శిక్షగానీ పడుతుంది. ఈమధ్య మద్రాసులోని ఒక పారిశ్రామిక సంస్థ ఈ విధంగా చేసినందుకు పదివేల రూపాయలు జరీమానా చెల్లించవలసి వచ్చింది. తయారీదారులు

మన డ్రాయింగ్ హాలు అలంకరణకోసం అనేక బొమ్మలను తయారుచేస్తూంటాము. అందులో ఫొటోలో చూపిన కట్ - ఔట్ డాల్ వంటిది తయారుచేయటానికి కావలసిన వస్తువులు :

ఒక మాదిరి దళసరి అట్ట

రంగుల గుడ్డలు (తెలుపు, బ్రౌను) చిన్నవి

ఒక స్కెచ్ పెన్ను

ఒక కార్డుబోర్డు 14″×9″ సైజు

కొన్ని కొండచీపురు పుల్లలు

తయారుచేసే విధానం :

ప్రక్క స్కెచ్‌లో చూపిన విధంగా ఏడు భాగాలుగా అట్టముక్కలను కత్తిరించాలి. 2, 3, 5, 7, నంబర్లుగల అట్టముక్కలకి క్విక్ ఫిక్స్‌తో బ్రౌన్ రంగు గుడ్డని అతికించాలి. (బయటకు కనిపించే






వైపు ముడతలు ఉండకూడదు. గుడ్డను వెనుకకు - అంటే, "రాంగ్ సైడ్" మడవాలి) మిగిలిన ముక్కలపై (1, 4, 6) తెలుపు రంగు గుడ్డ అంటించాలి. వీటిని అలా వుంచి, 14″×9″ సైజు కార్డుబోర్డుపై గోనె గుడ్డ అంటించాలి. ఈ కార్డు బోర్డు ఆరిన తరవాత, దాని మధ్యలో బొమ్మ విడివిడి భాగాలను కలిపి అతకాలి. ముందుగా చేతులు, ముఖం, నడుము, కాళ్ళు (2, 3, 5, 7) అంటించి, కదలకుండా పైన ఎత్తు పెట్టాలి. 10 నిమిషాలు ఉంచితే బాగా అతుక్కుంటాయి. తరవాత 1, 4, 6 అతకాలి. అంటే, ముందుగా అతికించిన బ్రౌన్ ముక్కలు బొమ్మ క్రింది భాగంలో ఉండాలి. వీటిపై తెలుపు భాగాలు అతకాలి.

ఇది పూర్తి అయిన తరువాత, నల్ల స్కెచ్ పెన్నుతో లంగాకి, బ్లౌజ్‌కి డిజైను గీయాలి. ఇంతటితో ఫొటోలోని అమ్మాయి బొమ్మ పూర్తి అయినట్టే! కొండచీపురు పుల్లలను బద్దలుగా చీల్చి "ఆర్చ్" ఆకారంలోనూ, పక్షుల ఆకారంలోనూ కత్తిరించి అతికితే బొమ్మ పూర్తవుతుంది. ఇప్పుడు ఆ బొమ్మకు ఫ్రేము కూడా చేయిస్తే ఇంకా ఎంతో అందంగా ఉంటుంది! —దండు విజయలక్ష్మి

పొందిన ఐ. ఎస్. ఐ. లైసెన్సులు సంవత్సర కాలం పాటు అమలులో వుంటాయి. ఆ తరువాత వాటిని ప్రతి సంవత్సరం తిరిగి పొందుతూ వుండాలి.

మనం ఉపయోగించే వస్తువులలో ప్రతీది ఈ సంస్థ వద్దనుండి యోగ్యతాపత్రం పొందిన తరువాతనే మార్కెట్ చెయ్యాలని నియమం లేదు. అయితే ప్రభుత్వం కొన్ని వస్తువుల్ని ఉదాహరణకి- విదేశాలకు ఎగుమతిచేసే అల్యూమినియం పాత్రలని, ఆహారంలో వుపయోగించే రంగులని, తెల్ల కాగితం, గ్యాస్ సిలిండర్లు మొదలైనవి విధిగా ఐ. ఎస్. ఐ. సర్టిఫికేటు పొంది తీరాలన్న నియమాన్ని రూపొందించింది. అలాగే కొన్ని వస్తువులు- ఇళ్ళల్లో ఉపయోగించే విద్యుత్ పరికరాలు, ఇస్త్రీ పెట్టె, వైర్లు, వాటర్ హీటర్స్ మొదలైనవి వీరి సర్టిఫికేటు పొందినా పొందకపోయినా ఈ సంస్థ నిర్దేశించిన నాణ్యత పరిధులలోనే వాటిని తయారు చేయాలి. టూత్‌పేస్టు, ఫేస్‌పౌడర్, తలనూనె, షాంపూ మొదలైన వాటికి కూడా ఈ సర్టిఫికేటు పొంది తీరాలన్న నియమం రాబోతున్నది.

మరి ఈ సంస్థకు చెందిన వ్యక్తులు అలా తయారైన వస్తువులు తాము రూపొందించిన ప్రమాణాలకు సరిగ్గా సరిపోయేటట్లు వున్నాయా లేదా అని ఎలా తెలుసుకుంటారు ?

"మా సాంకేతిక నిపుణులు ఆయా ఫ్యాక్టరీలకి, తయారుచేసే స్థలాలకి వెళ్ళి ఆ వస్తువుల్ని పరీక్ష చేస్తూ వుంటారు. అంతేకాదు. దేశంలో నాలుగు మూలలా నాలుగు పట్టణాలను ఎంచుకుని అక్కడినుంచి ఆ వస్తువు శాంపిల్స్ తెప్పిస్తాము. వాటిని మా ప్రయోగశాలలో పరిశోధిస్తాము. ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నాం కాబట్టే మా చిహ్నం గల వస్తువులు యితర వస్తువుల కన్న నాణ్యత గలిగి వుంటున్నాయి" అన్నారు శ్రీ రఘుపతి.

జాతీయ స్థాయిలో ఏర్పరచిన ఈ ప్రమాణాల మేరకు తయారీదారులు తమ వస్తువులను తయారు చేసినట్లయితే, ఆ వస్తువుల మీద, వాటి నాణ్యత మీద నమ్మకం పెరగడంతో వినియోగదార్లు విరివిగా వాటిని కొంటారు. ఒక కొలమానం ప్రకారం అంతా జరగడంతో తయారు చేయడంలో వృధా జరగడమనేది వుండదు. ఇది తయారీదారుకీ లాభదాయకమే కదా. అట్లాగే వినియోగదార్లు కూడా ఎటువంటి భయమూ లేకుండా ఆ వస్తువులు ఉపయోగించడానికి అవకాశం ఏర్పడుతుంది.

ప్రభుత్వం కూడా ప్రజల ఆరోగ్యమూ, రక్షణా దృష్టిలో వుంచుకుని ప్రతి వస్తువు - "యిది ఈ ప్రమాణంలో వుండాలి" అని కొలమానం ఏర్పరచి అది అమలు జరిగేటట్లు చట్టం తేవాలి. ఆ ప్రమాణాలను ఉల్లంఘించిన వారికి కఠినశిక్ష విధించాలి.

అసలు ఇతర దేశాలతో పోల్చి చూస్తే మన దేశంలో వినియోగదార్లలో చైతన్యం అంతగా లేదనే చెప్పాలి. వారికి తగ్గట్టుగానే తయారీదార్లు కూడా 'మనం ఏది చేసినా కొంటార్లే' అనే ధీమాతో చవకబారు వస్తువులు, పదార్థాలు తయారు చేసి పంపిణీ చేస్తున్నారు. అటువంటి ధీమా తయారుదారుకి కలగకుండా చెయ్యవల్సిన బాధ్యత- ఆ వస్తువులు కొని, ఉపయోగించే వినియోగదార్ల మీదనే వుంది. నాణ్యత లోపించిన వస్తువుల్ని కొనడం మానేస్తే సరి – తయారీదారు తనంతట తానే దారిన పడతాడు.

అయితే యిలా చేయడానికి ఐకమత్యం అవసరం. వినియోగదార్లందరూ ఒక ఐక్య శక్తిగా రూపొందాలి. నాణ్యతా, మన్నికగల వస్తువుల కోసం పోరాటం సాగించాలి. □

కావలసిన పదార్థాలు : ½ కిలో టొమాటోలు, 1 టేబుల్‌స్పూన్ పచ్చిబియ్యం, 2 పెద్ద ఉల్లి పాయలు, 2 బుంగ మిరపకాయలు (వీటినే 'సిమ్లా మిర్చి' అని కూడా అంటారు), 2 కప్పుల బెండ కాయ ముక్కలు, 4-6 కప్పులదాకా కూరలు ఉడక బెట్టిన తరువాత మిగిలిన నీరు, 2 టేబుల్ స్పూన్ల వెన్నగానీ, వెయ్యిగానీ. తగినంత ఉప్పు, మిరియపు పొడి.

తయారు చేయవలసిన విధానం : ముందుగా టొమాటోలు, ఉల్లిపాయలు, బుంగ మిరపకాయలు ముక్కలుగా తరుక్కుని విడిగా వుంచుకోవాలి. బాణలిగాని, పాత్రగాని తీసుకుని అందులో ఒక టేబుల్ స్పూన్ వెన్న వేసి స్టవ్ మీద వుంచాలి. వెన్న కరిగిన తరువాత పచ్చిబియ్యం అందులో వేసి బంగారు వన్నెరంగు వచ్చేదాకా వేయించాలి.



# టొమాటో బెండకాయ సూప్

వర్ణచిత్రం : సత్యకుమార్

ఇప్పుడు దానికి కూరలు ఉడకబెట్టగా మిగిలిన నీరు చేర్చాలి. బాగా ఉడికిన తర్వాత టొమాటో, ఉల్లిపాయ, బుంగమిరపకాయ ముక్కలు అందులో వెయ్యాలి. ఈ మిశ్రమం చిక్కగా అయిన తరువాత స్టవ్ మీద నుంచి దింపి బ్లెండర్‌లోగానీ కవ్వంతోగానీ బాగా చిలకాలి. ఇప్పుడిక మిగిలిన ఒక టేబుల్ స్పూన్ వెన్న ఒక పాత్రలో తీసు కుని స్టవ్ మీద వుంచి అందులో బెండకాయ ముక్కలు వెయ్యాలి. ఈ ముక్కలు బాగా వేగిన తరువాత వీటిని సూప్‌లో కలపాలి. ఈ సూప్ బాగా చిక్కగా కావాలనుకున్న వాళ్లు ఉడకబెట్టిన టొమాటోలను తోలు శుభ్రంగా వలిచి సూప్‌లో కలుపుకోవచ్చును. వేడి మీద ఈ సూప్ ఎంతో రుచిగా వుంటుంది. బలవర్ధకం కూడా.

—శోభారామ్‌జీ

# యథార్థగాథ

ఆంధ్రదేశంలో అదో గ్రామం. పేరు పాదుర. ఆ గ్రామంలో వుంటున్నారు బలరామయ్య, రమణమ్మ దంపతులు. వారికి ఇద్దరు పిల్లలు. ఉన్నంతలో జీవితాన్ని ఆనందంగానే గడుపుతున్నారు. పాతికేళ్ళప్రాయంగల ఆ ఇల్లాలికి జీవితంలో పెద్దగా కోరికలంటూ లేవు. ఏదో ఆ విధంగా జీవితం గడిచిపోతే చాలనుకునే అమాయకురాలు. ఆమె ఏవైనా పూజలు చేసిందంటే అది తన కుటుంబం బాగుండాలనీ, తన పిల్లలకి ఏ లోటూ రాకూడదని మాత్రమే. ఆ విధంగా గుట్టుగా కాపురం నెట్టుకొస్తోంది ఆమె.

ప్రతిరోజులాగే ఆరోజు కూడా పిల్లలకీ, భర్తకీ భోజనంపెట్టి, తను తిని, పనైన తర్వాత నిద్రకు ఉపక్రమించింది రమణమ్మ, రోజులు యింత సంతృప్తిగా గడిచిపోతే ఎంత బాగుండును అనుకుంటూ....

*

కాని.... ఆ రాత్రి....

హఠాత్తుగా ఆంధ్రరాష్ట్రం మీదకి పెనుతుపాను విరుచుకు పడింది. ఆ తుపాను పాదుర గ్రామాన్ని కూడా కబళించి వేసింది. ప్రాణాలరచేత పట్టుకుని గుడిసె ప్రాంతం వారు, పల్లపు ప్రాంతాలవారూ డాబా యిళ్ళమీదా, చెట్ల మీద తలదాచుకుంటు న్నారు. చిన్నా పెద్దా ఏడుపులు, కేకలు తుపాను రక్కసి చెవికెక్కితే కదా.... అది కాస్తా తను చేయవలసిన విధ్వంసకాండ చేసి చక్కాపోయింది. అందానికీ, ఆనందానికీ మారు పేరైన ప్రకృతి, విలయతాండవం కూడా చెయ్యగలనని నిరూపించింది.

తమ కళ్ళెదుటే తమ ఇళ్ళు కూలిపోవడం, సామగ్రి నీటిలో కొట్టుకుపోవడం చూస్తూ ఏమీ చెయ్యలేని నిస్సహాయస్థితిలో వున్నారు ఆ గ్రామస్థులు. పశువులు.... అక్కడక్కడ మనుష్యులు కూడా ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు.

ఎవరు వున్నారో.... ఎవరు పోయారో.... ఎవరికీ తెలియదు. అసలు పట్టించుకునేందుకు సమయమేది? ఎవరికివారే తమ ప్రాణాలను, పిల్లలను కాపాడుకోవడంలో నిమగ్నులై వున్నారు.

కూలిపోతున్న యిళ్ళనీ, కొట్టుకుపోతున్న 'సంపద'ని చూస్తూంటే బ్రతుకు మీద భయం, అంతలోనే ప్రాణాల మీద తీపి .... అంతటా కోలాహలం.... హృదయాలలో ఆరాటం – ఇదీ అక్కడి పరిస్థితి.

*

తుపాను తాకిడి తగ్గింది. కాని గ్రామంలో కళాకాంతులు లేవు. మరుభూమిలా వుంది. కూలిపోయిన తమ ఇళ్ళని చూసి రోదిస్తున్నారు కొందరు. అందుకు కూడా శక్తిలేక దిగులుగా చూస్తున్నారు మరి కొందరు. ఎవరి మొహాలలోనూ కళాకాంతి లేవు.

పత్రికా విలేఖరులు వస్తున్నారు. ఫొటోలు తీస్తున్నారు. ప్రశ్నలు అడుగుతున్నారు. అధికారులు వస్తున్నారు. పరామర్శిస్తున్నారు. భోజనం పొట్లాలు పంచి పెడుతున్నారు. స్వచ్ఛంద సేవా సంస్థల కార్యకర్తలు హడావిడిగా తిరుగుతున్నారు. అంత వరకూ ప్రశాంతంగా వున్న గ్రామంలో కల్లోలం చెలరేపింది తుపాను. ఆ కల్లోలంవల్ల ఈ గందరగోళం.

రమణమ్మ, ఆమె భర్త, పిల్లలు తుపాను తాకిడికి తట్టుకుని బయటపడ్డారు. కాని వుండడానికి యిప్పుడు ఇల్లేది?

ఏం చెయ్యాలి? ఎక్కడుండాలి? పిల్లలతో ఎలా గడపాలి – ఆలోచిస్తున్నారు ఆ దంపతులు. వారే కాదు ఆ గ్రామంలో అనేకమంది ఎదుర్కొంటున్న ప్రశ్న అది.

ఆ ప్రశ్నకి సమాధానంగా ప్రభుత్వం తుపాను బాధితులు ఇళ్లు కట్టుకునేందుకు ప్రతి కుటుంబానికీ నూటయాభై రూపాయల చొప్పున యిస్తామని ప్రకటించింది. అది వెంటనే అమలు జరిపించింది కూడా. తుపాను బాధితులు తమ పేర్లను నమోదు చేయించుకోవాలన్నారు.

ఇక్కడే బలరామయ్యకు ఆశపొడ చూపింది. 'నూటయాభై రూపాయలు ఏం చాలతాయి? మూడొందలు వుంటే.... తను రెండు గ్రాంట్లు పొందగలిగితే' – అనుకున్నాడు.

కాని పొందడం ఎట్లా?

ఆశ మనిషిచేత ఎంత పనైనా చేయిస్తుంది. అందుకు బలరామయ్య జీవితమే సాక్షి.

తుపాను బాధితుడిగా అధికారులవద్ద తన పేరు నమోదు చేయించుకున్నాడు బలరామయ్య. గ్రాంటుగా నూటయాభై రూపాయలు పొందాడు. బాగానే వుంది. కాని ఆ తరువాత అతడు తన జీవితాంతం కుమిలిపోయే పొరపాటు చేశాడు. పాపం.... అప్పట్లో అతనికి అలా జరుగుతుందని తెలియలేదు!

రమణమ్మ తన వదినగారనీ, ఆమె ఇల్లు కూడా కూలిపోయిందనీ అధికారులతో చెప్పాడు బలరామయ్య. ఆమె పేరు కూడా నమోదు చేయించాడు. అయితే గ్రామం తాలూకు డబ్బు మాత్రం రమణమ్మ వచ్చి సంతకం చేస్తేగానీ యివ్వనన్నారు అధికారులు.

ఇంటికి తిరిగి వచ్చిన బలరామయ్య, భార్యకీ విషయం ఎంతో గొప్పగా చెప్పాడు. అక్కడికి వెళ్ళి ఆ డబ్బు తీసుకురమ్మనమని చెప్పాడు. భర్త మాటకి ఏనాడూ ఎదురు చెప్పి ఎరగని ఆ యిల్లాలు అతని ఆదేశానుసారం డబ్బు తీసుకు రావడానికి అధికారులవద్దకు వెళ్ళింది.

అయితే యిక్కడే అనుకోని సంఘటన ఎదురైంది. వారు ఆమెని అన్ని వివరాలూ అడుగుతూ భర్త పేరు కూడా అడిగారు.

రమణమ్మ చెప్పింది.

నిర్ఘాంతపోయారు అధికారులు. అంతకుముందే ఆ పేరుగల వ్యక్తికి గ్రాంటు తాలూకు డబ్బు యిచ్చారు.

"నువ్వు అతని వదినవి కదా" అన్నారు వారు.

రమణమ్మ నిజం చెప్పేసింది. దాంతో ఆమె భర్త చేసిన మోసం కాస్తా బయటపడింది.

అధికారులు నానా మాటలూ అని ఆమెని అవహేళన చేశారు. సున్నిత మనస్కురాలైన రమణమ్మ మానసికంగా చిత్రవధ అనుభవించింది. లోకమంతా తనని చూసి పరిహాసంగా నవ్వుతున్నట్లుగా ఆమెకు అనిపించింది. అధికారుల నిందాపూరితమైన చూపులు, లోకుల దుర్భాషణలు సహించలేక పోయింది.

పెనుతుపాను తాకిడికి సైతం తట్టుకుని ప్రాణాలు దక్కించుకున్న రమణమ్మ – ఈ అవమానాన్ని భరించలేకపోయింది.

తత్ఫలితంగా మే నెల 23న భర్త అత్యాశకీ, అధికారుల, లోకుల అవహేళనకీ గురైన రమణమ్మ, విషం తాగి ఆత్మహత్య చేసుకుంది....



# పిల్లలలో బుద్ధిమాంద్యత

మనిషి బుద్ధిజీవి. బుద్ధిని అనుసరించే మనిషి మనుగడ కొనసాగుతుంది. బుద్ధివికాసం లేని వారి జీవితాలు మొగ్గలోనే వాడిపోతాయి. ఇంటా బైట సానుభూతికి లేదా పరిహాసానికి పాత్ర మౌతాయి వారి బ్రతుకులు. ఇలాంటి దుర్భరమైన మూగ వేదన అనుభవిస్తూన్న బాలబాలికలు మన దేశంలోనే ఒక కోటిమంది వరకూ వున్నారు!

శిశువులలో బుద్ధి మాంద్యత కల్గడానికి ముఖ్యంగా రెండు కారణాలు చెబుతారు. మొదటిది తల్లి గర్భంలో పిండోత్పత్తి జరిగి శిశువు ఏర్ప డేప్పుడు శిశువు తలలోని మెదడు తగిన రీతిలో అభివృద్ధి కాకపోవడం. దీనికి ముఖ్య కారణం దగ్గరి రక్త సంబంధీకుల మధ్య పెళ్ళిళ్ళు జరగడమే అని వైద్యవేత్తల దృఢ అభిప్రాయం!

రోజు రోజుకు విస్తృతమౌతూన్న విద్యావ్యాప్తి వల్ల దగ్గరి రక్త సంబంధీకుల మధ్య పెళ్ళిళ్లు కొంతవరకు తగ్గాయి. కాని ఇదంతా పట్టణ ప్రాంతాలలోనే. పల్లె ప్రాంతాలలో - బంధుత్వం తెగిపోతుందనే భ్రమవల్ల, ఆస్తులు విడిపోతాయనే భయంవల్లా మేనరికాలు చేసుకోడం సర్వ సాధారణంగా సాగుతూనే వుంది. తెలుగు, తమిళ నాడులలోనూ కర్ణాటక ప్రాంతంలోనూ ఇవి మరీ ఎక్కువ: వీరి అజ్ఞానం పోగొట్టాలంటే ఈ విషయం గురించి బాగా ప్రచారం చెయ్యాలి. కుటుంబ నియంత్రణ ప్రచారంలా ఇదీ ఉధృతంగా సాగాలి.

తల్లి గర్భవతిగా వున్నప్పుడు ఆమె ఆహార లోపంవల్ల లేదా రక్తపుపోటు, ఫిట్స్ మొదలైన వ్యాధులు వచ్చినపుడు తీసుకునే మందులు - గర్భస్థ శిశువు బుద్ధి మాంద్యతకు, అంగవైకల్యానికి దారి తీస్తాయి. ముఖ్యంగా మొదటి రెండు మూడు నెలలలో వాడే మందులు బుద్ధిమాంద్యతకు దోహదం చేస్తాయి. ఎంచేతంటే అప్పుడే గర్భంలోని పిండంలో మెదడు ఏర్పడుతుంది. ఆ తర్వాత తీసుకునే మందులు అంగవైకల్యానికి దారి తీస్తాయి. అందువల్ల మందులు వాడే విషయంలో చాలా జాగ్రతగా వుండడం ఎంతో అవసరం.

ప్రసవ సమయంలో సరియైన వసతులు లేక పోవడంతో శిశువు తలకు దెబ్బ తగలడం కూడా బుద్ధి మాంద్యతకు దోహదం చేస్తుంది. మన దేశంలో బుద్ధి మాంద్యతగల ప్రతి ముగ్గురిలో ఒకరు తగిన ప్రసవ వసతులు లేకపోవడంవల్లే అలా తయారయ్యారు అంటారు శిశువైద్యవేత్తలు!

శిశు ప్రాయంలోనూ బాల్యంలోనూ కామెర్లు రావడం కూడా బుద్ధి మాంద్యతకు కారణ మవు తుంది. అదే విధంగా ఫిట్స్ వచ్చినప్పుడు మెద డుకు ప్రాణవాయువు సరఫరా తగ్గడం కూడా బుద్ధిమాంద్యతకు దోహదం చేస్తుంది. పసిపిల్లలకు మెదడు జ్వరం (బ్రెయిన్ ఫీవర్) రావడంతో నాడీ మండలం దెబ్బ తిని మానసిక మాంద్యతకు దారి తీసే ప్రమాదం వుంది. పిల్లలకు డిఫ్తీరియా, ధనుర్వాతం, కోరింతదగ్గు మొదలైన వ్యాధులు వచ్చినప్పుడు తగిన శ్రద్ధ చూపి వెంటనే వైద్యం చేయించక ఉదాసీనంగా వుండడంవల్ల కూడా బుద్ధి మాంద్యత ఏర్పడుతుంది.

ఇవన్నీ తగ్గాలంటే జనసామాన్యంలో వైద్య పరిజ్ఞానం వున్నంతమాత్రాన సరిపోదు. ఆర్థికస్తోమత కూడా ఎంతో ఎదగాలి. ఎందుకంటే మనదేశంలో దాదాపు ఐదు కోట్లమంది పిల్లలు చూడడానికి మామూలుగానే వున్నా - సరియైన పోషకాహారం లేకపోవడంతో సరిగా మెదడు అభివృద్ధి చెందక - చిన్న చిన్న సమస్యలను కూడా ఎదుర్కోలేక సతమతమౌతున్నారు. అందువల్ల ఇదొక జటిల మైన ఆర్థిక సమస్య!

ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా బుద్ధి మాంద్యతను పూర్తిగా లేకుండా చేయలేము. చాలావరకు తగ్గించ వచ్చు. ఈ సమస్యను పరిష్కరించడంలో మానవతా దృక్పథం, సామాజిక స్పృహ ఎంతైనా అవసరం. అంచేత ఇదొక సామాజిక సమస్య కూడా.

అంగవైకల్యం కలవారినైనా గుడ్డిలో మెల్లగా పట్టించుకుంటున్నాయేగాని బుద్ధి మాంద్యతగలవారిని అసలు పట్టించుకోడంలేదు మన రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు. అయితే వికలాంగులకన్నా బుద్ధి మాంద్యత గలవారిది మరీ దయనీయ స్థితి. వారి పట్ల ప్రత్యేకమైన శ్రద్ధతో మసలుకోడంలోనే వుంది మనుషులుగా మన ప్రత్యేకత.

స్వచ్ఛంద సేవా సంస్థలు కొన్ని ప్రభుత్వ ధన సహాయంతో, స్వతహాగా వసూలు చేసిన నిధులతో వికలాంగుల వసతి గృహాలు, పాఠశాలలు నడుపు తున్నాయి. అయినా ఇవి అందరికీ అందుబాటులో లేవు.

విద్యావ్యాప్తికంటూ మనదేశంలో యేటా కోట్ల కొలది రూపాయలు ఖర్చవుతూనే వున్నాయి. బుద్ధి మాంద్యత గలవారి విద్య కూడా అందులో ఒక భాగం కావాలి. రాష్ట్ర రాజధానీ నగరాలలోనూ, జిల్లా ముఖ్య కేంద్రాలలోనూ అవసరమైతే బుద్ధి మాంద్యతగల పేద పిల్లలకు ఉచితంగా వసతి గృహాలు, పాఠశాలలు నెలకొల్పాలి.

ఈ సమస్యను ఒక పెద్ద సమస్యగా ప్రభుత్వం గుర్తించడం లేదని ఉదాసీనంగా వుండకూడదు. ప్రభుత్వం దృష్టికి దీనిని తీసుకురావాలి. అందుకు బుద్ధిమాంద్యతగల పిల్లల తల్లిదండ్రులందరూ ఒక సంఘం ఏర్పాటు చేసుకుని కృషి చేయాలి. ఎంత సేపూ, విధి, రాత అంటూ గాలిలో దీపం పెట్టి "దేవుడా నువ్వే దిక్కు—" అని చెంపలేసు కోడం తప్ప – సమస్యల పరిష్కారాన్ని ఒక సామాజిక బాధ్యతగా స్వీకరించడం భారతీయ మనస్తత్వానికి నూతనమైన విషయమే. కాని మన ఈ తరతరాల నిర్లిప్తతను వదిలించుకోవాలి. అప్పుడే తమ పూర్వజన్మల పాపఫలమే బుద్ధి మాంద్యతగల పిల్లలు-అన్న అపరాధభావం తొలగి పోయి ప్రస్తుత దైన్యస్థితి దూరమవుతుంది!

—బాల



**చిన్న పిల్లలకి గుండెల్లో కఫం చేరి, కఫం బయటకి రాని సమయాల్లో వెల్లుల్లిపాయలు తొక్క తీసి మెత్తగా చితకకొట్టి అరటిపండు ముక్క మధ్యలో పెట్టిగాని, వేడి వేడి అన్నంలో ఉప్పు, నెయ్యివేసి అందులో ఉల్లిపాయ ముద్దనిపెట్టి తినిపించండి. కఫం కరిగి బయట పడుతుంది.**



# అందమైన పూలకొమ్మ

సాధారణంగా గృహాలంకరణ అనగానే మనకి ముందుగా గుర్తుకు వచ్చేవి ఫ్లవర్ వాజ్‌లు, పుష్పాలు. అటువంటి కోవకు చెందినదే ఈ అందమైన పూలకొమ్మ.

ఈ పూలకొమ్మ తయారు చేయడానికి మూడు లేక నాలుగు ప్రక్కకొమ్మలుండి రెండడుగుల ఎత్తుగల కొమ్మ ఒకటి తీసుకోవాలి. బోగన్ విలియా చెట్టు కొమ్మ అయితే ముళ్ళతో బాగుంటుంది. ఆ చెట్టు కొమ్మ లభించకపోతే మరో చెట్టు కొమ్మ ఏదైనా కూడా తీసుకోవచ్చును. ఈ కొమ్మని ఎండ తగలకుండా నీడలో వారం పది రోజులపాటు పచ్చిదనం పోయేవరకు ఆరనివ్వాలి.

చిన్న చిన్న పువ్వులు వున్న ప్లాస్టిక్ పూల గుత్తులు బజార్లో తక్కువ ఖరీదులో లభిస్తాయి. వాటితోబాటే కాస్త పెద్ద సైజు పూలగుత్తులు కూడా తీసుకోవాలి. ఇవి ఎరుపు, పసుపు, తెలుపు రంగుల పూలగుత్తులైతే బాగుంటాయి. ఈ పూల గుత్తుల కాడలు ఇనుప తీగతో వుండి చుట్టూ ప్లాస్టిక్ ఆకుపచ్చ వైరుతో చుట్టి వుంటాయి. అటువంటి పూలగుత్తులే ఎంచుకోవాలి.

ఇప్పుడు మనం తీసుకున్న చెట్టు కొమ్మకి ప్లాస్టిక్ పూలకొమ్మలని చుడుతూ మెలి తిప్పాలి. అలా తిప్పుతున్నప్పుడు కొమ్మ విరగకుండా జాగ్రత్తపడాలి .... పూల తీగలు చెట్లకి ఎలా అల్లుకుంటాయో అంత సహజంగా వుండేటట్లు ఈ ప్లాస్టిక్ పూల తీగలను కొమ్మకి చుట్టాలన్న మాట. వర్ణచిత్రంలో చూస్తే ఈ పద్ధతి సులభంగా అర్థమవుతుంది.

వర్ణచిత్రం: పి. నగేష్

ఇలా ఒక ప్రక్కకొమ్మ అయిన తరువాత మరో ప్రక్కకొమ్మకి వరుసగా ప్లాస్టిక్ పూల తీగలను చుట్టాలి. ఈ విధంగా చుడుతున్నప్పుడు పూలకొమ్మ అందంగా కనిపించేందుకు పెద్ద పువ్వులు మధ్యలోనూ చివర్లలో చిన్న పూల గుత్తులు, ఒక రంగు పువ్వుల తరువాత మరో రంగు పువ్వులు వచ్చేటట్లుగానూ అమర్చుకోవాలి.

ఇప్పటికి కొమ్మని ఆకులతోనూ, పూలగుత్తులతోనూ అలంకరించడం పూర్తయింది. ఇక మిగిలిందల్లా కొమ్మని సహజత్వానికి దగ్గరగా తీసుకురావడానికి ప్రయత్నించడం. అంటే పక్షి గూడు, పక్షులు వంటివి అమర్చడం అన్నమాట. ఈ పక్షి బొమ్మలు బజార్లోనూ, ఫ్యాన్సీ దుకాణాల్లోనూ మనకి లభిస్తాయి. వీటి ఖరీదు కూడా అట్టే వుండదు. ఎవరికి కావలసిన పక్షులు వారు ఎంచుకుని కొమ్మలపై అక్కడక్కడ అమర్చుకోవాలి. ఎలా అంటే, పక్షుల కాలివేళ్ళు సాధారణంగా ఇనుప వైరుతో చేస్తారు. పక్షిని కొమ్మపై పెట్టి కాలివేళ్ళు కొమ్మకి ఒక వైపు

మూడు, మరో వైపు రెండు వుంచి కొమ్మని బలిష్టంగా పట్టుకుని వున్నట్లుగా నొక్కి వేయాలి. అప్పుడు కొమ్మల మీద పక్షులు నిలబడినట్లుగా వుంటాయి. ఒక్కొక్క కొమ్మకి ఒకటో రెండో పక్షుల చొప్పున అమర్చాలి.

ఆ తరువాత మనకి కావలసింది పక్షి గూడు. వీటిని మనమే తయారు చేసుకోవచ్చును. కొబ్బరి పీచుని మనకి కావలసిన విధంగా కత్తిరించుకుని పిచ్చుక గూడులా చేసుకోవాలి. ఈ విధంగా రెండు గూళ్ళు తయారు చేసుకోవాలి. ఒక గూటిని కొమ్మకి మధ్యగా వుంచి దానిలో ఒక పక్షి బొమ్మని పెట్టాలి. కొమ్మకి క్రిందుగా మరో గూటిని వేలాడ దియ్యాలి. ఇందులో ఒక పక్షి బొమ్మని (అంటే ఆడపక్షి అన్నమాట) పెట్టి గూడుపైన మరో పక్షి బొమ్మను అమర్చాలి.

ఇక మిగిలింది సీతాకోక చిలుక. ఇది కూడా బజార్లో బొమ్మలు అమ్మే దుకాణాల్లో లభిస్తుంది. దీని వెనుక వైపు తగిలించేందుకు అనువుగా ఒక రింగు వుంటుంది. ఈ సీతాకోక చిలుకని పూల మధ్యలో తగిలిస్తే ఎంతో సహజంగా వుంటుంది.

కొమ్మలతో, పూలతో, పక్షులతో, పక్షిగూడులతో కావలసిన హంగులన్నిటితోనూ అందమైన పూల కొమ్మ తయారయ్యింది. డ్రాయింగ్ రూంలో గాజు తలుపుగల అల్మారా వున్న వాళ్ళు దానిని ఆ విధంగానే అందులో వుంచితే చూడ ముచ్చటగా వుంటుంది. దుమ్ముధూళిపడదు. అలాకాక గోడకి అమర్చదలచుకున్న వారు ఈ విధంగా చెయ్యాలి.

డ్రాయింగ్ రూం ద్వారానికి ఎదురుగా వుండే మూలలో సుమారు ఐదడుగుల ఎత్తున గోడకి మేకు కొట్టాలి. కొమ్మ మధ్య భాగానికి తాడుకట్టి ఆ మేకుకి తాడు గట్టిగా బిగించి కట్టాలి. మూలకి అటు యిటు వున్న గోడలకి బాగా దగ్గరగా కొమ్మ గోడకి అతుక్కున్నట్లుగా కట్టాలి. తరువాత కొమ్మకి కట్టిన తాడు, గోడకి కొట్టిన మేకు కనబడకుండా, కొమ్మకి వున్న పువ్వులను సర్దాలి. అలా చేస్తే గోడ మూలకి కొమ్మ ఎలా అమర్చింది కూడా తెలియదు.

తీరిక వేళల్లో యిటువంటి అందమైన వస్తువులని అట్టే శ్రమ లేకుండా, తక్కువ ఖర్చుతో చేసుకోవచ్చును. ఇలా చేసుకోవడంవల్ల మనకి సమయాన్ని ప్రయోజనకరంగా వెచ్చించిన సంతృప్తి కలుగుతుంది; ఇంటికి శోభ చేకూరుతుంది.

—బి. మణి

# ప్రమాదాలూ - చిన్నపిల్లలూ

ప్రతి మహిళ కూడా, యింటిలోని చిన్న పిల్లలు ప్రమాదానికి గురి కాకుండా వుండేలా చూడటం అత్యవసరం. "భద్రతకు సెలవు రోజు లేదు" అనే నానుడి ఆంగ్లంలో వుంది.

చిన్న పిల్లలు ఎన్నో ప్రమాదాలకు గురి అవుతారు. ఎక్కడనుంచో జారిపడటం, వళ్ళు కాల్చుకోవడం, బావిలో ప్రమాదవశాత్తు పడటం లాంటి ప్రమాదాల నుంచీ, తెలియక విషపు మందును తినడం దాకా - జరగవచ్చు. పిల్లలని పిరికిగా చేయకుండా వుంటే మంచిది. కాని ప్రమాదాలకు దూరంగా వారిని వుంచాలి.

చిన్న పిల్లలు పెద్దలని అనుకరిస్తారు. శక్తి, ఆలోచనా వివేచనా వున్న ఇరవయిఏళ్ళ అన్నయ్య బావిలోకి తొంగిచూడటాన్ని చూచిన, చిన్న బాలుని మనసు మారుతుంది. తను కూడా అన్నయ్యలా తొంగిచూడాలని, ఏదో రహస్యాన్ని తెలుసుకోవాలనీ ఆ పిల్లవాడు అనుకోవడం సహజం.

బజారుకు చిన్న పిల్లలని ఎందరో తల్లులు ఒంటరిగా పంపిస్తారు. పిల్లలకి 'ట్రాఫిక్ రూల్సు' తెలియవు. మరి వచ్చేపోయే బండ్లూ, వాహనాల రద్దీలో పిల్లలు ఇరుక్కుంటే ప్రమాదం కాక ఏమవుతుంది? కనక పిల్లలవెంట, వారికి ఒక వయస్సు వచ్చేదాక, తలిదండ్రులలో ఎవరైనా, లేక పెద్దవారు ఒకరు వుండడం మంచిది అనిపిస్తుంది.

మిద్దెమెట్లు - వాటిలో ఏదో కొంత విరిగిందనుకోండి. దాన్ని వెంటనే రిపేరు చేయించాలి. పెద్దవాళ్ళు జాగ్రత్తగా దిగినా, పిల్లలూ అలానే చేస్తారని గ్యారంటీ ఏమిటి?

ఇంటి మిద్దెపై, ఓపెన్ స్పేస్ వుందనుకోండి. వీధిలోని విద్యుత్ స్తంభం నుంచి విద్యుత్తును తీసుకువచ్చే తీగపై రబ్బరు తొడుగు అరిగిపోయిందనుకోండి. చిన్న పిల్లలు మిద్దెపై ఆడుకుంటూ, చేతికి అందుబాటులో వుందని, ఆ తీగను తాకితే, కలిగే అపాయాన్ని ఊహించడం కష్టం.

ఇంట్లో, నల్లుల్ని చంపే మందు, లేక ఇతర మందులో అపాయకరమైనవి వున్నాయనుకోండి. వాటిని చిన్న పిల్లలకు అందుబాటులో లేకుండా, దూరంగా వుంచాలి. బొద్దింకలను చంపే 'సెవిన్' లాంటి మందులూ, తోటపనికి వుపయోగించే పారలాంటి పనిముట్లూ ఎక్కడో దూరంగా వుంచాలి.

కొంతప్పుడు పిల్లలు లైటు వేయాలని, స్విచ్ అందలేదనీ, ఆడుకొనే కొయ్యగుర్రాన్ని వుంచి దానిపై ఎక్కి స్విచ్ అందుకోవాలని ప్రయత్నిస్తారు. అలానే ప్లగ్ నుంచి రేడియో స్విచ్‌ని తీయడం, వేయడం లాంటి పనులు పెద్దవారిలా చేయాలని ప్రయత్నిస్తారు. పిల్లలకి ఓ వయస్సు వచ్చేదాకా ఎత్తు ప్రదేశంలో రేడియోను అమర్చడం మంచిది.

'పాయిసన్' లాంటి ఏదైనా మందును, బిడ్డ పొరబాటున త్రాగితే, ఆ సీసాలో పదార్థాన్ని కదిలించక అలాగే వుంచండి. డాక్టరుగారికి వెంటనే కబురు పంపండి. ఆయన ఆ సీసాను చూచి, బిడ్డ ఎంత మందును త్రాగాడో తెలుసుకుంటాడు. దాన్నిబట్టి బిడ్డకు ఎంత విరుగుడు మందును యివ్వాలో డాక్టరుగారు నిర్ణయిస్తారు.

కొంతవరకూ, ప్రథమచికిత్సపాఠాలు నేర్చుకోవడం చిన్న పిల్లలను కన్నవారికీ – తరగతిలో పిల్లలను చూచుకోవలసిన ఉపాధ్యాయులకీ అవసరమేమో అనిపిస్తుంది. రెడ్‌క్రాస్‌వారు లేదా సెయింట్ జాన్ ఆంబులెన్స్‌వారూ యిచ్చే ప్రథమ చికిత్సపాఠాలు, శిక్షణ విదేశాలలో ఎందరో నేర్చుకోవడానికి కారణం అదే.

మందుల విషయంలో ఓ సలహా: బిడ్డలకి మందు వాడుతున్నప్పుడు, బిడ్డలలో ఏదైనా చిన్న మార్పు వచ్చినా అంటే చిన్న గుల్ల ఏర్పడినా, ముఖం కొద్ది వాచినా, వెంటనే వైద్యుడికి తెలియజేయాలి. మాత్రలు వున్న సీసాలకి లోపల నల్లరంగు వుంటే, పిల్లలు వాటిచేత అంతగా ఆకర్షితులుకారు. 'యూనిట్ ప్యాకింగ్' కన్నా 'స్ట్రిప్' పేపర్‌లో వున్న మందులవల్ల, పిల్లలు మరీ ఎక్కువ సంఖ్యలో మందుమాత్రలు తినకుండా వుండటానికి కొంత తోడ్పడుతుంది.

—కాకుటూరు సుజాత

# ఔరా! పురుషులెంతటివారో...

మాడుగుల కృష్ణకుమారి

అలసిపోయి ఆఫీసు నుంచి బయటపడిన సుజాత అలవాటుగా బస్‌స్టాప్ వైపు నడిచింది నీరసంగా. "అబ్బ! ఈ రోజు వర్కు మరీ ఎక్కువయింది. అసలీ స్టెనో ఉద్యోగం అంటేనే అంత!" అనుకుని బస్ కోసం వెయిట్ చెయ్యటం మొదలు పెట్టింది. వరుసగా నాలుగు బస్సులు వచ్చాయి కాని తనకు కావలసిన అయిదో నంబరు బస్సు మటుకు రాలేదు. సమయం ఆరు దాటుతోంది. బస్ స్టాపులో ఒక పాతికమంది దాకానే అయిదో నంబరు బస్సుకోసం వెయిట్ చేస్తున్నారు.

"ఎక్స్క్యూజ్ మీ! మీరు ఏమీ అనుకోకపోతే, మీ చేతిలోని 'వీక్లీ' ఒకసారిస్తారా?" అన్న మాటలకు చటుక్కున తలత్రిప్పి చూసింది సుజాత. ప్రక్కనే హిప్పీ క్రాపింగ్‌తో ఇకిలిస్తూ అడిగాడొక యువకుడు. మాట్లాడకుండా వీక్లీ అతనికిచ్చింది.

డర్టీ రోగ్! ఏదో ఒక వంకతో ఆడపిల్లని మాట్లాడించాలని కాకపోతే తన చేతిలోని క్లాస్‌బుక్ చదువుకోలేడూ! ఈ రోజుల్లో ఇదొక జాడ్యమయింది. ఏదో మిషతో ఆడపిల్లలను మాట్లాడించాలని, వాళ్ళతో స్నేహం పెంచుకోవాలని.

"చూడండి! ఈ వీక్లీలో 'బస్ స్టాప్‌లో లవ్' అన్న కథ చదివారా? అది వ్రాసింది నా ఫ్రెండే లెండి. చాలా బావుంది. మీరు చదివారా? చదవకపోతే చదవండి. ఐ వాంట్ టు నో యువర్ కామెంట్స్" నవ్వుతూ అడిగాడా యువకుడు.

ఒళ్ళు మండిపోయింది సుజాతకు. ఇడియట్, బ్రూట్. పుస్తకం తీసుకున్నది కాక కథల గురించి చెప్పి పైగా కామెంట్స్ కూడా.

"బస్ స్టాప్‌లో లవ్ కథ చదవలేదుకాని



'అమ్మాయి కొట్టిన చెప్పు దెబ్బ' అన్న కథ చదవండి. అది నా స్నేహితురాలు వ్రాసింది. చాలా బావుంటుంది." అని అందామని నోటిదాకా వచ్చినా తమాయించుకుంది. ఇంతలో బస్ కనిపించటంతో "దయచేసి పుస్తకం ఇస్తారా?" అని అతని చేతిలోంచి వీక్లీ లాక్కుని బస్‌వైపు పరుగు దీసింది సుజాత.

బస్ రావటమూ, ఒకరిద్దరిని మాత్రం ఎక్కించుకుని వెళ్ళిపోవటమూ జరిగింది. సుజాతకు చిరాకు మరీ ఎక్కువయింది. దానికి తోడు చుట్టూ చేరిన కుర్రకారు కాకిగోల అధికమయింది. ఒక కొంటె కోణంగి ఆమె వైపు అదోలా చూసి 'బస్ మిస్ అయినందుకు బాధపడకండి మిస్. గివ్ మీ ఏ స్వీట్ కిస్' అని పకపకా నవ్వాడు.

సుజాత పరిస్థితి వర్ణనాతీతంగా వుంది. మరొక పది నిముషాల్లో మరొక అయిదో నంబర్ బస్సు వచ్చింది. ఆగకుండానే ఎగబడుతున్నారు జనం. కండక్టర్ ఎక్కేవాళ్ళను ఆగమని, లోపలి వాళ్ళను దిగమని హెచ్చరిస్తున్నాడు. ఎవ్వరూ అతని మాటలు లక్ష్య పెట్టటంలేదు. పద్మవ్యూహంలోకి జొరబడినట్లు సుజాత ఎట్లాగో లోపలికి చేరింది. బస్సు మరీ రష్‌గా వుంది. ఎక్కడమయితే ఎక్కింది కాని ఊపిరి పీల్చుకునేందుకు కూడా వీలులేకుండా వుంది. జనం ఇంకా ఎక్కుతూనే వున్నారు. సీట్లన్నీ ముందుగానే నిండిపోయినాయి. ఎలాగో పై రాడ్



పట్టుకుని నిలబడింది సుజాత. నిండు గర్భిణిలా తయారైన బస్సు నెమ్మదిగా కదిలింది. నైలెక్స్ చీరేమో గాలికి ఎగిరిపోతోంది. పైట సర్దుకుందామనుకుంటే ఒక చేతిలో బ్యాగ్, మరొక చేత్తో రాడ్ పట్టుకుంది. వెనకా ముందూ మగవాళ్ళు. బస్ స్టాప్‌లో పుస్తకం అడిగినవాడు సరిగ్గా వెనకాలే అనుకున్నట్లు నిలబడ్డాడు. అసలు ఇలాంటి ఛాన్సుల కోసమే వీళ్ళు బస్సెక్కేది. లేకుంటే నడిచిపోలేరూ! అనుకుంది మనస్సులో. బస్సు ఆగింది. ముందు పైట గట్టిగా దోపుకుని కాస్త ఊపిరి పీల్చుకుంది. మళ్ళీ ఫుల్‌గా లోడ్ చేసుకుని పరుగు తీసింది బస్సు.

'ఆ ప్రక్క సీటులోని ఎర్రపాటి ఆవిడ ఏమిటో నేను బస్ ఎక్కినప్పటినుంచి నాకేసే మిర్రి మిర్రి చూస్తోంది. నేనేదో కావాలని ఈ మగవాళ్ళ మధ్య నిలబడ్డానని ఆవిడ తీక్షణ వీక్షణాలకు అర్థం కాబోలు. తల్లీ! అపార్థం చేసుకోకు' అనుకుంది సుజాత.

మళ్ళీ బస్సు ఆగింది. కాస్త ఖాళీ అయింది. ఒకసారి ఎక్కడైనా చోటు వుందేమోనని చూసింది సుజాత. ఎదురు సీట్లో ముసలాయన ప్రక్కన చోటుంది. నిలబడినందుకు కాళ్ళు పీక్కుపోతున్నాయి. పర్వాలేదు ఈయన ప్రక్క కూర్చోవచ్చు అనుకుని కూర్చోబోయింది.

"చూడమ్మాయ్! నువ్వా కిటికీ ప్రక్కన కూర్చో నాకు చల్లగాలి పనికిరాదు." అంటూ తను ఇవతలికి జరిగాడు. కాస్త గాలయినా తగులుతుందని ఆశతో కిటికీ ప్రక్కనే కూర్చుంది సుజాత. బస్ బయలుదేరింది. చల్లగాలి రావటంతో ప్రాణం హాయిగా వున్నట్లయింది సుజాతకు. మూడు వంతుల భారీకాయాన్ని సీటుకి సరిపడేలా వేశాడా ముసలాయన. పైగా ముక్కుపొడుం వాసనొకటి. ఇంకో పావుగంటలో దిగిపోయే తను ఎలాగో సరిపెట్టుకోక తప్పదని ఒదిగి ఒదిగి కూర్చుంది సుజాత. చల్లగాలికి కళ్ళు మూతలు పడ్డాయి. తన వొంటిమీద బరువు చేరుతున్నట్లనిపించేసరికి కళ్ళు తెరచింది సుజాత. "ఏమిటీ ముసలాయన — మరీ మీదపడిపోతున్నాడు. కావాలనా లేక బస్సు కుదుపులకా?" అర్థంకాలేదు సుజాతకు. ముసలాయన వెనకగా వేసిన చెయ్యి సరిగ్గా సుజాత భుజం



మీద వుంది. చూసేవాళ్ళకి సుజాత ముసలాయన ఒళ్ళో కూర్చున్నట్లుంది. ఖర్మకాలి ఈ రోజు అన్నీ ఈ అనుభవాలే! సుజాత విసుక్కుంది. ముసలాయన కావాలనే మీదకు ఒరిగిపోతున్నాడు. ముక్కుపొడుం సుగంధానికి సుజాతకు వాంతి వచ్చేలావుంది. రెండో చెయ్యి మాత్రం ఎందుకు ఖాళీగా వుండాలన్నట్టు సుజాత ఒళ్ళో వేసి మరీ

కూర్చున్నాడు దర్జాగా ముసలాయన. శరీరం కంపరమెత్తిపోయింది సుజాతకు. మొదట కాకతాళీయంగానేమో అనుకుంది కాని తర్వాత కావాలనే చేస్తున్నట్లనిపించింది సుజాతకు.

"డర్టీ ఓల్డు ఈగిల్! వయస్సులో ఉన్న పిల్లను చూసేసరికి నీకూ పుట్టింది దుర్బుద్ధి. తల నెరిసినా తలపులు చావలేదు. విసురుగా లేచి చటుక్కున నిలబడింది. అంత కోపంగా లేవటంతో సుజాత హైహీల్స్ క్రింద పడి పచ్చడయింది ముసలాడి కాలు. అప్పుడు కాని ఆయన తేరుకోలేదు. అసలు ముసలాడు చెయ్యి వేసినప్పుడే గడ్డి పెట్టవలసింది. చిన్న గొడవ అయితే బస్‌లో వారందరికి వినోదం. అసలు ముసలాడయితే మాత్రం ఎవరు నమ్మమన్నాడు? పుర్రెతో పుట్టిన బుద్ధి పుడకలతోనే పోవాలి! ఆమె ఆలోచనలను కట్ చేస్తూ బస్ ఆగింది. దిగవలసిన చోటు రావటంతో దిగి ఊపిరి గట్టిగా పీల్చుకుంది సుజాత. ఆవాల్టి యజ్ఞం అలా ముగిసినందుకు ఆనందిస్తూ ముందుకు కదిలింది. నడుస్తున్న సుజాతకు వెనకాలనుంచి "ఎంత సొగ్గున్నావే కిలాడి గుంటా ఎంత సొగ్గున్నావే" అన్న పాట వినిపించటంతో వెనుదిరిగి చూసింది. సరిగ్గా పది, పన్నెండేళ్ళ వయసుంటుందేమో సైకిల్ మీద వస్తూ సుజాత వంక చూస్తూ పాడుతున్నాడొకడు. ఇంకెవరైనా ఉన్నారేమోనని చుట్టూ తిరిగి చూసింది. ఊహూ! తను తప్ప వేరెవరూ లేరు. ఎవ్వరి నుద్దేశించి పాడుతున్నాడో అర్థం అయింది సుజాతకు. తను వెనక్కి తిరగటం చూసి పాటే కాకుండా ఈల వేస్తూ కన్ను కొట్టాడు వాడు.

నిర్ఘాంతపోయింది సుజాత. వేలెడు లేడు వీడి వయసెంత? వీడి చేష్టలేమిటి? సుజాత మనసులో వరుసగా బస్ స్టాప్‌లో పుస్తకం అడిగిన యువకుడు, బస్సులో ముసలాడు, బస్సు దిగాక ఈ కుర్రాడు ముగ్గురూ ఒకరి తర్వాత మరొకరు గిర్రున మెదిలారు. "ఛీ! ఛీ! మేనర్స్‌లెస్ మాడ్స్! ఆడపిల్లలు కనబడితే చాలు వయసుతో పరిమితం లేకుండా వెకిలి చేష్టలు, వెర్రిమొర్రి వేషాలు, అర్థం లేని మాటలు! అసలు ఈ మగవాళ్ళంతా ఇంతేనేమో—అన్న భావం మనసులో మెదిలి వడివడిగా అడుగులు వేసింది సుజాత.

**[అంకితం: ప్రతిరోజు బస్సుల్లో ప్రయాణం చేస్తూ, రోడ్ మీద రాగింగ్స్‌లో ఎదురయిన అనుభవాలను ఎదుర్కొనే అమ్మాయిలకు.]**

## మరో పువ్వుల ముగ్గు

మొదట 18 చుక్కలు 6 వరుసలలో ఒకదానికొకటి సమాన దూరంలో వుండేటట్లు పెట్టుకోవాలి. తరువాత పైన, కింద ఒక్కొక్క చుక్క విడిచి పెడుతూ 6 చుక్కలు వచ్చేవరకు రెండు వైపులా పెట్టుకుని, ఈ ముగ్గులో వున్నట్లు కలుపుకుంటే అందమైన పువ్వుల ముగ్గు పూర్తవుతుంది.

—ఏ. వి. భారతి






## కాంతి వర్షం
### (కవిత)

**[రచన : అడవికొలను పార్వతి; ప్రచురణ: అవర్ణా పబ్లికేషన్స్, గాంధీ నగర్, కాకినాడ-4; వెల : రూ. 6; పేజీలు : 66]**

అడవికొలను పార్వతిగారు మంచి కథకురాలిగా, నవలా రచయిత్రిగా కొంత ప్రత్యేకత సంతరించుకున్న వ్యక్తి. బహుశా ఆవిడ రాసినవి ఎక్కువగా లేకపోయినా, చెప్పిన వాటిల్లో నిజాయితీ, తపన, సమస్యా పరిష్కారానికి కృషి కనబడతాయి. ఆమె రాసిన గేయ కవితల సంపుటీకరణమే ఈ పుస్తకం. ఇవన్నీ ఒక్కసారిగా రాసినవి కావు. కావ్య వస్తువు కూడా ఒకటి కాదు. అందుకని చదువుతూ పోలేం. కొన్ని పదాల ఇంద్రజాలాల మధ్య భావం విశ్రాంతి తీసుకున్నది. కానీ, కొన్ని కవితలు బావున్నాయి. తన ఎద కదిలించిన భావాన్ని వ్యక్తపరచడానికి ఆమె ఒక కవిత్వపు పరిధికి కానీ, ఒక రకమైన ఛాందసపు ఛందస్సుకుగానీ లొంగలేదు. భావం ఆమె కవితలో ఊపిరి—అంతే.

"ఆ ప్రేమే లభ్యమవకపోతే కన్యగా ఉన్నా మేలుగానీ, అపాత్రుడికి జీవితాన్ని అర్పించకండి." ఇందులో కొత్తగా ఏమీ లేదు. సందేశం వుంది అంతే.

"పెట్టుబడిదారుల రాజ్యంలో
భూస్వాముల పాలనలో
నీతి న్యాయాలు కాయితాల్లో
నెచ్చగా నిద్రపోతుంటాయి." — చెప్పదలచుకున్నది చక్కగా చెప్పారిక్కడ.

"ఎవరింట్లో చూసినా సాహిత్యపు సరదాల పాలవెల్లులు. ఏ గాలి తరంగాల్ని కదిలించినా సంగీతపు రాగాల రంగవల్లులు"—ఇది ఒక చక్కటి కల.

## అశ్రు తర్పణ
### (నవల)

**[రచన : శారదా అశోకవర్ధన్; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు-1; వెల : రూ. 3-50; పేజీలు : 128]**

ఈ నవల పేరు చదవగానే అర్థం అవుతుంది ఇదేదో బాధలకు అంకితమైన కథ అని. ఇందులో మనకు ఎదురయ్యేవన్నీ మనుష్యులు తెచ్చి పెట్టుకున్న కష్టాలు. సుఖంగా గడిచిపోతున్న రోజులన్నీ చేతులారా దుఃఖభాజనం చేసుకుంటాడు గోవింద్. అతను మిలిటరీ ఆఫీసర్. పోస్టు మీద మోజు వలన భార్యను, తల్లి తండ్రి సుఖాలను పణంగా పెడతాడు. మనిషి సుఖంగా బ్రతకాలంటే కేవలం సుఖాలు ఉంటే చాలదు. చుట్టూ ఉండే మనుష్యులు మనిషిని కనీస సుఖానికి నోచుకోనివ్వాలి. మానసిక దుఃఖాలను కల్పించకూడదు. అంత దయనీయమైన పరిస్థితిలో ఉన్న మనిషిని చూసి, ఆర్థిక పరిస్థితి బావుంది కదా అని హాయిగా ఉన్నారని తేల్చుకో కూడదు.

ఈ నవలలోని సుబ్బలక్ష్మిలు ఆంధ్రదేశం నిండా కోకొల్లలు. ఎదుటివాళ్ళ అవసరాలను ఆసరాగా తీసుకుని, మరొకరి జీవితాలను సంపూర్ణంగా దోచెయ్యాలనుకునే మానసిక దరిద్రం, దానికి కావలసిన కొంచెం సౌందర్యం, అనవసరమైన చనువు ఉంటే, జీవితాలతో ఆడుకునే ఈ తెగను బాగా చూపెట్టారు రచయిత్రి.

కానీ, రచనలో స్పీడు తక్కువ. అక్కడక్కడ పేజీలు తిప్పేయాలనిపిస్తుంది. చెప్పేటంతటి సత్తెకు ఉన్నా, చెప్పగలగడం కూడా టెక్నిక్కే.

## స్నేహాభిరామం
### (గేయాలు)

**[రచన : అనసూయ; వెల : రు. 2/-; పేజీలు : 47; ప్రచురణ : ఎమ్. శేషాచలమ్ అండ్ కంపెనీ, మద్రాసు]**

స్నేహాభిరామం ఒక కన్నీటి కావ్యం. అత్యవసర పరిస్థితిలో బలైన శ్రీమతి స్నేహలతారెడ్డి స్మృతి గీతాన్ని, కవయిత్రి అతి విషాదంగా ఆలపించారు.

"సన్నజాజుల కన్న సున్నితము మనసు, సంకల్ప దీక్ష వజ్రము కన్న దృఢము, మమతకై తన తపన, సమతకై తన తపను."

ప్రతి పఠితకు ఆవేదన కల్గించే ఈ కవిత స్నేహలతారెడ్డి విశిష్ట వ్యక్తిత్వానికి ప్రతీక.

"కారాధికారొక క్షుద్ర కపట కీటకము ద్వాపరము నాటి వస్త్రాపహరణ కథ—ఈ నాడును పునరావృత్తమగుట వ్యధ" అని కారాగారంలో జరిగిన రాక్షస కృత్యాన్ని మన కళ్ళముందు నిలబెట్టి వ్యధ అనే మాట చాలా చిన్నదేమో అన్పించేటట్లు చేశారు.

"తన కొడుకు విదేశాలకు తరలి వెళతాడని, తానొక్కసారైన వానిని కలవాలని, తన పిల్లలను చూసుకోవాలని ఎంత ఏడ్చినగాని ఏముంది ఫలితమ్ము, కటకటాలకే తనదు కన్నీరు అంకితమ్ము"

చేసిన స్నేహానికి చేయని నేరానికి తొమ్మిది నెలలు శిక్ష అనుభవించి, చివరికి నియంతృత్వానికి ప్రాణాలనే బలి పెట్టిన స్నేహలతారెడ్డి విషాదగాథ పఠితల హృదయాలను కదిలిస్తుంది.

అందుకు కవయిత్రిని అభినందించాలి.

ఈ కవితలకు బాపు వేసిన చిత్రాలు అద్భుతంగా వున్నాయి.

## తారాహారాలు
### [గేయాలు]

**[రచన : దుర్గం తారాబాయి; వెల : రు 4/-; పేజీలు : 42; ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాద్]**

"కవిత్వమంటే కల్లిబొల్లి కబుర్లు కావు కవిత్వం ఒక నవశక్తి. అది కలిగించాలి జన సందోహంలో స్పందన" అనే ఈ కవయిత్రి కవితల్లో సమాజం మీద నిశిత పరిశీలన కన్పిస్తుంది.

భావ వ్యక్తీకరణ బాగుంది కాని....'విరాశాగ్ని', 'పెళ్ళిచూపులు' 'దొరవారు' వంటి కొన్ని కవితల్లో కొంత గంభీరత లోపించి, పేలవంగా వున్నాయి.

"తన కూతురు విషయంలో కట్నం మాటెత్తదు. కొడుకుకు పదివేలీకుంటే గడప కూడా తొక్కద్దు" - 'లోకం పోకడ'ని తెలియజేస్తూ 'ఇంకా పావం పండాలి'లో దేశంలో జరుగుతున్న అన్యాయాల్ని వ్యంగ్య ధోరణిలో తేటతెల్లం చేశారు.

ఇంకా మధ్యతరగతి వాడు, నాడు-నేడు, పారిపోయిన పిల్లవాడు మొదలైన కవితలు బాగున్నాయి.

కొండ కోనలోని 'మద్దిలేటి స్వామి'ని, అక్కడి రమణీయ ప్రకృతిని వర్ణించడంతో మొదలైన ఈ హారం కవిత్వమంటే ఏమిటో తెలియజరుస్తూ ముగుస్తుంది. కాని....నిజంగా ఈ కవిత్వానికి ముగింపులేదు. ఇంతటి సామాజిక స్పృహ గల కవయిత్రి తమ కలాన్ని ఆపకుండా, యీ సమాజాన్ని నవ్యత నిండిన కవితలతో హెచ్చరిస్తూ వుండాలి.

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | | తమిళం | కన్నడం | | మలయాళం | | మరాఠీ | | గుజరాతీ | | ఒరియా | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| త | థ | த | ತ | ಥ | ത | ഥ | त | थ | ત | થ | ତ | ଥ |
| తా | థా | தா | ತಾ | ಥಾ | താ | ഥാ | ता | था | તા | થા | ତା | ଥା |
| తి | థి | தி | ತಿ | ಥಿ | തി | ഥി | ति | थि | તિ | થિ | ତି | ଥି |
| తీ | థీ | தீ | ತೀ | ಥೀ | തീ | ഥീ | ती | थी | તી | થી | ତୀ | ଥୀ |
| తు | థు | து | ತು | ಥು | തു | ഥു | तु | थु | તુ | થુ | ତୁ | ଥୁ |
| తూ | థూ | தூ | ತೂ | ಥೂ | തൂ | ഥൂ | तू | थू | તૂ | થૂ | ତୂ | ଥୂ |
| తృ | థృ | — | ತೃ | ಥೃ | — | — | तृ | थृ | તૃ | થૃ | ତୃ | ଥୃ |
| తౄ | థౄ | — | — | — | — | — | — | — | — | — | — | — |
| తె | థె | தெ | ತೆ | ಥೆ | തെ | ഥെ | — | — | — | — | — | — |
| తే | థే | தே | ತೇ | ಥೇ | തേ | ഥേ | ते | थे | તે | થે | ତେ | ଥେ |
| తై | థై | தை | ತೈ | ಥೈ | തൈ | ഥൈ | तै | थै | તૈ | થૈ | ତୈ | ଥୈ |
| తొ | థొ | தொ | ತೊ | ಥೊ | തൊ | ഥൊ | — | — | — | — | — | — |
| తో | థో | தோ | ತೋ | ಥೋ | തോ | ഥോ | तो | थो | તો | થો | ତୋ | ଥୋ |
| తౌ | థౌ | தௌ | ತೌ | ಥೌ | തൗ | ഥൗ | तौ | थौ | તૌ | થૌ | ତୌ | ଥୌ |
| తం | థం | த் | ತಂ | ಥಂ | തം | ഥം | तं | थं | તં | થં | ତଂ | ଥଂ |
| తః | థః | — | ತಃ | ಥಃ | തഃ | ഥഃ | तः | थः | તઃ | થઃ | ତଃ | ଥଃ |

తమిళంలో మన త, థ లకు–ఒకే అక్షరం [த] వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# వార్తావనిత



తాడేపల్లిగూడెం లయన్ లేడీస్ క్లబ్ 1979-80 సంవత్సరానికి అధ్యక్షురాలుగా శ్రీమతి దారా సీతాదేవి ఎన్నికైనారు. ఆమె యిదివరలో ఒకసారి అధ్యక్షురాలుగా వున్నారు. —టి. వి



ఇటీవల ఇంగ్లండులో జరిగిన వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో పాల్గొన్న బిల్లీజీన్ కింగ్ స్త్రీల టెన్నిస్ పోటీలలో నూతన రికార్డును స్థాపించారు. ప్రపంచ వరంగా జరిగే ఈ పోటీలలో తొలిసారిగా ఆమె పద్దెనిమిదేళ్ళ క్రితం పాల్గొన్నారు. అమెరికాకు చెందిన శ్రీమతి కింగ్ వయసు 35. ఇంతవరకూ ఆమె ఆరు సింగిల్స్ పోటీలలోనూ, పది విమెన్స్ డబుల్స్, నాలుగు మిక్స్‌డ్ డబుల్స్‌లోనూ గెలుపొంది మొత్తం వింబుల్డన్‌లోనే 20 మార్లు బహుమతులు పొందిన ఘనత సంపాయించారు.

అంతకు ముందు బ్రిటన్‌కి చెందిన ఎలిజబెత్ రయన్ 19 మార్లు (12 డబుల్స్, 7 మిక్స్‌డ్ డబుల్స్‌లలో గెలుపొంది) వింబుల్డన్ ఛాంపియన్ షిప్‌లలో గెలుపొంది రికార్డు సృష్టించారు. ఆమె 1914-34 మధ్యకాలంలో ఈ పోటీలలో పాల్గొన్నారు. విషాదకరమైన విషయమేమంటే వింబుల్డన్ పోటీలు తిలకించడానికి వెళ్ళిన ఎలిజబెత్‌రయన్ జూలై 6న వింబుల్డన్ కోర్టులలో నడుస్తూ వుండగా స్పృహ తప్పి పడిపోయారు. ఆ రోజే ఆసుపత్రిలో ఆమె మరణించారు. ఎలిజబెత్‌రయన్ వయసు 88.

సరిగ్గా ఆ మర్నాడే (జూలై 7) అంతవరకూ 19 మార్లు వింబుల్డన్‌లో గెలుపొంది ఎలిజబెత్ రయన్‌తో సరిసమానంగా తూగిన బిల్లీజీన్ కింగ్, ఈ సంవత్సరం వింబుల్డన్ స్త్రీల ఛాంపియన్ అయిన మార్టినా నావ్రతిలోవాతో కలిసి ఆస్ట్రేలియాకు చెందిన వెండీటర్నర్, నెదర్లాండ్స్‌కి చెందిన బెట్టిస్టోవ్‌ల మీద డబుల్స్ పోటీలలో విజయం సాధించారు. ఆ విధంగా 20 మార్లు వింబుల్డన్‌లో ఆమె గెలుపొందడంతో ఎలిజబెత్‌రయన్ రికార్డుని అధిగమించారు.



శ్రీకాకుళం శ్రీనివాస మహిళా మండలి వారు యిటీవల ప్రముఖ వాయులీన విద్వాంసురాలు శ్రీమతి భారతీ మణికి సన్మానం చేశారు. ఆనాటి సభకు ముఖ్య అతిథిగా శ్రీమతి నాగుబాయమ్మ హయగ్రీవమూర్తి విచ్చేశారు. మండలి అధ్యక్షురాలు తిమ్మరాజు హైమవతి, ఉపాధ్యక్షురాలు దూసి సరోజిని, కార్యదర్శి గుడివాడ రామలక్ష్మి—తమ సంస్థ కార్యకలాపాలలో యికపై సంగీత శిక్షణ కూడా ఒక విభాగంగా ప్రవేశపెట్టగలమని వాగ్దానం చేశారు.—టి.



బొంబాయి తెలుగు సాహిత్య సమితి వారు యిటీవల 'విచిత్ర వేషధరణ' పోటీ నిర్వహించారు. ఆ పోటీలలో 'అర్ధనారీశ్వరుడి' వేషధారణతో పాల్గొన్న కుమారి జయంతి శ్యామల బహుమతి పొందారు.



ఆంధ్రప్రదేశ్ ఐ. ఏ. ఎస్. ఆఫీసర్స్ వైవ్స్ అసోసియేషన్ వారు యిటీవల 450 జతల దుస్తులను తుపాను బాధితుల పిల్లల సహాయార్థం ప్రకాశం జిల్లాలో పంపిణీకోసం ముఖ్యమంత్రి సతీమణి శ్రీమతి సావిత్రీ చెన్నారెడ్డికి అందజేశారు.

—మల్లిడి కనకరత్నం

హైద్రాబాద్‌లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన పోటీలలో కూచిపూడి నృత్యంలో ప్రథమ బహుమతి పొందిన జె. అనూరాధకు రాష్ట్ర ఆర్థిక శాఖామాత్యులు శ్రీ రాజారాం అకాడెమీ షీల్డును, యోగ్యతా పత్రాన్ని బహూకరించారు. —నాగలక్ష్మి



రాజమండ్రి టౌన్‌హాల్‌లో యిటీవల వీరేశలింగం పంతులుగారి 60వ వర్ధంతి సందర్భంగా స్వీయ కవితా పోటీలు జరిగాయి. ఆ పోటీలో తొమ్మిదేళ్ళ బాలిక పులపర్తి ఉష ప్రథమ బహుమతి పొందింది.



హైద్రాబాదు వంశీ ఆర్ట్ థియేటర్స్‌వారు తమ 83వ కార్యక్రమం యిటీవల స్థానిక త్యాగరాయ గాన సభలో జరుపుకున్నారు. ఆనాటి కార్యక్రమంలో శ్రీమతి మణి రఘునాధ్ (నేపథ్యగాయకుడు పి. బి. శ్రీనివాస్ సోదరి) వీణ కచేరి చేసి పలువురి ప్రశంసలు అందుకున్నారు.



## ఐ. పి. ఎస్. పరీక్షల్లో వనితకి ప్రథమ స్థానం!

పోలీసులు, పోలీసు శాఖ అంటే చాలా కఠినమైనది. క్లిష్టతరమైనది, అది మొగవారికి మాత్రమే చెల్లుతుంది అని అనుకునే ఛాందసులు నేటికీ వున్నారు. వారందరి నమ్మకాన్ని వమ్ము చేశారు అసిస్టెంట్ కమీషనర్ స్థాయికి ఎదిగిన శ్రీమతి కిరణ్ బేడి వంటివారు.

ఇప్పుడు ఈ సంఖ్య మరింత అధికం కాబోతోంది. అంతేకాదు. ఈ సంవత్సరం ఇండియన్ పోలీస్ సర్వీస్ పరీక్షలలో విజయవంతమైన అభ్యర్థులలో మొదటి స్థానాన్ని, రెండవ స్థానాన్ని, ఆరవ స్థానాన్ని సంపాయించినవారు స్త్రీలే కావడం విశేషం!

గత సంవత్సరం సెప్టెంబరు అక్టోబరు నెలల్లో జరిగిన ఈ పరీక్షలో కుమారి అదితీ ఘోష్ మొదటి స్థానాన్ని సంపాయించారు. కుమారి దీపాగోపాలన్, ఎమిలీదాస్ రెండవ, ఆరవ స్థానాల్ని పొందారు. మొత్తం మీద ముప్పైమంది వనితలు విజేతల లిస్ట్‌లో వున్నారు. అందులో ఇద్దరు వివాహితులు. ఇండియన్ పోలీస్ సర్వీస్ (ఐ. పి. ఎస్) తదితర పోలీస్ సర్వీసెస్‌లో కలిపి మొత్తం దాదాపు ఎనభై రెండు ఖాళీలు భర్తీ చెయ్యాలి. అందులో ముప్పై మంది స్త్రీలు కావడం చెప్పుకోదగ్గ విశేషమే మరి!

చీరాల రోటరీ క్లబ్‌వారి ఆధ్వర్యంలో యిటీవల లేడీస్ నైట్ కార్యక్రమం వైభవోపేతంగా జరిగింది. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో ఎడమనుంచి క్లబ్ ఉపాధ్యక్షురాలు డాక్టర్ ఎ. శారద, కార్యదర్శి ఎం. శోభారాణి, ముఖ్య అతిథి డాక్టర్ ఎన్. సుభద్రా దేవి, శ్రీమతి కోట భాగ్యవతి, అధ్యక్షురాలు జె. సుభోదరావు వున్నారు.






ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో బి. సుధామయి; రెండేళ్ళ పిల్లల గ్రూపులో ఎన్. రాజీ; మూడేళ్ళ గ్రూపులో పి. రాజీవ్ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితోపాటు, మొత్తంమీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నికచేసి ప్రచురిస్తున్నాము. సెప్టెంబర్ సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు-వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలురాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పిపంపడానికి తగినన్ని తపాలా బిళ్ళలు గల కవరు జతపరచాలి.) ఆగస్ట్ 5వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



**బి. సుధామయి (బొబ్బిలి) పుట్టిన తేదీ : 20-8-78,**
**తల్లిపేరు : బి. కామేశ్వరి**



**పి. రాజీవ్ (బెంగళూరు) పుట్టిన తేదీ : 23-8-76**
**తల్లిపేరు : పి. ఉషాప్రేమ్‌నాధ్**

**ఎన్. రాజీ (విజయనగరం) పుట్టిన తేదీ : 1-8-77**
**తల్లిపేరు : ఎన్. అన్నపూర్ణాబాబు**



**సి. దీప్తి (హైద్రాబాద్) పుట్టిన తేదీ :**
**తల్లిపేరు : సి. వి. రమణ 31-8-77**



**ఎస్. శ్రీకాంత్ (విశాఖపట్నం) పుట్టిన తేదీ :**
**25-8-78 తల్లిపేరు : ఎస్. జానకి**



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.




నిర్మాతలు: టి.గోవిందరాజన్, టి.ఎమ్.కిట్టు దర్శకత్వం: వి.మధుసూదనరావు నవయుగ

REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) August 1979.

# క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది




everest/78/PP/255-tl

క్రాక్‌జాక్ బిస్కట్లు-తియ్యగా ఉప్పగా నోరూరించేలా.